




మహాకవి

# ఆదిభట్ల నారాయణదాసు





సంపాదకుడు

యస్వీ. జోగారావు





ప్రకాశకులు

కర్రా ఈశ్వరరావు

తడవర్తి బసవయ్య

దానభారతి ప్రచురణ-2

# కచ్ఛపీశ్రుతులు

[కవితా సంకలనము]

మహాకవి

శ్రీ ఆదిభట్ల నారాయణదాసు

పరికల్పన

శ్రీ యస్వీ జోగారావు

ప్రకాశకులు

శ్రీ కర్రా ఈశ్వరరావు

శ్రీ తడవర్తి బసవయ్య

ప్రథమ ముద్రణ
ఆనంద శ్రావణి
[జూలై, 1974]

ప్రతులు : 1000



ప్రాప్తిస్థానము
కర్రా ఈశ్వరరావు
B. Com. (Hons), B. L., F. C. A.
Manager, Leaf Stocks & Supply,
I. L. T. D. Company, Guntur.

వెల : 10 రూకలు

ముద్రణ
పి. రామకృష్ణమూర్తి
మేనేజింగ్ డైరెక్టర్
వెల్కం ప్రెస్ ప్రయివేట్ లిమిటెడ్, గుంటూరు-2.



Adibhatla Narayanadas
Principal
Sri Vijayarama Ganapatasala.
Vizianagram.



"వాగ్వశీకృత సరస్వతి యెవ్వఁ డనిన వీఁ
డమ నాలుకకుఁ దొడవైన వాఁడు." —యస్వీ.

కవిసమ్రాట్ కళాప్రపూర్ణ పద్మభూషణ

డాక్టర్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

ఆంధ్రప్రదేశ ప్రభుత్వాస్థానకవి

జ్ఞానపీఠ పురస్కారగ్రహీత

# తొలిపలుకు

ఇది మహాకవి ఆదిభట్ల నారాయణదాసుగారు తదా తదా లిఖియించిన బహు పద్యముల సంకలనము. ఇందు వారు వ్రాసిన హరికథలలోనివి చేసిన ఆంధ్రీకరణ ములలోనివి కొన్ని స్వతంత్రములు వారి బహుముఖప్రజ్ఞ యెట్టిదో ఆ సర్వప్రజ్ఞను ఈ పుస్తకములో నున్న బహువిషయములు చెప్పుచున్నవి. వట్టి గాయకు డైనచో లోకము విస్మరింపగలదు. ఒక త్యాగరాజు, ఒక దీక్షితులు, ఒక శ్యామశాస్త్రి— అట్టివారి పేర్లు నిలువవచ్చును గాని తక్కినవారి పేర్లు నిలువవు. వారి పేర్లు నిలుచు టకు బహుకారణములు గలవు.

సంగీతవిద్యయందు నారాయణదాసుగా రంతవారని ప్రసిద్ధి. కాని వారి కృతుల వలె వీరి కృతులలో నెన్ని నిల్చునో తెలియదు. వీరు వట్టి గాయకు లైనచో మన మట్టి భయము పొందవచ్చును. వీ రెంత గాయకులో అంత మహాకవులు. కొన్నిచోట్ల గాయకులకంటె కవులయొక్క పేర్లు ఎక్కువగా నిలుచు ననిపించుచున్నది. అందు చేత వీరి రచన లన్నియు సంకలనము చేసి వారి ప్రతిభనుగూర్చి ప్రశంసించెడి గ్రంథము ఉన్నచో నారాయణదాసుగారి పేరు మరి కొంత కాలము నిలువగల దన్న యాశతో వారి యభిమాను లీ కార్యమును చేయుట ప్రశంసనీయముగా నున్నది.

ఆయన తన గ్రంథముల ద్వారా లోకమున కెన్నియో హితములు చెప్పినాడు, సందేశము లిచ్చినాడు, జనులు బాగుపడుటకు మార్గములు చూపినాడు. కనుక నటు వంటివారి మహాగ్రంథములు లోకమునకు గూడ మహోపకారకము లగును. మన జాతి, మన దేశము, మన సారస్వతము, మన దేశభక్తి, మన తెనుగు బాస యందలి వలపు మిక్కుటముగా ప్రతిబింబింపజేయు ఆయన రచన లవశ్యము చదువ దగినవి.

# భూమిక

రచయితల సహకార సంఘము అధ్యక్షునిగా, నా ప్రోత్సాహముతో, శ్రీ యస్వీ జోగారావుగారు "ఆదిభట్ల నారాయణదాస సారస్వత నీరాజనము" అను గొప్ప గ్రంథమును తమ సంపాదకత్వమున నిర్మింప ఒక బృహత్ప్రణాళిక వేసి అనేక కవి, పండితులచే వ్యాసములు వ్రాయించి, వాటివి చూచు సమయమున, శ్రీ నారాయణదాస రచనల నన్నిటిని ఆమూలాగ్రముగ చదివి, ఆకళింపు చేసుకొనిరి. అప్పటినుండి, సర్వకళా పరిపూర్ణుడగు దాసుగారిని కేవలము ఒక హరికథా పితామహునిగానే దేశము గుర్తించినదిగాని ఆయన వాస్తవ స్వరూపమును తెలిసికొనకపోవుటచే ఆయనను లోకము మహాకవిగా గుర్తించలేదను ఆవేదనతో శ్రీ జోగారావుగారు రెండు సంవత్సరములనుండి నాతో ప్రస్తావనగా శ్రీ నారాయణదాస సమగ్ర స్వరూపమును లోకమునకు తెలియవలెనన్న మూడు కార్యములు ఆవశ్యము చేయవలెను. (1) ఆయన కవితాసౌందర్యమును తెలుపుటకు ఆయన సర్వ కావ్యములనుండి మంచి కవిత్వముతో కూడినవి, స్వతంత్రముగా (కథా సందర్భమును విడిచి) అర్థముచేసుకొనుట కనువైనవి, అగు చక్కని పద్యములను, ఏర్చికూర్చి పద్య సంకలన గ్రంథముగా ముద్రింపవలసిన ఆవశ్యకత (2) వ్యాస సంపుటి—విమర్శాత్మక సృజనాత్మక వ్యాస సంకలనము. (3) సంగీత తరంగిణి : వారి కృతులలోనివి, కొన్ని పాటకచ్చేరిల కనువగునట్లు ఏర్చి, కూర్చి, స్వరపరచి, అపురూపములైన దాసుగారి కృతులు, కీర్తనలు,—ఒక సంగీతజ్ఞుని పర్యవేక్షణలో ఈ పుస్తకమును ముద్రించుట అని దృఢముగా చెప్పిరి.

ఇట్లు పై మూడు పనులు ఎంత త్వరలో చేసిన అంత మంచిదని, నా ప్రియ మిత్రులు, సాహిత్యవేత్తలు మహాకవులు అయిన శ్రీ జోగారావుగారు పదే పదే చెప్పినందువల్ల, స్వరూపమును దాల్చుచున్న దాసభారతీ ప్రచురణలలో—ద్వితీయ కుసుమముగా వారి సంపాదకత్వమున వెలువడినది 'కచ్ఛపీ శ్రుతులు, "విద్వానేవ విజానాతి విద్వజ్జన పరిశ్రమమ్" అన్నట్టు ఒక మహాకవి పరిశ్రమ, ఒక మహాకవియే గుర్తించగలడు. మహాకవి నారాయణదాసు రచనలు, అన్నియు చదివి ఆకళింపుచేసుకొని, లోకమునకు తన పరిశీలన విషయములు చెప్పవలెనని, మహాకవి మధుర సరస్వతి బిరుదాంచితులు శ్రీ జోగారావుగారు పూనుకొని తన ప్రథమ ప్రయత్న మీ "కచ్ఛపీశ్రుతుల" రూపమున లోకమునకు ప్రదర్శించిరి. వారి పరిశ్రమ విలువైనది. వెలకట్టుటకు వీలులేనిది. వారి కృషికి శ్రీ నారాయణదాస వర్యులు సంతోషించి, దివినుండియే వారిని ఆశీర్వదింతురు. నిస్వార్థమైన సేవ వలన కలుగునది ఆత్మతృప్తి, భగవదాశీర్వాదము, పెద్దల ఆశీర్వాదము మాత్రమే.

శ్రీ జోగారావుగారు ఒక పని తలపెట్టిన, అహర్నిశములు దాని వెంటబడి పూర్తిచేయువరకు విశ్రమింపని దృఢదీక్షాపరులు, అటులనే ఎన్ని పనితొందరలున్నను, వాటి నన్నిటిని వెనుకపెట్టి దాస సాహిత్యమును మథించి ఈ రత్నములు వెలికితీసి ప్రతి పద్యమునకు సరియైన నామకరణముచేసి, ఆ పద్యములన్నియు అచ్చువేయుటకు అనువుగా తిరిగి వ్రాసి, వ్రాయించి, ముద్రణ ప్రతులలోని తప్పులుదిద్ది, యావద్భారము తన నెత్తిన వేసుకొని, ఈ పుస్తకమును ఇంతటి మనోహర రూపమున అందించినందులకు వారికి నా కృతజ్ఞతాభివందనములు.

అంతియేగాక, శ్రీ నారాయణదాస సమగ్ర స్వరూపమును లోకమునకు అందజేయు వాంఛతో, వారి సూక్తులు, జీవిత పంచాగము, నారాయణదాస గ్రంథావళి వాటియొక్క స్వరూప స్వభావములు వెల్లడించుచు, చక్కని చిక్కని భాషతో ప్రతి గ్రంథ స్వరూపమును సంక్షిప్తముగా పఠితల ఉత్సాహమును ఇనుమడింపచేయునట్టుగా సమీక్షించి తుదిని అనుబంధ రూపమున ప్రకటించిరి. సాహిత్యాచార్యులుగా శ్రీ నారాయణదాస కవిత్వముపై ఒక సమగ్రమైన సాహిత్య సమీక్ష చేసి చదివి దాస స్వరూపమును పూర్తిగా అవగాహన చేసుకొనుటకు వీలుగా తెలుగు M. A. విద్యార్థులకు సైతము అనువుగా ఒక చక్కని ప్రౌఢమైన సాహిత్య విమర్శనముకూడ వారి సంపాదకీయమున మన కందించిరి. తమ అమూల్య కాలమును వెచ్చించి శ్రీ నారాయణదాసుగారి యందలి భక్తి శ్రద్ధలతో వారి గ్రంథములన్నియు ఆమూలాగ్రము చదివి, శ్రీ దాస జీవితము, వ్యక్తిత్వము, సాహిత్య వైభవము, మున్నగు సర్వవిషయముల గురించి ఒక పరిశోధన సంపాదకీయ రూపమున తెలుగు పాఠకులకు ఇట్లు అందించినందులకు వారికి మరియొకమారు నా మనఃపూర్వకాభివందనములు. ఈ పుస్తకము అచ్చువేయుటకు తోడ్పడిన శ్రీ తడవర్తి బసవయ్యగారు, మాయొక్క సముద్దేశమును వారికి విన్నవించిన వెంటనే, మాకు చేయూతనిచ్చి సుమారు 60 పుటలు ఉషశ్రీ ముద్రణాలయమున అచ్చువేయించి మాకు ఇచ్చి, ఈ కార్యక్రమము వెంటనే ప్రారంభించుటకు కారణభూతులైరి. వారికి మా ప్రత్యేకాభి వందనములు.

తెలుగు పాఠకులు శ్రీ దాస కవిత్వము చదివి, ఆకళింపు చేసుకొని ఆనందించి మా ప్రయత్నమును సార్థక పఱతురుగాక।

కర్రా ఈశ్వరరావు
ప్రకాశకుడు

**Prof. S. V. JOGA RAO, M. A., Ph. D.**
**Head, Tel. Dept., A. U. P. G. Centre,**
**President, Guntur Dt. Writers' Coop. Society,**
**[Formerly Professor, Leningrad University]**

# సంపాదకీయము

## ప్రరోచన :

ఒక పుంభావ సరస్వతి ఒక బహుముఖ సారస్వత ప్రపంచ విరించనుడు విని పించిన కవితాకళా కల విపంచీ ముఖ వికస్వర స్వరములను విని పరవశించిన యొక మహాభాగ్యశాలి మధురహృదయ స్పందనము లీ పలుకులు.

సంగీత సాహిత్యము లా మహామహుని యుచ్ఛ్వాస నిశ్వాసములు, భక్తి దేహము, భావము దేవుడు, రసజ్ఞత రూపము, బ్రదుకంతా యొక సుదీర్ఘ హరికథ, కృత ప్రతి హరికథాకాలక్షేపము సకల కలా నిక్షేపము, సరస్వతి పేరోలగము. ఎవడాయన ? ఇంకెవడు! రసవజ్జీవిత మహేతిహాసుడు శ్రీ ఆదిభట్ల నారాయణదాసుడు. అన్నివిద్యల కాచార్యపీఠమైన ఆయనకు గురువు లేడందురు. లేకేమి! జగద్గురువైన భగవంతుని అంతేవాసియైన ఆయన కలవడని కళ లేదు. సాధ్యముకాని విద్యలేదు.

## దాసభారతి :

జీవితము నొక కాలక్షేపముగా గాక ఒక కఠోర వ్యాసంగముగా ఒక కళాకేళిగా ఒక మహాతపస్సుగా ఒక మధురానుభవముగా గడపిన మహాభాగు డతడు. అతని పండిన గుండెనుండి బాహిరిల్లిన దొక బహుముఖీన సాహిత్యము. అందు శ్రవ్య దృశ్య కావ్యములు గలవు హరకథలు గలవు, హరికథలుగలవు శతకములు గలవు. వ్యాసములుగలవు. విమర్శలు గలవు. పద పద్య గద్యములు వేసిన వాలకము లనేకము గలవు. బహు భాషా వైదుష్య ఫలములు గలవు. కాని చిత్రము, అంతటి సారస్వత మహాస్రష్టకు అంతటి కవితాంతర్ద్రష్టకు హరికథా పితామహుడుగా మాత్రమే పేరు మిగిలినది. ఆది శంకరు డంత మహాకవియూ, వివేకానందు డంత విశ్వకవియూ కాని చివరికి ప్రవక్తలుగా మాత్రమే వారు లబ్ధ ప్రతిష్ఠులైరి. ఒక అన్నమయ్య, ఒక క్షేత్రయ్య, ఒక త్యాగయ్య - కవితా సరస్వతీ కళాస్థానము లంటిన సరసాగ్రేసర చక్రవర్తులయ్యు వీను మిగిలిన వాగ్గేయకారులుగా మాత్రమే వాసికెక్కిరి. కవి చరిత్ర గ్రంథము లందు వారి పేరులు కానరావు. ఏల ? వారి వారి ప్రధాన కర్మ

క్షేత్రములు వేరువేరు. అట్లే యైనది ఆదిభట్ల వారి సంగతి. కవిత కాదు వారి ప్రధాన కర్మ క్షేత్రము. హరికథ వారి జీవిత సర్వస్వము.

## గ్రంథపరికల్పనసముద్దేశము :

వారి 46 కృతులలో 14 హరికథలు (14 సంపుటములు - 21 కథలు). హరిదాసులు వల్లె వేసి కొనుటయే గాని వానికి సాహిత్య జగత్తున పతన పాతనములు లేవు. 13 అచ్చ తెలుగు కృతులు. ప్రాచీనములైన అచ్చ తెలుగు కృతులే తెలుగు వారి కచ్చివచ్చినవి కావు. ఒక యెనిమిది కృతులు కేవల సంస్కృత భాషా ఘటితములు. అన్యుల గీర్వాణమునకును హర్షించు ఆంధ్రులు తమ సంస్కృతము నెందులకోగాని అంత నరకు సేయరు. మిగిలిన వానిలో సుమారేడు అనువాదములు. సంస్కృతము నుండి చేసిన తెనిగింపులను దాసుగారు అచ్చ తెలుగుననే వెలయింతురది వారి శపథము. కాతున్న ఆదినుండి అనువాద సాహిత్యమున కలవాటు పడిన మనవారు కవీస మీకృతుల నైన కాతరు చేయకుందురా ? అయా కారణములచే దాసుగారి సాహిత్యమునకు రావలసినంత పేరు ప్రతిష్ఠలు రాలేదు. కాని ఆ హరి కథలలో అపురూపమైన క్రమకవితాగానముకదు. ఆ అచ్చ తెలుగు కృతులలో వెనుకటి కృతుల కంటెను వెక్కసమైన నియమ మున్నను అతిమాత్రమైన హృద్యమైన వైశద్య మున్నది. సర్వ పూర్వాంధ్ర ప్రౌఢ ప్రాబంధికుల గాఢపాక మగు సంస్కృతమునకు లేని చవి యున్నది. ఆ సంస్కృత కృతులలో కింకుర్వాణ గీర్వాణములైన ప్రయోగవిశేషములు గలవు. కాళిదాస కళాకౌశలము గలదు. కాదంబరీ స్వాదుత్వము గలదు. పండిత శుండాలముల శ్లాఘా శిరః కంప సమర్థ సామగ్రి గలదు. ఆ యనువాదములు మూలము మాలిమిని దక్కగొన్న వయ్యు స్వతంత్ర కృతి ప్రతిపత్తిని గల్గి నట్లు కౌశల పేశలములై యున్నవి. ఆ యీ యోగ్యతల కన్నిటికిని తగిన తార్కాణగా ఇదిగో గ్రంథ మిక్కడనే యున్నది.

## గ్రంథ స్వరూపము :

ఈ గ్రంథ మొక సంకలనము. దాసుగారి కవితా సుమారామ మధుకోశము. ఉపలబ్ధములగు వారి కృతులను సప్తధా విభాగించితిని—హరికథా సారణి, కావ్య సారణి, శతక సారణి, రూపక సారణి, అచ్చిక సారణి, సంస్కృత సారణి, అనువాద సారణి యని. ఒక్కొక సారణియందు ఆ యా తరగతుల కృతులనుండి సందర్భ నిరపేక్షముగా సరసార్థ వ్యక్తిగల చక్కని కవితాంశగల పద్యముల

కతిపయముల నొక కతిపుట పరిమిత సంపుటమునకు మాత్రము సరిపడు వస్తువిన్నిక చేసి ప్రతిపాదిత విషయస్వభావమును బట్టి వ్యపదేశ మొనర్చితిని. దాసుగారి కృతులనిండ భక్తిబంధురోక్తులు, సూక్తులును కోకొల్లలు. వానిని త్వరలో "భక్తి సుధ", "సూక్తి సుధ" అను పేరున ప్రత్యేక కృతులుగ దానభారతి ప్రచురణముగ వెలయించు సంకల్పముతో వాని నెక్కువగ నిందు గ్రహింపలేదు. అయితే గ్రంథాంతమున దాసుగారి దౌహిత్రులు కీ. శే. ఉపాధ్యాయుల సూర్య నారాయణరావుగారు సేకరించిన సూక్తులందు కొన్నిటి నొక అనుబంధముగా చేర్చితిని. మరియొక అనుబంధమున జిజ్ఞాసువుల కోసము దాసుగారి జీవితమందలి ముఖ్య సన్నివేశములను వారి జీవిత చరిత్రలను, స్వీయ చరిత్రను, నాటి వార్తా పత్రికలను ఆధారము చేసికొని కాలక్రమానుస్మృతమైన యొక పట్టికగా రూపొందించితిని. మూడవ యనుబంధమున నారాయణదాస గ్రంథావళి గురించి అవసరమైన వింగడింపుల క్రింద ఆ యా గ్రంథముల స్వరూప స్వభావముల గురించిన స్థూల నిర్దేశము, ముద్రణ ప్రచురణాదికము గురించిన వివరములును గలవు. ముందు విషయసూచికలో గ్రంథస్థ సర్వ విషయములు యథోదాహృత క్రమముగ చూపబడి నప్పటికి చివర నాల్గవ యనుబంధమున పాఠకుల సద్యశ్శీలన సౌకర్యార్థము అకారాది విషయానుక్రమణిక చేర్చబడినది. అయా విషయముల గురించిన ఆకరములు గ్రంథ శరీరమునందే తత్రతత్రోచితముగా ఉదాహరింపబడినవి. గ్రంథ శరీర గతములు కావలసిన మరికొన్ని యంశములు పరస్తాత్పరికల్పితములు అనుబంధములకు ముందే "పరిశిష్ట" శీర్షిక క్రింద సమీకృతములు. ఇదీ గ్రంథము యొక్క స్వరూపము.

## కవిత్వ పరమార్థము :

ఇక కవితానుశీలన మించుక. శ్రావ్యమైన శబ్దముద్వారా రమ్యమైన అర్థమును హృద్యమైన అనుభూతిగా పరిణమింప జేయుచది కవిత్వమని నే నెరిగిన సర్వ నిర్వచనముల సారాంశము. శ్రావ్యమైన శబ్దము అనగా అనురూప శబ్దజాల పునః పునరావృత్తి యని కాదు. లేక కొంద రనుకొనునట్లు ఉచ్చారణ సులభములై చర్మ శ్రవః పేయములైన పనియుగాదు. సందర్భ సుందరములై తదర్థశక్తి సందీపకములై ఝటితి స్ఫురణకరణ పటువులై వీనులున్న మది కించునట్టివి. రమ్యమైన అర్థమనగా రాకేందు రేఖకాదు, రాజీవ రాజికాదు, రజనీ ప్రియసఖము రమణీ మణి ముఖము కాదు - కవి కవీవికాపునీత మైన యొక నిష్ఠుర కుష్ఠరోగి కృమికుల సంకు

తతులాయము కాయము, ఒక మష్టివాని ముదనష్టపు మొగము కూడ రసజ్ఞజనమనోజ్ఞ ములే యగును. అలౌకిక లక్షణమైన రసానుభవ రహస్య మదే. హృద్యమైన యను భూతి యనగా ఉషస్సుషమాసుభగమైన యొక శుభ సమయమున ఉపరితల మరు కాదుణ కుండలిత శిలామండలమై, శిఖరాంచలము సద్యోభ్యుదిత బాలభాను రోచి ర్వీచీ సముజ్జ్వలమై, హిమనిర్ఝరోప క్రమ రమణీయమై కన్పట్టు కాంచనగంగాశైల శృంగమును చూచినంత కలుగు సురుచిరానుభూతి కాదు ఆ మహిమాలయమైన హిమాలయ దృశ్యమున శశాంక శేఖరుని జటా విటంకము స్ఫురించవలె. ప్రియ వల్లభయొక్క సల్లలిత సంగీతము విన్నప్పుడు కాదు తదుపరి తదాయల్లక భరమున మన్నప్పుడు మనఃకర్ణ కుహరమున ఆ మధురస్మృతి మారెలుగిచ్చునప్పు డదీ యనుభూతి. వరుసపెట్టి జిలేబీల నొక యుద్ధసేరు అరగించినప్పుడు కాదు అపూప విపణిలో అద్దముల ముందు అందమైన పళ్లెరమునందు తీరుగా పేర్చబడిన పలు పేటల కెంపుల దవురుగళ్లల వలె నున్న వానిని నోరూర కన్నార గాంచినప్పు డదీ గుండియ గుత్తగొన్న యనుభూతి. అయా వస్త్వింద్రియ సన్నికర్షము వలన అప్పటి కప్పు దేదో యొక లౌకికవాసనా వాసితమైన అనుభూతి ప్రతి పశువు శిశువు క్రిమి కీటకము గూడ పొందును అనుభోక్త మానవుడే కానక్కర లేదు. సర్వ జ్ఞానేంద్రియములకును సాక్షిభూత మైనది మనస్సు. ఆ మనశ్శక్తి పండిన అదృష్ట వంతుడు మానవుడు. జన్మతః ప్రాప్త సంస్కారముతో, స్వయం కృషి ప్రలబ్ధ పరిణతితో, ఆలోచనాశీలమైన మనస్సుతో, నైక భావ వ్యక్తీకరణ శక్తిమంతమైన వాక్కుతో పశుప్రపంచము నుండి తన పార్థక్యమును సార్థకముగ నిరూపించుకొని ఏ విషయము నైన ఆత్మసాక్షికముగ అనుభవించ గలవాడు ఆవిష్కరించ గలవాడు మానవుడు. అందుచే అతడు పొందు అనుభూతి మందలో నొకడు పొందినట్లుండ గూడదు. మందిలో నొకడు పొందినట్లుండవలె. కేవల రుచిజీవి పశువు. అభిరుచి జీవి మానవుడు.

దాసుగారి కవితాశయములు :

పూర్వోక్త నిర్వచన పరమార్థమునకు లక్ష్య భూతమైన కవితాపదార్థము కావలసినంత గలదు దాసుగారి కృతులలో. ముందు కవి యన్నను కవిత్వమన్నను ఆయనకున్న ఆశయము లెట్టివో పరిశీలింతము :

"కవి స్స్రష్టా త్రయీ మూర్తిః కావ్య మేతచ్చరాచరమ్
న కశ్చి ద్వస్తుతో భేదః కార్యకారణయో స్తయోః"

అని వారి వక్కాణ (చూ. కచ్ఛపి–పుట 49). కావ్యము లోక మంతటిని లోగొనగలదనియు, కవి వేదమూర్తియైన భగవంతుని వంటి వాడనియు అనగా అత డొక మహాస్రష్టయనియు, కవికిని కావ్యమునకును గల యనుబంధ మనినాభావ మనియు అనగా కావ్య మతని అంతరంగ సంతాన మనియు భావము. అంతటి ఆకాశములో లోకబాంధవు డనిపించుకొన్న వాడెట్లు ఏకైక వ్యక్తిగా రాణించుచున్నాడో అట్లే లోకములో ప్రతిభావంతుడైన కవి యొక్కడే పరమ విశిష్టుడుగా పరిగణింపబడునవియు, చతుర్విధ పురుషార్థములకును కావ్యమే ఏకైక సాధన మనియు, సంగీతము పుష్పమైతే సాహిత్యము తత్పరాగ మనియు, ఆస్తికత యే ఫలమనియు కైవల్యమే తద్రస మనియు దాసుగారి యభిప్రాయము (చూ. పుట 49). మరియొకచో ఆయన సత్కవి యొక్క అంతర్యము నిట్లు సంభావించిరి – అతడు సర్వరసాత్ముడు, సర్వభూతమయుడు, పరవశ సుఖయోగుడు, చిత్ర సంకల్ప భోగుడు, దైవాధీన మనః ప్రవృత్తి గలవాడు గాక స్వతంత్ర రచనానిపుణుడు, దయార్ద్ర చిత్తుడు, సత్య నిష్ఠుడు, కళాచణుడు అని (చూ. పుట 79). కవి యన్నను, కావ్య మన్నను ఇంతటి సముదాత్త భావన చేసిన అంతర్వాణు లరుదు. సత్కవి లక్షణము లన్నియు ఆయన తనలోనికి తాను తొంగి చూచుకొని చేసిన నిర్దేశములే యని ఆయన నెరిగిన వారందరు గ్రహింపగలరు. సత్కవి తన కావ్య దర్పణమున సర్వపదార్థములను విశకలితముగా ప్రతిఫలింప జేయగలడు, అతని వలె లోక కల్యాణ కరణ మన్యుల కసాధ్యము, ఎంత ప్రతిభను ప్రదర్శించి శైలీలా లిత్యము జాలువార ఎంత రసవంతముగా చెప్పినను "తారాశశాంకము" వంటి కావ్య మసత్కావ్యమే యగునవియు వారి ఆశయము (చూ. పుట 50). ఆశయముకాదు ఆచరణము. తమ పలుకృతులలో వర్ణనల రూపముగను, ఉపమాద్యలంకారముల రూపముగను, విషయగతముగా తగిన సందర్భములు వచ్చినప్పుడు సరేసరి, ఎన్ని లౌకిక విషయములను వాని ప్రాణస్నాయువులను బట్టి పరిశీలించిరో చెప్పలేను. తమ హరికథాదిక కృతులలో భక్తిసుధలను సూక్తిసుధలను వికేపించుట కాదు దేశమంతయు తిరిగి తిరిగి ఊరూర వాడవాడల హరికథా కాలక్షేపములు సేయుచు నడుమ నడుమ సందర్భములు కల్పించుకొని భగవద్భక్తిని, దేశభక్తిని, సమాజ విమర్శను, భారతీయ భవ్యధర్మమును తన జన్మ కర్తవ్యముగ భావించి ప్రచారము చేసినారు దాసుగారు. 8-3-1933 న విశాఖపట్టణమున జరిగిన యొక మహాసభలో "శృంగార సర్వజ్ఞ" బిరుద ప్రదానమున కర్హులైన దాసుగారు తమ కృతులందు

సలలిత శృంగారమును సముచితముగ పోషించుటయేగాని తారాశశాంకకారుని వలె వెక్కడము ఇంచుకంత మేర మీరిన వారు గారు.

సహజకవితాశాలి :

"సహజ కవిత్వశాలి" గురించి చెప్పుచు వారు - ఏ వేదబములు లేక కావ్య దోషముల నుజ్జగించి ఆనందోపదేశములు జనానీకమునకు కలుగునట్లు జగద్ధితముగ కవిత చెప్పుననిరి. "వింతవలెఁ బ్రాఁత సంగతి న్వెల్లడించు" ననిరి (పుట 50). దాసుగా రెక్కువగా చెప్పినవి ప్రాతకథలే. కాని ఆ చెప్పుటలో ప్రతి ప్రత్న కథ యందు నొక నూత్న పరిష్కారమును జూపిరి. అసలు కవితలో నున్న రహస్యమే అది :

"దృష్ట పూర్వా అపిహ్యర్థాః కావ్యే రస పరిగ్రహాత్
సర్వే నవా ఇవా భాంతి । మధుమాస ఇవ ద్రుమాః ॥

అని ఆలంకారిక వచనము. సహజకవిత్వశాలి యనుటలో వారి యుద్దేశము Poet by temperament - అనగా "I am a poet in sprite of myself" అని వక్కాణించిన బైరను మహాకవి వంటి వాడని. అసలాయనయే ఆ సహజ కవిత్వ శాలి. ఏ విద్యా విషయమునను గురువు లేనట్లే ఆయనకు కవితా గురువులును లేదు. ఆయనకు కళలకు భగవంతుడే గురువు, విజ్ఞతకు లోకమే గురువు, కవితకు హృదయమే గురువు. సహజ కవిత్వ మనగా నెట్లుండ వలెనో దాసుగా రెంత చక్కగా చెప్పిరో చూడుడు;

గీ॥ సాగి కమ్మెచ్చునన్ వచ్చు తీఁగ కరణి
సాలె పురుగు కడుపులోని నూలు వలెను
దబ్బునన్ దొర్లిపడు కొండదార మాడ్కి
సహజ కవిత బయల్వెడి సన్నుతిఁ గను. (పుట 49)

ఆ యుపమ లనుపమములు. సత్య ప్రత్యయ స్థాపనాచార్యకములు. ఎట పట్టి చూచి నను ఆయన కవిత్వ మలవోక చెప్పినట్లుండును. సహజత్వ ముట్టి పడుచుండును. వ్యాసపీఠముపజ్జ బాసికపట్టు వేసికొని గంటముతో కవితాకలకంఠికి గండక త్తెర వేయునట్లుండదు. స్నానశాలలో జలయంత్రపు తుంతుర్వని మేన త్రుళ్ళిస లాడి నంత బయల్వెడలు కూనరాగము వలెనుండును. బహుజన్మాంతరసాంద్ర సంస్కార బలమున ఆయన అలవోకగా చేసిన అధరస్పందనము లందును మధురిమలు

తొణికిస లాడుచుండును. ఆ పద్యము లా పదము లా కూర్పు లా యూహలు ఫ్లాస్కునుండి కప్పులోపోసిన కాఫీ ద్రవనవోష్ణతవలె సద్యః స్వాద్యముగానుండును. సహజకవి - "బ్రతుకున సుంకం బెఱుఁగక - స్వతంత్ర రాజ్యంబు పేయు ప్రభువు వలె'.... పతివ్రత వలె, సత్యవ్రతి వలె నిత్యసంతోషియని యొకచో వాక్రుచ్చిరి (పుట 59). అంత సహజకవిత్వశాలి కనుకనే ఆయన అంత సర్వతంత్ర స్వతంత్రుడాయెను.

"ఎందుకో పెద్దలు పడిక ట్లేర్పఱిచిరి
యాట పాటలు గొల్పున కనువగునటు
తెల్లముగ నున్న నలిగిన తెన్ను మాని
త్రొక్కఁ బెడత్రోవ నా వంటి విక్కఁ బోతు" (పుట 48)

అది పెద్దలు నడిచిన క్షుణ్ణ మార్గ మైనను తన కంత పడదని గడుసుగా సూచించిరి. "మురారే స్తృతీయః పంథాః" అన్నట్టి దిది. అయితే మురారి గురుకుల క్లిష్టుడు. కవితా జీవాతువులైన కావ్య హేతువులలో ప్రతిభ గరీయసి. అది కవితకు ప్రాణ సారము. ప్రతిభా సహకృతమైన సృష్టి నిత్య ప్రత్యగ్రము. ఎప్పటికప్పుడేదో యొక నవ్యసిసృక్ష తత్స్వభావ జీవలక్షణము. అందుచే దాసుగారివలె ప్రతిభా సమగ్రుడైన కవి పూర్వకవి ప్రౌఢ మార్గములు తన కెంత నచ్చియున్నను తన పుంత తా నేర్పరుచు కొనును. జీవితమున మహాజన మార్గానుసరణ మవశ్య ముపాదేయమే గాని సాహిత్యమున ప్రతికవియు ఎవరి దారి వారు చూచుకొనుటమే మంచిది. ప్రతిభావంతులైన ప్రాచీన మహాకవు లందరు చేసినపని యదియే. లేకున్న కవిజగత్తున వారికొక వ్యక్తిత్వమే లేదు, విశిష్ట ప్రసక్తి యుండదు. దాసుగారి యూహ యదే.

### ప్రాచీనకవి ప్రతిపత్తి :

అయితే తృణీకృత బ్రహ్మపురందరుడైన ఆయన దుర్విదగ్ధులగు ప్రతిస్పర్ధులకొక పెడసరపు కొర్రువలె గన్పింతురు గాని హద్దుమీరిన యహంకారము గాదు వారిది. ప్రాచీనుల మీదను పెద్దల మీదను గౌరవములేని గర్విష్ఠులుకారు. తన "జగజ్జ్యోతి" కి తాను వ్రాసికొన్న పద్య పీఠికలో—

ఈకావ్య రచనకు వాల్మీకి కావలయును
తగును వ్యాసుఁ డొకండె శాస్త్రంబుఁ దెలుప

శక్తి లేమి నెఱిఁగియు లజ్జ నొఱంగి
వేత్తవలె వటియించెద విధిశమున."

అనియు, ఈ 'కచ్ఛపి' 50 వ పుటలో—

"కాళిదాసుని రఘువంశ కావ్యముఁ గనుఁ
గొనియు, భవభూతి నాటకమును జదివియు
బాణు గద్య మరసియుఁ గవనము జెప్ప
వెఱవఁ దద్దిర నా వంటి వెఱ్ఱివాఁడు"

అనియు తన వినీతిని మనస్సాను విన్రస్సుత మధురాభిరుచి ప్రవంతిగ ప్రకటించు కొనిరి. ఇంకను పలుకృతుల పలుతావుల వారి కవితాభిరుచులు కొన్ని ప్రకటితము లైనవి. ప్రహ్లాద చరిత్ర పీఠికలో—

"పూర్వ కవు లందరున్ గడు పూజ్యు లందు
భాగవతు లయి గోస్వామి పాకముగను
గృతు లొనర్చు నధికుల సంస్కృతమున జయ
దేవుఁ దెనుఁగునఁ బోతనం దెలిసి యెంతు"

అని చెప్పుకొనిరి. మరికొన్ని తావులగూడ వీరిరువురను ప్రశంసించిరి. దాసుగారికి వీరిపై నేదో ప్రత్యేకమైన మక్కువ యున్నదన్నమాట. దాని కింకేమి కారణమై యుండును! ఆ యిరువురు నీయన వలెనే జీవనమునను కవనమునను పరమ భాగవతులు, ద్రాక్షాపాక రిరంసువులు. అంతేగాక కడు పిన్నటనుండియు పోతన భాగవత మీయనకు భావగతము పంచవర్ష దేశీయమైన ప్రాయమున భాగవత పఠన ప్రావీణ్యమునకు బహుమతి నందిరి. ఉపరి పోతనయు నీయనయు సహజ పాండిత్యధురీణులు, అంత్యప్రాస ప్రవణులు, ప్రవీణులు. జయదేవుడు నీయనయు మధుర సంగీత మధిశాంతరంగులు. వెరసి మువ్వురును పరమభావుక పట్టభద్రులు. ఈయన కించునట్టి మరియొక జగదేక మహాకవి గలడు. "షేక్స్పియరుని వంటి కవి నభూతో న భవిష్యతి" అనియు, "తన కావ్య దర్పణంబున జగము నెల్లఁ జూపిన మహానుభావుఁడు భారతీయులలో వ్యాసుఁడు, ఆంగ్లేయులలో షేక్స్పియరని నా యభిప్రాయము" అనియు తన 'నవరస తరంగిణి' పీఠికలో ఢంకా బజాయించి చెప్పిరి. కాళిదాసు కంటెను షేక్స్పియరు నధికునిగా సంభావించిరి. దానికి కారణము షేక్స్పియరు కవిజగచ్చక్షు వగుటయేకాదు—"షేక్స్పియరుడు సహజ పండితుఁడు. స్వతంత్ర కల్పనా చతురుఁడు. పరుల కట్టుపాట్లకు లొంగక యథేచ్ఛగాఁ గావ్యంబు

లొనర్చెను. మఱియుం బెక్కు శబ్దంబులను విశేషార్థంబుల వినియోగిం చెను. కాళిదాసుఁడు ప్రాచీన నిబంధనములకు లోఁబడి కృతు లొనర్చె." (చూ. శ్రీ నారాయణ దాస వ్యాసపీఠము – పుట 183). ఈయన కచ్చివచ్చిన గుణములే షేక్స్పియరులో నున్నవి. అందులకే ఈయన కంత నచ్చినా డాయన.

సదసత్కావ్యవివేచనము :

ఆ షేక్స్పియర్కాళిదాసుల రసపోషణ విషయమై తాము రచించిన బృహద్గ్రంథము 'నవరస తరంగిణి' పీఠికలో సదసత్కావ్యముల గురించి తెల్పుచు దాసుగారు - "మనసున కింపగు శబ్దార్థ సమూహము కావ్య మనఁదగినది. జనుల కే శబ్దార్థసమూహమువలన మనసున కుల్లాసము గలిగి సత్కార్యాచరణమున కుత్సాహము కల్గునో యట్టిది సత్కావ్యము. జనులకు భయ శోక జుగుప్సా క్రోధ ములఁ బుట్టించి దుర్మార్గమునకుఁ బురికొల్పునది యసత్కావ్యము -" అవియు, అందులోనే కవిత్వ ముఖ్యలక్షణమును, ప్రయోజనమును విశదీకరించుచు - "రసము చెడనీయక యమకపుష్టిగ చెప్పుట, సందర్భశుద్ధి గల పదప్రయోగము, స్వతంత్ర ముగ కథను గల్పించి యపూర్వ మగు నూహం దెల్పుట, అతుకుంచక పద్దెము లల్లుట, పండిత పామర రంజకముగ మృదుమధురోచిత శబ్దంబుల న్పొందు పరుచుటయు కవిత్వమున ముఖ్యాంశములు. సర్వసాధారణానుభవమును యథోచితం బుగఁ దెల్పి జనుల హృదయంబుల కెల్ల రస ముప్పతిల్లం జేసి నీతి నో్ధించుటయే కవితకుందగు ప్రయోజనము" అని యుద్ఘాటించిరి. వేరొకచో - "ఖ్యాతిమీర మంచి కావ్యమున్ విరచించి కవి తాను తరించి లోకమున్ దరింపించు" ననిరి. తమ ప్రహ్లాదచరిత్ర పీఠికలో - అంధప్రాయమైన పూర్వ ప్రబంధాను కరణమును గర్హించిరి. ప్రౌఢకల్పనల పేర అనుసృత మగు క్లిష్టభావనా మార్గమును విరసించిరి. అప్రసిద్ధములు అప్రయుక్తములు నగు పదముల ప్రయోగము నీసడించిరి. వైశద్య మనుపేర పేలవత్వము ప్రదర్శించుటను తెగడిరి. (చూ. కచ్చపి - పుట 18). లోకపు మానిసులలో తలచినట్లు చెప్పువారును, చెప్పినట్లు చేయువారును మిక్కిలి యరుదు. ఆ యరుదైన వారిలో మిగుల నరుదైనవారు భావితాంతఃకరణ శిరోమణి దాసుగారు. ఆయన ప్రకటించిన కవితాశయము లెల్ల ఆయనకవిత కవశ్యము చెల్లును.

ఒక మధురాశయము :

తమ దైన మరియొక మధురాశయమునే భంగ్యంతరముగ సారంగధర నాటకమున నిట్లు సూచించిరి :

సీ॥ చిఱుకాలపై జిలిబిలిఁబాఱు సెలయేటి
నీటిపై లకుముకి దాఁటు జూచి
నానాటి నలవాటు బూని మెల్లనఁ జేర
వచ్చు జింకల కూర్మిపాటు జూచి
మడుఁగులఁ జెలులాడి బెదిదపు టొడ్డులఁ
దొలియించు నేనుఁగుపోటు జూచి
దువ్వి ముద్దుగొనుచు దొడ్డపులుల తోడ
నాటాడు చెంచెత నీటు జూచి

వర్ణనము సేయుచున్ భూరి వనములందుఁ
బలురకంబుల పిట్టల పలుకులకును
స్వరము గట్టుచుఁ జెట్టుల పట్టందు
పద్యములు వ్రాయు భాగ్యంబు పట్టు నెపుడు!"

అసలు దాసుగారి వింత నిసర్గ మధుర ప్రకృతిని, బహుళ కళా సురభిళాత్మువి జేసి నది వారి యభిజన మజ్జూర నావరించిన సువర్ణముఖీ సజీవ స్రోతస్వినీ పరమ రమణీయ పరిసర ప్రకృతి. ప్రకృతిసవిత్రివి రసప్రసువుగా భావించిన ఆ మహాను భావు డా తరంగిణీ సముత్తుంగ తరంగముల గముల గలగలలలో తీరస్థ వానీర నికుంజ కికిదివి సంకుల కింకిరాత సమరకళా హళాహళి కలిత లలిత కల కూజితములలో వినిపించిన సంగీత సరస్వతి కచ్ఛపీశ్రుతులను కవిపించిన కవితా సరస్వతీ దరహాసములను తన కళాభిరుచి వికాసమునకు సంచకరువుగా గ్రహించెను.

## దాస కవితా దర్శనము

కవిత్వ మహత్త్వము :

దాసుగారి నిర్యాణానంతరము 29-1-1945 తేది ఆంధ్ర పత్రికలో శ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారు - "గానమునందు వలెనే కవిత్వమందుగూడ శ్రీ దాసుగారికి విశిష్ట స్థాన మీయక తప్పదు" అని వక్కాణించి యుండిరి. ఆ వైశిష్ట్య మెట్టిదియో యథావకాశముగ పరిశీలింతము. ఏ కవికైనను అతని సాహితీసర్గమునకు ప్రధానములైన యుపాధులు నాలుగు; ఊహాశాలిత (Imagination), అనుశీలనము (Observation), విషయజ్ఞత (Information), అనుభవము (Experience). కవి

సామాన్యుడైతే ఆత డే విషయము నే యుపాధి నాశ్రయించి ఆవిష్కరించుచున్నాడో తెలిపోవును. అదే మహాకవియైతే ఆతడు సర్వమును అనుభూతి సాక్షికముగనే ఆవిష్కరించినట్లుండును. అయితే మహాకవియును సామాన్యకవివలె పంకిమోప జీవియే. ఇరువురి అనుభవ పరిణాహమునకు నొక అవధి యుండును. ఆతడెంత మహాకవియైనను తత్కావ్యగత సర్వవిషయములు నతని అనుభూతి పరిధిలోనివే యై యుండుట కవకాశములేదు. కాని యతడు ప్రతి విషయమును తన ప్రతిభాప్రకర్ష మున మనశ్చక్షువు ముందు సాక్షాత్కరింపజేసికొని అంతస్సన్నిధి చేసికొని తా నమభ వించినట్లుగనే ఆవిష్కరించును. అందులకే సామాన్య కవుల వాక్కులు చెవికెక్కవు. మదికించవు. అందు పేలవత్వమే గాని మార్దవ ముండదు. కాఠిన్యమే గాని మసృణత్వముండదు. మహాకవుల వాక్కులు పద్యోహృద్యములు సహృదయ నైవేద్యములు, శక్తిమంతములు, అర్థగంభీరములు, చిరస్మరణీయములు. లోకమున శృంగారమును పోషించిన కవు లెందరు లేరు ? అందులో నెందరు కాళిదాస భట్టబాణ జయదేవామరుకుల చాయలకు రాగలరు ? అట్టి మహాకవులును కాక వట్టి సామాన్యులనుగాక మధ్యస్థముగా మరియొక కోవ కవులుగలరు - విగగ్ధమాత్రులు. తరచు మన మెప్పులకు పాత్రులైన కవులలో ముఖ్యులు ముప్పీసము వీరే. సామాన్యకవుల చేతిలో ఇత్తడి యిత్తడియే, పుత్తడి పుత్తడియే; పిందలి పిందలియే పిప్పి పిప్పియే. అదే విదగ్ధుని చేతిలో నయితే విరాకార కనకశలాక నిపుణతమై నగిషీలు చెక్కుకొనును, నగల రూపము ధరించును. మహాకవి చేతిలో ఇత్తడి గూడ పుత్తడియగును. ఇదే భేదము. ఆ కోవకు చెందిన మహాకవులలో కోటికి పడగెత్తిన వాడు నారాయణదాసు. ఏమందురా ? —

తరువోజ॥ తొల్లింటి వారు చదువుకొను పెల్ల
తోడివారలకుఁ బెంద్రోవ జూపుటకు,
మల్లి పుట్టెడు తెవుల్ మాన్పించు మంచి
మందిచ్చి విచ్చలిం బ్రతికించు కొఱకు. (కచ్చపి-పుట 48)

భారతీయుడైన మహాకవియే అనగలడీ మాట.

"ధరణిం జీఁకటివేళ దవ్వు వెలుఁగున్ దర్శించు కందోయికి
న్మరీ యే వస్తువులైనఁ దోఁచనటు విన్ ధ్యానించు నవ్వావిక
ద్దిర యీ లోకవికారముల్ మది రవంతేనిం గవన్రావుగా
అరయంగాఁ దన జీవితంబున మహాత్మా ! సూర్యనారాయణా !

(కచ్చపి - పుట 68)

అమరన్ బంగరునుండి దాని దగు చాయన్ వేఱుపేయంగ శ
క్యము కానట్టుల నిజ్జగం బెడపరా దయ్యారె విన్నుండి; చ
క్రమునం గోణము రీతి నారయఁగ నీతై్రిలోక్య మేపారి నా
శము నీ యందునఁ జెందుచుండు పరమేశా! సూర్యనారాయణా!

(కచ్ఛపి - పుట 58)

ఆ ఊహలలో నున్నది మహత్వము. వాని నుచితోపమముగ విన్యసించుటలో నున్నది కవిత్వము.

ఊహావైభవము :

దాసుగారి సముదాత్తమైన ఊహావైభవ మాయన సర్వకృతులందును దర్శన మిచ్చుచునే యుండును. ఆ వైభవ సాంద్రత నొక్కచో సందర్శింప వలెనన్న నిందలి సంస్కృత సారణియందలి 'తత్త్వదర్శనము', 'భక్త హృదయము', 'ఈశ్వర తత్త్వము', 'ఆదర్శ పురజనులు' అను శీర్షికలు చూడదగును. అయితే తదవగాహనకు తాదృశచక్షువు కావలసి వచ్చును. ఆ ముప్పదికి పైబడిన శ్లోకము లందు ఉదారోహ లేకాక ప్రతి శ్లోపమునందును కవితా కల్యాణి కటాక్షము లైన ఒక అలంకారమో, చమత్కారమో లేని శ్లోకమే లేదనవచ్చును. భావసంపద యందు ఆయన యెంత సంప్రదాయ విధేయుడో అంత సర్వతంత్ర స్వతంత్రుడు. అభ్యుదయ భావుడు; ఎంత ప్రాచీనుడో అంత నవీనుడు. ఎంత పారమార్థిక చింతకుడో అంత ఐహిక లోకజ్ఞుడు. తన భక్త దృక్పథమును స్థాపించు కొరకు శాస్త్రములను, కర్మకాండను జపతపములను, ద్వైతాద్వైతములను, జ్ఞానమార్గమును గూడ కాదనుటకు వెనుకాడలేదు. (చూ. కచ్ఛపి - పుట 58). క్రతు విరామమును కంఠోక్తిగా చేసిన సందర్భమునకు కచ్ఛపి - పుటలు 30, 31 చూడుడు. పూర్వోక్త పుటలందే దాసుగారి కెంత సత్యదయా ప్రత్యయబుద్ధిగలదో తెలియగలము. 'ఆదర్శ పురజనుల' ఖండికలో పరమ నవనాగరిక భావనను జూడగలము. ఆ సందర్భము లన్నిట ఆయన వ్యక్తిత్వము చక్కగా ప్రతిఫలించినది. కవి యొక్క సముదాత్త వ్యక్తిత్వము కళాత్మకముగ వ్యక్త మైనప్పుడే అక్కడ కవిత్వ ముండును, మహత్వ ముండును. ఆయన శతకము లన్నియు పార్శ్వముగ ఆయన వ్యక్తిత్వ వైశిష్ట్యము నభివ్యక్త మొనర్చినవి.

ఈ కచ్ఛపీశ్రుతులను బట్టి వారి విశిష్టోహలను, పటిష్ఠాభిప్రాయములను క్రమానుసార ముదాహరింతును. (పక్కనున్న యంకెలు ఈ గ్రంథమునందలి పుట

లను సూచించుమ). వారి యిష్ట మొక మతమునకు పరిమిత మైనది కాదు. సర్వ మత సామరస్యమును, సర్వ మానవ ప్రపంచ సౌభ్రాత్ర, సహజీవనములను కంఠోక్తిగా కోరుకొనిరి (1). పరిణామవాదమును విశ్వసించిరి. అయితే దానిని దశావతారములతో ముడిపెట్టిన వీరి ప్రజ్ఞ ప్రశంసనీయము (4-5). పరిణామవాద మునకట్టి సమన్వయము చేసిన వారిలో వీరే మొదటివారు. ఇది గజేంద్రమోక్షణ హరికథలో. తద్రచన 1886 లో. సగుణోపాసనను సమర్థించిరి. ఆ సమర్థనమును సార్థకము చేయుటకై వీరు ప్రతిపాదించిన ఔపమ్య మపురూపమైనది (6). ప్రబోధ వేళ దాసుగారొక ఉత్తమాచార్యులు. ధర్మదేవతాంశ వారి నావహించును. (9-11,16-21). లోకము యొక్క నాస్తిత్వము గురించి చెప్పునపుడు వారి కైవాదమును గనుడు :-

కం॥ కలిమి గల వాని - లేమిన్
గలవాఁడెటు లాశ్రయించి కలిమిఁ దెలుపునో
తెలియుఁడు లేని జగంబిది
యెలయన్ సర్వేశు నొద్ద నున్నటు తోఁచున్ (15).

గీ॥ కలదనిన లేదు, లేదన్నఁ గలదు జగము
నభమునందునఁ గస్పడు నల్పుమాడ్కి (24)

ఏ రూపముననను కడకు యజ్ఞరూపముననను పశుహింస పనికిరాదని వారి దృఢ విశ్వాసము (30,31,36,38). విద్య గురించి యొక విశిష్ట దృక్పథమును ప్రదర్శించిరి (42, 37). తన కాలేజీ అధ్యాపకుల యెడ ఆయన ప్రకటించిన గురుభక్తి అత్యపూర్వము (62-63). వీరి దేశభక్తి అనుపమానము (37, 44, 52). వీరి స్వరాజ్య కాంక్షకు, ఆదర్శస్వరాజ్య భావనకు అంతర్లాపిగా నడచిన తారక కావ్య మంతయు తార్కాణయే. కళాకౌశలము గూర్చి వీరి యూహ లపురూపములు.

“ఆటపాటలు మప్పుట కలవికాదు
ముక్కు చెవులట్లు మేనితోఁ బుట్ట వలయు”

నందురు. పెద్ద లేర్పరిచిన పడికట్లు మీరుటకు తాను తెగించితినని తెల్పిరి. భగవ త్ప్రసక్తి లేని కళాస్థితిని విరసించిరి. పరోపకారమే దాని పరమ ప్రయోజన మని యుద్ఘాటించిరి (46-49). వారి మహాభక్త హృదయమును పలుతావుల దిలకించి పులకించవచ్చును కాని యొక ప్రత్యేకతకై 57-59, 60, 61, 72-78 పుటలు పరిశీలింప దగును. ఆయా సందర్భములందెల్ల భావమున మహత్తర యున్నది, భాష

యందు వైశద్య మున్నది, ఏదో యొక రూపమున కవిత్వపు కళాయి ప్రత్యక్ష మగు చునే యున్నది.

దాసుగారి సర్వసారస్వతమును పరిశీలింప నక్కర లేకయే వారి 'మేలుబంతి' యను చాటు ప్రబంధమును, ఈ కచ్ఛపీశ్రుతులను జూచిన చాలు వారి యూహ పరిధిలోనికి రాజాలని వస్తువుగాని, వారి వాక్కుచే చైతన్యచకచ్చకితముగాని భావముగాని యుండబో దనిపించును. అంతర్ద్రిష్టయైన కవి యూహ కగమ్యమైన దేముండును? "కవిః క్రాంతదర్శీ" అని కదా ఆర్యోక్తి.

## వర్ణనా వైదగ్ధ్యము :

"నా నృషిః కవి రిత్యుక్త మృషిశ్చ కిల దర్శనాత్
విచిత్ర భావ ధర్మాంశ తత్త్వ ప్రఖ్యాచ దర్శనమ్ ॥
స తత్త్వ దర్శనాదేవ శాస్త్రేషు పఠితః కవిః
దర్శనా ద్వర్ణనా చ్చాథ రూఢా లోకే కవిశ్రుతిః॥"

అని కావ్యకౌతుక కర్త తౌతభట్టు సెలవిచ్చినాడు. అనగా ఋషి కానివాడు కవి కాలేడు. దర్శనమువలన ఋషిత్వ మబ్బును. చిత్రచిత్రభావములను, ధర్మ సూక్ష్మ ములను గ్రహింపగల ప్రజ్ఞయే దర్శనము. తత్త్వదర్శనము కవి లక్షణములలో ముఖ్యమైనదని శాస్త్రములు చెప్పుచున్నను అది వర్ణనా సహాకృత మైనప్పుడే కవి శ్రుతి లోకవిరూఢిని పొందుచున్నది. అందులకే—

"తథాహి దర్శనే స్వచ్ఛే నిత్యే ప్యాదికవే ర్మునేః
నోదితా కవితా లోకే యావజ్జాతా నవర్ణనా॥"

ఆదికవి వాల్మీకి యెంత అంతర్ద్రిష్ట యైనను ఆయన వర్ణనానిపుణుడగు నంతకు కవిత లోకమున ఆవిర్భవింపలేదు. మన ఆదిభట్టు ఎంతటి ద్రష్టయో ఉపరి నిరూపించితిని. ఆ ఋషికల్పుడు "వర్ణనా నిపుణః కవిః" అను ఆభాణకమున కెంతవట్టు లక్ష్య భూతుడో పరిశీలింతము. వర్ణన యనగా రసభావ ప్రాంగణ రంగవల్లిక. దాసుగారు హరికథ చెప్పుచున్నప్పుడు సరేసరి అదియొక సద్యోహృద్య రసానుభవ సమారాధన. ఆ సంతర్పణములం దెన్ని వర్ణనా వ్యంజనముల నెంత యొదుపుగా వడ్డింతురో చెప్ప వలవికాదు. కనీస మనుస్యూత కథాసూత్రముగల ఆయన కృతులను పఠించినను పఠిత యొకపాటి భావుకుడైనజాలు ఆ వర్ణనలవల్ల నగు కిట్టుబడి పదివేలు. ప్రకృత మీ 'కచ్ఛపి' యందలి వర్ణనలు కథాతంతువునుండి దూసిన విడిపూసలు. విడిపూవలేగావి విలువకు మణిపూసలు.

ఉదా॥ 1. చూ. పుట 2-కృత్తివర్ణన. పోతనగారి పంక్తి యొరవడిగ నురవడించిన యా వర్ణన భయానకరసభావ సముద్దీపకముగ నున్నది.

2. చూ. పుట 6-చంద్రోదయము :

"ప్రొద్దు పండుటాకు పోలిక రాలెఁ, గెం
జాయ చివురు లెత్తెఁ, గోయిల లనఁ
జెలఁగి కవిసె చీఁకటులు, పూచెఁ జుక్కలు
పెవి చందమామ పండు తోఁచె."

ఫలతరూపమ మగు నిట్టి యపురూపమైన చంద్రోదయ వర్ణన అంత పండువెన్నెల కాసిన మన ప్రబంధసీమలం దెందును నాకు కానరాలేదు. పరిశిష్టము పుట 8లో గల చంద్రోదయ వర్ణన ప్రబంధ సాధారణధోరణి నున్నది. 64వ పుట-చంద్రాస్త మయ వర్ణన యందు భంగ్యంతర వస్తువ్యంగ్య మున్నది.

3. చూ. పుట 6-సరోవరవర్ణన. తిక్కనవలె సమాసప్రచుర రచన విషయ మున పిసినారి యీయన. కాని పోతనను వలచి పెద్దనను తలచి యీ పద్యము పద్య మంతటి నేకసమాసధాటిగా నడిపించెను.

4. చూ. పుటలు 11, 12, 40, 41, 66, పరిశిష్టము 15, 16- ఈ పుటలం దెనిమిది పద్యములందు వేసవి వేళలు చక్కని వైవిధ్యముతో స్వభావోక్తి సుభగ ముగా వర్ణితములైనవి. అందొక మచ్చుతునక :

"ఔర ! గారడి సూర్యుండ ! అబ్బరంబు
కద బ్రదుకువలె నీ కరకౌశలంబు
అల్ప భౌమంబులన్ జూపి యధిక దివ్య
ములను గన్పట్టనీయక మోసపుచ్చు."

ఇందు—వీ కిరణ ప్రసరణ నైపుణ మాశ్చర్యకర మవి ప్రకృతార్థము. కాని హస్త లాఘవ విద్య అద్భుతావహాము గద అను నర్థాంతర చమత్కారము గూడ గమ్య మానము. అద్భుతత్వ విషయమై బ్రదుకుతోడి సామ్యము హృదయంగమము. పద్యాంతమున అల్పములైన ఆధిభౌతిక విషయములను ప్రకటించి అంతకంటె జీవికి పరమ ప్రాప్యములైన దివ్యముల గోచరింపనీయవను నుదాత్త గభీరమైన యూహ మృదంగ వాద్యమునకు ముక్తాయింపువలె నున్నది.

5. గ్రీష్మఋతు వర్ణనమునే కాదు కడమ ఋతువులను గూడ అలంకార దారువులుగా మలచిరి దాసుగారు. వసంతవర్ణన స్వభావోక్తి సురభిళముగ నున్నది (పుట 34). తొలకరి వర్ణనలో (పుట 41) చక్కని యుపమలు సందడించినవి. "దూది పింజెల లాగు దొడ్డమబ్బుల నేకి కరువలి పఱుపులుగా నొనర్చె" నట! మెఱుపుతో పుట్టిన యురుము వెండిచబుకును బోరగిలబడ వేసినట్లున్నదట! పెను గాలి సవ్వడి వానకాళ్లు అను తీగెలను బిగించి యాఱవ వడిలో వీణ వాయించు నెలి తాణగాణయొక్క పాటవలె నున్నదట. ఈ ఔపమ్యము దాసుగారి అనుభవపు టనుగు బిడ్డ. అర్ఘ్యవర్ణన (పుట 53-54) యందున్న పద్యములన్నిట ఉపమకును స్వభావోక్తివి పోటి పెట్టి యొక గొప్ప వినోదప్రదర్శన గావించిరి. ఆంధ్ర వాఙ్మయమున ఋతువర్ణన బాహాటముగా పలుగురు నడిచిన బాట. ఆ బాటలో క్రొత్తగా చిరు పచ్చికయు మొలకెత్తుట కష్టము. కాని ఆ బాట యందును దాసుగారి ఊహా యల్లికలు నవమల్లిక వల్లికలు. "న కావ్యార్థ విరామోఽస్తి యది స్యాత్ప్రతిభా గుణః"

6. పుట 7 - "జలధులు రోమకూపములు, శల్యము లద్రులు...." ఇత్యాది విరాడ్రూపవర్ణనమున ఆ మహా మహోమూర్తి స్వరూపచిత్రణము "అలంతి యలంతి తునియలం గాహాళ సంధించిన విధమున" నున్నది. సువర్ణదుర్గామహాదేవి యొక్క విశ్వరూప నిరూపణము నందు (పుట 32) అలంకారవిస్ఫురణము మరి అందగించినది.

7. పురవర్ణనలో రకరకముల చమత్కారములకు దాసుగారి చాటుప్రబంధము- "మేలుబంతి"ని చూడదగును. అందు 21 పుటలలో 34 నగరముల ప్రశంస గలదు. అందుండి యిందొక త్రిపురముల వర్ణన గ్రహింపబడినది (44-46). చతుర్భాషాసీసమున సాగిన పీఠికా పురవర్ణన లోగడ కడు ప్రసిద్ధమైనది. ప్రలోభ పడి పలు పత్రికలా పద్యమును ప్రకటించుకొన్నవి. నీలగిరి వర్ణనలో నింకొక చమత్కార మున్నది :

"వేసవి యెండ్రై నెం బ్రియమగుచుండు ని
ల్లాలి చూపుల పొంగయల్క మాడ్కి
హితమయ్యెడు నకాల హిమపాతమయ్యు వి
మందలి యుపవాన మటు"

ఇట్టి అలంకార చమత్కారము లందలి సార స్ఫురంగునకు కొంత్రైన నొంటబట్టిన

యనుభవ ముండవలె. మైసూరు పురవర్ణన మొక సంస్కృత దండకమున కంద గల సమాసములతో కడు చక్కగా సాగినది.

8. సౌందర్యము, అనురాగము, వాని ఆత్మబంధువు శృంగారరసము - ఈ మూటికిని దగ్గరి చుట్టము దాసుగారి హృదయము. అనుభవ సిద్ధులైన రసికులు వారు. "శృంగార సర్వజ్ఞ" సార్థక బిరుద ప్రతిగ్రహీతలు. ఆ విషయములందు వారి చూపు డేగ చూపు. పలుకు పావురా పలుకు. జగన్మోహినీ సౌందర్య ప్రస్తవమును (పుట 19) తానుగా జేసినప్పు డాయన ప్రకటించిన అభిరుచి యెట్టిదో పరికింపుడు - "చిరుగుంట కల్గిన చెక్కిలి", 'ముక్కు ప్రక్క మొదలు మోవి మూలవఱకు పొల్పారు వంక', 'హోయలుగఁ బల్చాలు నొకవంకఁ గనుపర్చు చిన్న నవ్వు', 'నడుమఁ జక్కని నొక్కు తొదరిన గడ్డము పొలుపు' - ఇవీ ఆయన కించునట్టి సోయగపు వాయనములు. ఆ యభిరుచి జీవితమున బహువారములు బహుభంగుల సుందర ముఖార విందములను బహిరంగముగా చూచుట మాత్రగాదు అంతరంగపు మెత్తని పొత్తిళ్లలో భావన చేసిన రసిక రాధికా ప్రియువిది గాని సామాన్యువిది గాదు. జగన్మోహినితో శివుని పలుకులుగా నున్న సీస పద్యమున (పరిశిష్టము - 1) వారిరువురికి చెలువమున గల పోలిక చమత్కార చారువుగా నిరూపింప బడినది. అంతేకాదు. జగన్మోహినీ సంబుద్ధులు నాల్గుపాదాంతము లందును - సారంగ గమన, సారంగ నయన, సారంగ చికుర, సారంగ పాణి అని యున్నవి. ఆయన యెట్లును సారంగ ధరుడు గదా. అంత సారంగోపమ యైన యామెతో - "నీవు నాకు దక్కుటయే యుచిత" మని శివుని భావన వ్యజ్యమాన మగుచున్నది. సావిత్రీచరిత్రమున సత్యవంతుని సౌందర్యము 'పుంసాం మోహన రూపః' అను తీరున మనోహరముగ వర్ణితము (కచ్ఛపి పుట 33, 34). సావిత్రీ సత్యవంతులకు తొలిచూపులో వలపు తొలకరించిన విధము మనోజ్ఞ వర్ణనావసధము :

"సలలిత పాదాంబుజాతంబు లందునఁ
గొదమ తుమ్మెద కవగూడునట్లు
భాసుర నిమ్ననాభీ సరోవరమున
గండు బేడిస జోడు కలియు భంగి...."

ఇత్యాదిగ సాగిన వర్ణనమున వారి ఆపాదమస్తక పరస్పరాకర్షణ చిత్రణము కవి సమ్ముఖ కలితముగ క్రమసమిద్ధముగ అలంకార చతురస్రముగ నున్నది. సీతా

సౌందర్య దర్శనమున— "కుంద్రని చెక్కిలిపైఁ జిఋనొక్క సొగసు'ను వారు మరచిపోలేదుగాని యింకొక సొగసైన లక్షణమును దర్శించిరి.

"కొప్పు విలువఁబడి విప్పినన్ నీలి గా
జుల మలారము పోల్కిఁ జెలఁగు నేల"

.............................................

తరుణికి తలిదంద్రులు పెట్టని సొమ్ము, ధమ్మిల్లము. రసిక పురుషుని చప్పున నాకర్షించు రమణీమణి యాస్తిలో నదియొక ముఖ్యాంశము. అందులకే "కేశసంపద" యని దానికొక పెద్దపేరు. మదనాయుధ పూజామందిర మది. కామినీ కాముకుల రతి కౌతుకము పరాకాష్ఠ నందినప్పుడు పరస్పర కేశస్పర్శ సౌఖ్యానుభవ మొక సంభోగరహస్యము. అందుచే కబరీ ప్రశంస లేక కాంతావర్ణన మపర్యాప్త మగును. ఈ రసజగద్రహస్యము లెవ్వియు దాసుగారికి తెలియనివి కావు. అందును విప్పిన కొప్పునకు వారి నీలిగాజుల మలారము పోలిక అశ్రుతపూర్వము. రాముని చూడ్కుల చెలిమిఁ దోడ్కొని యేగు చేటవాలగు' అమె చూపు లిరుల నీనుచున్నవట! అనగా నీలమేఘశ్యాము డగు నతని నా చూపులు సర్వాంగీణ పరిష్వంగము చేసి మందాక్ష మధురోహాదోహలము లైన వని వ్యంగ్యము. (చూ. పుటలు 11,12). ఆ సీతారాముల పరముగా వర్ణితములైన నవవధూవర చేష్టలలో గబ్బిసిబ్బితి యెల్లగ ఉల్లమునుండి పెల్లుబుకుచున్న వల్లమాలిన మక్కువ చిత్రింపబడిన వైనము మనోజ్ఞము (పుట 25). దాసుదారు తమ మిత్రులు సోమంచి భీమశంకరంగారి శృంగార సంగీతము నతి చమత్కారముగా నాలపించిరి. (51-52) అ పద్యము లేదును నొక మధుర హృదయ విపంచికపై పలికిన మహితాను రాగ శుభశ్రుతులు. శంకరంగారి వలపుకత్తె వక్షోజములట తమ భారమును భరించు నడుముపై అనుకంప మాని దాని ప్రకంపనమునకు కారణభూతము లైనవట. శంకరంగా రూర కొందురా? తగిన శాస్తి చేసిరి. వానికి నఖక్షత దంతక్షత మర్దనాదిక వివిధ శిక్షలు వేసిరి. ఇట్టి వర్ణనలు చేసిన దాసుగారు మాత్రము తమ ప్రాయపు ప్రాహ్ణమున అట్టి పారు పత్తెము లమలు జరిపి యుండరా!

అలంకారసంపద :

మామూలు మాటయొక్క కవితాజగత్ప్రవేశమునకు కవాటము నొసరించునది అలంకారము. అయితే ఆ అలంకారము రసోపస్కారకము, ప్రకృతార్థసుబోధకము, చమత్కారజనకము అయితేనేగాని కవితాసరస్వతి దానిని పూర్తిగా కటాక్షించదు,

ప్రంచుమించుగ దాసుగారి ప్రతిపద్యము వదువరి పెండ్లికొడుకునకు సాలంకార కన్యా దానమే. అం దలంకారముల వైవిధ్యము గలదుగాని దాసుగా రుపమకు తాళిగట్టిరి. అది యొక శైలూషి యని అప్పయదీక్షితులవారు సెలవిచ్చిరి. దాసుగారు దానిచేత చేయించిన వాలకములు ఆడించిన ఆటలు చూచినచో చట్టున కాళిదాసు జ్ఞప్తికి తగిలి నను అతడు తెలుగువాడు కాడులే అని యటుంచి— "ఉపమా అదిభట్టస్య" అన్నదే మాట అని యనుకొందుము. ప్రతి యూరకవియు నుపమలు వాడు వాడేకదా మరి యాతనిదేమి ప్రత్యేకత ? అనిపించును. పదిమంది దిష్టి తగిలిన పడుచుపిల్ల యొక్క నితో కన్ను గిలిపిన దన్నచో అది వాని యొక్కటి యోగ్యతకాదా మరి. అస లీ యుపమ అలంకార ప్రపంచమున పరమ ప్రాచీనమైనది. ఋగ్వేదమునందును దానికి రూఢమూలమైన స్థితియున్నది. ఆదికవి కడ సాష్టాంగపడిన దామె. భరతాచార్యుని పరిగణనమునందును దానిదే అగ్రతాంబూలము. అంతేగాక అప్పయదీక్షితుల వారి వక్కాణ ప్రకార మది సర్వాలంకార బీజభూతమైనది. అందుచేతనే అలంకారము లలో దానికంత ప్రాముఖ్యము. తద్విన్యాసమున నిరుపమానమైన నిపుణత ప్రద ర్శించు శక్తి సిద్ధించుటకు కాళిదాసత్వమే నిమిత్తము కానక్కరలేదు నారాయణదాస త్వము వలనను అది సిద్ధింపగలదు. నిపుణతతో బాటు దాసవాఙ్మయమున ఉపమ కధిక ప్రాచుర్యమును గలదు.

ఉదా॥ 1. భగవంతుని కొలత (పుట 27) :

సీ. వలయరేఖకుఁ బోలె వశమె తెల్పంగ నీ
　　కాది మధ్యాంతము లప్రమేయ ।
ఎల్ల జగంబుల కీవె యాధారము
　　లెక్కల కన్నింటి కొక్కటి వలె
పెరుగవు తరుగవు విభజింపఁబడవు శూ
　　న్యాంకము వలె నకలంకచరిత ।

ఏవంవిధ గణితోపమాన మపూర్వము. ఆ యుపమలకు దగినట్లు సంబుద్ధులు సాభి ప్రాయములు.

2. కుంభకర్ణుడు (పుట 28)

సీ. సంజకెంజాయచే నంజనాచల మటు
　　కావి దుస్తుల నీలకాయ మమర

సౌందర్య దర్శనమున— "కుంద్రవి చెక్కిలిపైఁ జిఱునొక్కు సొగసు'ను వారు మరచిపోలేదుగాని యింకొక సొగసైన లక్షణమును దర్శించిరి.

"కొప్పు విలువఁబడి విప్పినన్ నీలి గా
జుల మలారము పోల్కిఁ జెలఁగు నేల"

........................................

తరుణికి తలిదండ్రులు పెట్టని సొమ్ము, ధమ్మిల్లము. రసిక పురుషుని చప్పున నాకర్షించు రమణీమణి యాస్తిలో నదియొక ముఖ్యాంశము. అందులకే "కేశసంపద" యని దానికొక పెద్దపేరు. మదనాయుధ పూజామందిర మది. కామినీ కాముకుల రతి కౌతుకము పరాకాష్ఠ నందినప్పుడు పరస్పర కేశస్పర్శ సౌఖ్యానుభవ మొక సంభోగరహస్యము. అందుచే కబరీ ప్రశంస లేక కాంతావర్ణన మపర్యాప్త మగును. ఈ రసజగద్రహస్యము లెవ్వియు దాసుగారికి తెలియనివి కావు. అందును విప్పిన కొప్పునకు వారి నీలిగాజుల మలారము పోలిక అశ్రుతపూర్వము. రాముని చూడ్కుల చెలిమిఁ దోడ్కొని యేగు చేటవాలగు' ఆమె చూపు లిరుల నీనుచున్నవట! అనగా నీలమేఘశ్యాము డగు నతని నా చూపులు సర్వాంగీణ పరిష్వంగము చేసి మందాక్ష మధురోహాదోహలము లైనవని వ్యంగ్యము. (చూ. పుటలు 11,12). ఆ సీతారాముల పరముగా వర్ణితములైన నవవధూవర చేష్టలలో గర్వినిర్విర్తి యెల్లగ ఉల్లమునుండి పెల్లుబుకుచున్న వల్లమాలిన మక్కువ చిత్రింపబడిన వైనము మనోజ్ఞము (పుట 25). దాసుదారు తమ మిత్రులు సోమంచి భీమశంకరంగారి శృంగార సంగీతము నతి చమత్కారముగా నాలపించిరి. (51-52) ఆ పద్యము లేదును నొక మధుర హృదయ విపంచికపై పలికిన మహితాను రాగ శుభశ్రుతులు. శంకరంగారి వలపుకత్తె వక్షోజములట తమ భారమును భరించు నడుముపై అనుకంప మాని దాని ప్రకంపనమునకు కారణభూతము లైనవట. శంకరంగా రూర కొందురా ; తగిన శాస్త్రి చేసిరి. వానికి నఖక్షత దంతక్షత మర్దనాదిక వివిధ శిక్షలు వేసిరి. ఇట్టి వర్ణనలు చేసిన దాసుగారు మాత్రము తమ ప్రాయపు ప్రొద్దున అట్టి పారు పత్తెము లవలు జరిపి యుందరా !

అలంకారసంపద :

మామూలు మాటయొక్క కవితాజగత్ప్రవేశమునకు కవాటము నొసరించునది అలంకారము. అయితే ఆ అలంకారము రసోపస్కారకము, ప్రకృతార్థసుబోధకము, చమత్కారజనకము అయితేనేగాని కవితాసరస్వతి దానిని పూర్తిగా కటాక్షించదు,

ఇంచుమించుగ దాసుగారి ప్రతిపద్యము వదువరి పెండ్లికొదుకునకు సాలంకార కన్యా దానమే. అం దలంకారముల వైవిధ్యము గలదుగావి దాసుగా రుపమకు తాళిగట్టిరి. అది యొక శైలూషి యని అప్పయదీక్షితులవారు సెలవిచ్చిరి. దాసుగారు దానిచేత వేయించిన వాలకములు ఆడించిన ఆటలు చూచినచో చట్టున కాళిదాసు జ్ఞప్తికి తగిలి నను అతడు తెలుగువాడు కాడులే అని యటుంచి— "ఉపమా అదిభట్టస్య" అన్నదే మాట అవి యనుకొందుము. ప్రతి యూరకవియు నుపమలు వాడు వాడేకదా మరి యీతనిదేమి ప్రత్యేకత ? అనిపించును. పదిమంది దిష్టి తగిలిన పడుచుపిల్ల యొక్క వితో కన్ను గిలిపిన దన్నచో అది వాని యెక్కటి యోగ్యతకాదా మరి. అప లీ యుపమ అలంకార ప్రపంచమున పరమ ప్రాచీనమైనది. ఋగ్వేదమునందును దానికి రూఢమూలమైన స్థితియున్నది. ఆదికవి కడ సాష్టాంగపడిన దామె. భరతాచార్యుని పరిగణనమునందును దానిదే అగ్రతాంబూలము. అంతేగాక అప్పయదీక్షితుల వారి వక్కాణ ప్రకార మది సర్వాలంకార బీజభూతమైనది. అందుచేతనే అలంకారము లలో దానికంత ప్రాముఖ్యము. తద్విన్యాసమున నిరుపమానమైన నిపుణత ప్రద ర్శించు శక్తి సిద్ధించుటకు కాళిదాసత్వమే నిమిత్తము కానక్కరలేదు నారాయణదాస త్వము వలనను అది సిద్ధింపగలదు. నిపుణతతో బాటు దాసవాఙ్మయమున ఉపమ కధిక ప్రాచుర్యమును గలదు.

ఉదా॥ 1. భగవంతుని కొలత (పుట 27) :

సీ. వలయరేఖకుఁ బోలె వళమె తెల్పంగ నీ
    కాది మధ్యాంతము లప్రమేయ ।
ఎల్ల జగంబుల కీవె యాధారము
    లెక్కల కన్నింటి కొక్కటి వలె
పెరుగవు తరుగవు విభజింపఁబడవు శూ
    న్యాంకము వలె నకలంకచరిత ।

ఏవంవిధ గణితోపమాన మపూర్వము. ఆ యుపమలకు దగినట్లు సంబుద్ధులు సాభి ప్రాయములు.

2. కుంభకర్ణుడు (పుట 28)

సీ. సంజకెంజాయచే నంజనాచల మటు
    కావి దుస్తుల నీలకాయ మమర

ఇరుగడ మేరుశిఖర మినచంద్రులఁ
వలెఁ దల కుండలంబులు వెలుంగ
క్రొమ్మెఱుంగులతోడి క్రొక్కారు మబ్బట్లు
తారహారముల నెద విలసిల్ల

........................................

'ఘంటా మాఘు'ని కైవాడమును దలపించుచున్న వీ యుపమలు.

3. రిప్లెక్టరుంబోలె రెట్టి జేయును నైజ
మగు తెల్వి దీపంబునంటి విద్య (42)

'దీప శిఖా కాళిదాసు' చూపునకు దీటుగా నున్నదీ పంక్తి.

4. పల్లంబువంకఁ బ్రవర్తించె నీ ర్విశే
ష్యము జాడఁ జను విశేషణము భంగి....

ఇత్యాదిగా సాగిన ప్రావృడ్వర్ణనమున వ్యాకరణశాస్త్ర మర్యాదా సంవాదియైన యుపమ దాసుగారి శాస్త్రరాసిక్యమునకు గుర్తు (పుట 63).

5. పానగోష్ఠి నెమ్మివలెఁ గొన్ని కాల్వలు
వాన కురియు నంతవఱకుఁ దోఁచి
పంకశేషము లయి యింకెడున్; మఱికొన్ని
మన్ననపుడు సుజనమైత్రిఁ బోలు.

దాసుగారి దెంత లోకజ్ఞత ! వట్టి లోకజ్ఞతయేనా? ఏమైన అనుభవముగూడ నున్నదా? యన్నచో విన్నట అప్పుడప్పుడు భంగును, బ్రాందీని సేవించినట్లు వారే స్వీయచరిత్రలో వ్రాసుకొనిరి. వానికి చిన్నగురువు, పెద్దగురువు అని ముద్దుపేర్లు. వారి కెప్పుడైన నుండిన ఈ గురువులే, మరి వేర విద్యాగురువులు లేరు. ఆ ఉపమేయోపమముల అనుబంధ మర్ధనారీశ్వరము.

6. పుట 55-56లో అలకనారాయణ గజపతి ప్రభువు టెన్నిసుక్రీడను, పప్పు వెంకన్నగారి పాటను వర్ణించు పట్టునను, 30వ పుటలో శోకహత లోకము గురించి యున్న పద్యములందును అనుపదమున కవి పొదిగిన యుపమలను పరికించితిమేని అవర్ణ్యవిషయముల అంతరస్నాయువుల యెడను వారు సారించు సువిశిత పరిశీలన క్షమమైన చూపును గుర్తింపగలము.

7. శ్రీహరి కథామృతములో నొకచో మాయావృతుడైన మూఢ మానవుని అద్దములోని తన నీడతో తాను పోరు పిచ్చుకతో నుపమించుట చతురముగా నున్నది. (కచ్ఛపి - పుట 77) :-

స్వచ్ఛాయాం దర్పణే పశ్యన్ । యుద్ధ్యతే చటకో యథా
మాయాయాం స్వం వీక్షమాణః । తథా మూఢో విముహ్యతి ॥

'ఛత్రభారవి'ని మరపించుచున్న దీ పోలిక. దాసుగారి యుపమలు కొన్ని ఉపరి వర్ణనా వైదగ్ధ్య ప్రకరణముననను ప్రసక్తములైనవి. ఎప్పట్టున జూచినను వారి యుపమ లెక్కడనుండియో తెచ్చిపెట్టుకొన్న ఎరవుసొమ్ములవలెగాక స్వీయస్థిరాస్తి యైన లోకజ్ఞత నుండి తీసి వాడుకొనుచున్నట్లుండును.

ఉపమ దాసుగారి కుంపుడుకత్తెయైతే స్వభావోక్తి సహధర్మచారిణి. ఉన్న దున్నట్లు చెప్పిన స్వభావోక్తి యగునేమోకాని అది అలంకారముగాదు. అందులకే "స్వభావోక్తి రసౌచారు యథావద్వస్తు వర్ణనమ్" అన్నారు విద్యానాథులైన పెద్దలు. స్వభావోక్తిని విన్యసించుటకు మిక్కిలి లోకాలోకన జ్ఞానము, అందు చారుత్వము విశేషించుటకు సౌందర్యతృష్ణ కావలె. ఇందులకు లక్ష్యములుగ దాసుగారి యీ పద్యములను గమనింపదగును :

"అక్కైన నల్లాడనీక దిగ్బంధన
ముగ గాలి చెమ్మటం బొదవె నుక్క....
"ఉడుకెత్తి పాదులన్ ముడిగిన నీడలు
చల్లగఁ దూర్పున సాగుచూడె....(పుట 11)

ఇంకను నవవధూవరచేష్టలు (పుటలు 25-26), అమని (34), శ్మశానము (39), శివుని ముసలి వాలకము (పరిశిష్టము-3), తాటకాగమనము (23) మున్నగు సందర్భములు చూడదగును.

మూర్తపదార్థమునేగాక అమూర్తమైన వట్టి భావమునుగూడ గ్రహించు శక్తి ఛాయాగ్రాహక యంత్రమున కున్నచో దాసుగారి కృతుల ననేక ఛాయాచిత్రములతో అచ్చువేయవచ్చును. చిత్రకారుడైతే మాత్రము దాసుగారి భావముల నాశ్రయించి కృతకృత్యుడు కాగలడు.

దాస కవితాలంకారములలో తృతీయ స్థానము రూపకముది. వైదేహీ దాశరథుల వనవాస రాజభోగము (26), సువర్ణ దుర్గ విశ్వరూపము (32), విజయ

లక్ష్మీ వివాహము (95) వారి రూపక వై ఖరులకు తగిన తార్కాణలు. ఉపమ వేసిన వేరొక వాలకమే గదా రూపకము. ఉపమా నిరూపణమున నిపుణుడైన కవి రూపక నిపుణు డగుటలో నాశ్చర్య మేముండును? ఉపమేయమునకు తగిన తూకములో మందవలె నుపమ. ప్రబంధకవుల నరు కెక్కువగా ప్రాచీన కవి సమయముల పాతరనుండి తీసినది. దాసుగారిది మన మనుగడ పరిధిలోనిది. మన కనునిత్య పరిచిత మైనది.

కడమ యలంకారములకు దాస వాఙ్మయమున విరళ ప్రచారము. హరికథలలో వచనములందు కాదంబరీ గద్యలోవలె శ్లేష, విరోధాభాసము మున్నగు వాని కెక్కువ వినియోగము గలదు. ప్రకృతము 'కచ్ఛపి' నుండి మరి కొన్నిటి నుదాహరింతును :-

సీ॥ కందున్న పున్నమ చందురుఁ గాదంటి
      మో వీని మోమున కుపమ యేది?
అబ్జము ల్వాడు నటన్న నిక్కండోయి
      కగు నెచ్చట నిదర్శనాతిశయము?
ఏన్గు తొండమ్ము లిస్సీ వంక లన వీని
      హ స్తమ్ములకును దృష్టాంత మున్నె?
మరి యనంగుం డగు మరుని కితని తోడ
      సకియరో సుంతైన సమ మదెట్లు?

ఇందు ప్రతి పాదాంతమునను సందర్భ సహజముగా పేర్కొనబడ్డ యుపమాదు లలంకారవాచకములు. తత్తదలంకారములకు వర్ణ్యముపట్ల నిరవకాశ మనుచున్నాడు కవి. అందుచే అనన్వయ స్ఫూర్తి గలదు కాని యది వాచ్యముగా లేదు. ధ్వనిక మైనది. ఇదో సొగసు. ఇంచుమించిట్టిదే జగన్మోహినీ మూర్తి చిత్రణ పద్యము (19). అర్థాంతర న్యాస విన్యాసము తత్ర తత్ర సందర్భోచితముగా నున్నది.

ఉదా॥ 1. విఘ్నేశ్వర ప్రార్థన (2) :-
కోరికల కడ్డు దగిలెడు వారిలోన
గొప్పవాఁడవు గాన నిన్ గొల్వవలసె
అడ్డు దగిలెడువాఁ డెక్కుడైన యప్డు
వేఁడుకొన కేమి చేయుదు విఘ్ననాథ!

ఇందలి హృదయంగమ చమత్కారము గమనార్హము.

2. దేశభక్తి ప్రబోధము (52) :-
మనదు శక్తి యైకమత్యముఁ బొందక
యలఁతి పగతునైన నడచు టెట్లు ?
లెన్నునందుఁ బడక రెండు జాముల యెండ
కడఁగి దూదినైనఁ గాల్పఁ గలదె ?

ఇది యొక విధముగా ప్రతి వస్తూపమ ప్రతిపత్తినిగూడ గల్గియున్నది. 51 వ పుట యందలి—"అమిత విజృంభణంబు లబలా తగునా సుజనాళి కెప్పుడున్" అను పద్యమున అర్థాంతర న్యాసము హేతూత్ప్రేక్షతో చెలిమి చేసినది. హేతూత్ప్రేక్ష కింకొక చక్కని లక్ష్యము :

విశ్వేశ్వరాభిషేకాయ । సతి భాగీరథీ జలే
కాశ్యాం కో మాం వాంఛతీతి । నారికేలో నజాయతే ॥ (77)

సాగర తీరమున కైదామడలు పైబడిన ప్రదేశములందు కొబ్బరి మొలకెత్తదు. దక్షిణ దేశమునందేగాని యుత్తరదేశమున అది యుండదు. అందుకే దానికి 'తెంగాయ' అనిపేరు. కాశీనగరమున కొబ్బరికాయ లేక పోవుటకు కారణ మట విశ్వేశ్వరాభిషేకార్థము గంగాజల ముండుట చేతనే నట!

ఉల్లేఖము గూడ దాసుగారి వాక్కున సముత్ఫుల్ల మైనది :

ఉదా ॥ 1. మహీజాధరోష్ఠ ప్రవాలేఽలి కల్పా
పురద్విడ్ధనుః కాననేఽగ్ని చ్ఛటాభా
సకృత్కౌశికాంఘ్రి స్థితాఽంభోజ తుల్యా
చకాస్తే స్మ తే దృక్ ప్రభో రామచంద్ర॥ (74)

ఇట నుల్లేఖము ఆర్థికోపమా బీజభూతమైనది.

2. సౌధ స్యాగ్రేఽరుంధతీవ । మధ్యే సౌదామనీ యథా
అధస్తాత్ పాంచాలికేవ । కాశ్యాం భాతి కులాంగనా॥ (77)

కాశిలో కులాంగన మేడచివర నున్నప్పుడు కనీ కనిపించనట్లుండును. నడుమ మెరుపట్లు తోచును. దిగువ నున్నప్పు డొక బొమ్మవలె నుండునట. ఆ సామ్యములందామె పాతివ్రత్యమహిమ, వపుర్వర్చస్విత, సాలంకార వివిధాంగ సౌష్ఠవము ధ్వనితములు. ఆ కులాంగనా తేజః స్ఫూర్తికి భిన్నస్థల కాలావస్థ లభ్యంతరములు కా

వవియు కవి హృదయము. శ్లేష దాసుగారి కంత రుచించదు గాని వారి శ్లేష మన కించక పోదు.

ఉదా॥ చక్రభ్రమణ కరత్వా త్కుదృష్టిభి ర్దూరం వర్ధమానత్వాత్
భ్రుత్యన్త ఖేలనత్వాత్ మశక ! త్వమేవ మాధవం మన్యే (52).

మశకమునకు మాధవోపమ ! కవి కన్ను గురించి, లేఖిని గురించి షేక్స్పియరు చెప్పిన మాటలు గుర్తుకు వచ్చును. (చూ. Midsummer Night's Dream — Act V., Sc. i)

"నీ జడన్ జూచినన్ జిలువతేడు స్ఫురించె"

ఇత్యాది పద్యములో (పరిశిష్టము-పుట 1) స్మరణాలంకారము గలదు.

బలం రోదనం బాలకానా" మితి త్వం
విదన్ మాం సమాశ్వాస యాతీవ మూఢమ్....,
తులాయాం సమం దర్దురాం స్తోలయేచ్చేత్....

ఇత్యాది శ్లోకములలోను (74, 75),

"పాముం జావదు కఱ్ఱయున్ విరుగ దన్ వార్తాను సారంబుగా"

ఇత్యాది పద్యమునందును లోకోక్త్యలంకారమును గుర్తింపగలము.

అపూర్వ భావ సంపన్నులైన దాసుగారికి శబ్దాలంకారము నెడ మమకారము గానరాదు. అయితే యెందులకోగాని "యమక పుష్టిగ చెప్పుట" నొక కవితా ముఖ్యాంశముగ పేర్కొనిరి. ఆ పద్ధతి వారి హరికథలందలి మంజరులందును కీర్తనలందును గలదు. అందలి వచన రచనలందు కదమ శబ్దాలంకారము లెడనెడ గలవు. హరికథలు సభ కుద్దిష్టములు. శబ్దాలంకారములు సద్య స్సంభారంజన సమర్థములు. వారి పద్యరచనయం దవి సకృత్పతితములు. అం దెక్కువగా దోచునది పోతనగారి యొరవడిని బడిన అంత్యానుప్రాస. మొదటి నాల్గు సారణులందు గల 186 పద్యములలో సుమారు ముప్పదింట నీ లక్షణము గలదు. ఎక్కడను కక్కుర్తి కనిపించదు. ఉపరి అర్థస్ఫూర్తి కతిమాత్ర దోహదము చేసినదది. ఉదా॥ పుట 51 :-

ధనమా రాదు, దురాశ పోదు, పరతత్త్వజ్ఞానమా లేదు, కృ
ష్ణునియందా మది నిల్వఁబోదు, సుమబాణు న్మోర్వగారాదు, ని
న్నెవయన్ లోకములోన వాదు, విరహం బిట్లుండఁగానీదు, పా
వన వంశంబు స్వతంత్ర మీదు చెలియా ! వాంఛల్ కుదుర్పుట్టునే ?

కోరిక తీరదాయె, నిను గొబ్బునఁ జూడఁగ దూరమాయె, నీ
వారికి భారమాయె, సుమబాణుని వైరము ఘోరమాయె, నీ
నేరుపు నేరమాయె, మఱి నిందలు నాఱులు నూఱులాయె, నా
పేరున లోపమాయెఁగద భీత మృగాక్షి ! యిఁకేమి వ్రాయుదున్.

ఇందు తిరుపతి వేంకటకవుల బాణీ స్ఫురించినది.* స్తుత్య మృత్యుంజయము" అంది కలో (21-23) ఎనిమిది పద్యములందును అంత్యానుప్రాస పకడ్బందుగా పడి దాని స్తోత్రధర్మమున కుత్కర్ష కల్గించినది.

## శైలీలాలిత్యము

శైలి యనగా శాబ్దిక చండ తాండవము కాదు, సమాస వ్యాయామ వైయాత్యముకాదు. రసభావసందర్భములకు తగిన రచనా విన్యాసము. అటుగానిచో అది శైలికాదు. ధోరణి. సహృదయ పాఠకులకు చవిగొల్పి వానిని సద్యః స్వాద్యము చేయుట శైలియొక్క పరమ ప్రయోజనము. కావ్యజగత్తున నైకవిధ శైలీ మార్గములను కనుగొందుము. ఆ శైలీ వైవిధ్యమున కాయా కవుల శక్తిత్వము కారణమనుకొనుట పొరపాటు. వారివారి వ్యక్తిత్వము లందులకు ప్రధాన నిమిత్తములు. ఒకని శైలియందలి జీవలక్షణము జటిలత యగును. ఒకనియందు ప్రౌఢి యగును. వేరొకనిది లాలిత్యము. ఇంకొకనిది పేలవత. దాసుగారి శైలియొక్క స్వభావజీవలక్షణము లాలిత్యము. లలితకళాఫలిత వ్యక్తిత్వము, లలితాదేవీ భవ్యభక్తిత్వము గల వారి కది తగియున్నది. లాలిత్య మనగా సర్వతః ప్రసన్నత. ప్రసాదగుణము మహాకవిత్వ లక్షణములలో నొకటి. ఆదికావ్యమైన రామాయణము రచనా రామణీయకములోని రహస్యమదే. కాళిదాసాదుల కవితాకళాకీలక మదే. మురారిభట్ట ప్రభృతులు వచ్చి స్వకీయ గీర్వాణముతో సార్వజనీన గీర్వాణ కావ్యశైలిని మరి

* "ధనమా పోవును, మానమా చెడును...." (శ్రవణానందము) రచన 1897.
"వేసవి దగ్గరాయె, మిము పీడుటకున్ మన సొగ్గదాయె...." (ఆత్మకూరు సంస్థానమునకు మొదటిసారి ఆ 1897 లోనే వెళ్లినప్పుడు చెప్పినది.) చూ. జాతకచర్య - పుటలు 100-101. దాసుగారి పద్యములు రెండును అయన ఏలూరు వెళ్లినప్పుడు సోమంచి భీమశంకరం గారి వేశ్య నుద్దేశించి చెప్పినవి. దాసుగారది తన 24 వ సంగమని స్వీయ చరిత్రలో స్పష్టముగ చెప్పిరి. వారి జననము 1864, అందుచే ఆ పద్ది వేళకాలము 1888.

యొక మార్గమును పట్టించిరిగాని అతఃపూర్వము లలితమార్గమే దానికి స్వతస్సిద్ధమైనది. వాల్మీకిలోగాని కాళిదాసులోగాని సుదీర్ఘ సమాసము లెన్ని చూపగలము? శబ్దాలంకారముల నెన్ని యేరగలము? స్వభావతః దాసుగారి దా మహాకవుల మార్గమే. అయితే దౌర్భాగ్యవశమున గీర్వాణ గిరాంధురంధరులు, శబ్దజాల జాంగలికులునైన మన ప్రౌఢ ప్రాబంధిక గంధ గజేంద్రఘటల పాండిత్య వీర విహారముల ఫలితముగా జటిలపద పటాటోపము, సుదీర్ఘ సమాసముల సాముగరిడీలు గల బంధమున కలవాటు పడిపోయి మన సాహిత్యద్రష్టలు చాలమంది శాదృశబంధము శతంగమున్నదానినే ప్రౌఢకావ్య మనుకొనుటయు, లేని దానిని కాదనుకొనుటయు జరుగుచున్నది. తస్మై నమః పాతవరాజ్ముఖాయ.

పోతన మీది ప్రీతిచే అనుప్రాసములు, సమాసములు మున్నగు వాని విషయమున ఆ పోకడలు కొన్ని పోకపోలేదు దాసుగారు.

ఉదా॥ 1. కృత్తి యొక్క ఆవిర్భూతి (2) :-

అభ్రంలిహాదభ్ర విభ్రమాభ్ర భ్రమ
　　కృష్ణీల దీర్ఘ శరీర మమర
ప్రళయ కాలానల ప్రబలను జక్రీకృతే
　　క్షణముల రౌద్ర మక్షయము గాఁగ
త్రైలోక్య కబళనోత్సాహ సూచక ఘన
　　వక్త్రి త్రయోగ్రత వాసికెక్క
బభ్రుబర్బర కేశ పాశారుణ ప్రభా
　　కాల సంధ్యారాగ కాంతి దనర

ఇందు ప్రథమ పాదము యథాతథముగ పోతనగారిది. మిగిలినవి దాసుగారివి. పోతనగారి పోలిక కొంత వచ్చినది.

2. నరసింహావతారము (15) :-

గంభీర భీకర గర్జారవంబున
　　బ్రహ్మాండభాండ కర్పరము వగుల
చటుల సటాచ్ఛటా చలన సంజాత ప్ర
　　చండ వాతాహతిన్ గొండ లెగయ

కాలానలాభీల కీలాభ జిహ్వా ప్ర
భావళిన్ జగమెల్ల జేవురింప
తరుణేందు భాసుర దంష్ట్రి నఖచ్ఛాయ
లలమి దిక్కులకు వెన్నెలలు గాయ

3. వక్రవిక్రమము (పరిశిష్టము- పుట 2) :-

సీ॥ భూరి భూత్కార సంభూత గంభీర గుం
భధ్వానమున శైలపంక్తి వడక

ఇందును పోతనత పొటమరింపక పోలేదు.

4. సరోవర వర్ణన (6) :-

చ॥ చనిచని కాంచె నుల్లసిత చారుపయోరుహ సన్మరంద ఖా
దన మద మత్త బంభర వితాన రవ ప్రతిమాన గాన మా
ననియమితోరు భంగ పటునాద మృదంగ రవానుకూల చ
క్రనివహరావతాళ రవరమ్య విశాల సరః ప్రధానమున్.

5. వీరాలాపము (36) :-

స్రగ్ధర॥ కఠిన జ్యాఘోష మాశాఘన కరటి ఘటాకర్ణముల్ వ్రక్కలింపన్
పిఠర ప్రోద్భూత దావాగ్ని నిబిడ పరరాణ్ణీరసాగాళిఁ గాల్పన్
జఠరీ భూతారి నూత్నోష్ణ రుధిర మదిరోన్మత్త భూతంబు లార్వన్
వితతుల్ స్తోత్రింప నస్మద్విజయ యశము దిగ్భిత్తులన్ వెల్లవైతున్.

6. స్తుత్యమృత్యుంజయము (21) :-

శా॥ గౌరీచిత్త సరోజ భృంగ! త్రిజగత్కల్యాణదాపాంగా! సం
సారధ్వాంత పతంగ! మూర్ధ విచలత్స్వర్గాపగా భంగ! కే
యూరప్రాప్త భుజంగ! మర్దిత బలోగ్రోద్దండ మాతంగ! తా
రారాట్ప్రజ్వలితోత్తమాంగ! లలితార్ధ స్వాంగ! మృత్యుంజయా!

ఈ మూడు పద్యము లందును దాసుగారి శబ్ద ప్రభుత్వ, సమాసగ్రథన కౌశలములతో పాటు పెద్దనాది ప్రబంధకవు లనేకుల పోకడ కన్పట్టుచు. అసలు దాసుగారి కీ పద్ధతి

నవేమిరా సహజమైనదికాదు. అయితే ఎంత వద్దనుకొన్నను కదు పిన్నటనుండి భాగవత ప్రాణి కావునను, తా ననేక భాగవత కథలను హరికథలుగా రూపొందించిన వాదు కావునను దాసుగారి కా ధోరణి యొక్కొ-కపుదు నెట్టుకొని వచ్చుచుండును. అది కాదాచిత్కము. అసలు ధోరణి యిది :

మ॥ స్మిత పూర్వాస్య సరోజ, మున్నత భుజాశ్లిష్టంబు, నాజానులం
బిత బాహాద్వయ, మబ్జ నిర్మల శిరోవేష్టంబు, సత్యామృతాం
చిత వాక్పూర, మఖండవక్ష, మరుణస్పీతంబు శిష్యాళి బ్రో
వుత మంచున్ గురు చంద్రశేఖర మహామూర్తిన్ బ్రశంసించెదన్ (43)

విక్కచ్చిగా చెప్పవలయు నన్నచో విదియుకాదు దాసుగారి ధోరణి. సంగీతమున ఆయన బాణీ కెట్లొక ప్రత్యేకత యున్నదో అట్లే సాహిత్యముననను నున్నది. ఆ బాణీ ఆయనవలె తెలుగును వలచిన తిక్కన పక్కికి కొంత యిరుగు పొరుగుగా నుండును. తిక్కనగారి వలెనే యీయనయు సాధారణముగ సమాసము నాశ్రయింపక ఉడుమువలె నొక యెదుపును బట్టుకొని చెప్పదలచిక భావమెల్ల చేవదేరునట్లు రచింతురు.

ఉదా॥ హనుమద్విక్రమము (28) :-

సీ॥ ఉలికితి వేని సప్తోర్ధ్వ లోకంబులు
గిరగిర సుడివడి తిరుగకున్నె
త్రొక్కితి వేని యధోభువనము లెల్ల
దట్టముగా నట్టగట్టకున్నె
ఊదితివేవి మహోదధు లన్నియుం
జిఱుతుంపురై మింటఁ జెదరకున్నె
గ్రుద్దితివేవి మేరుధరాధరంబైన
మఱి తుమురై మచ్చు మాయ కున్నె

సత్య సంకల్పుఁడవు మనోజవుఁడ వీవు
కామ రూపి వప్రతిహత గతివి నీవు
నీ మహత్వ మొకింతయు నీ్వ వెఱుఁగవు
గాని హనుమంత ! నీవు సాక్షచ్చివుఁడవు.

ఇందొక చక్కని సమతతో గూడిన యెదుపు గలదు. ఆ యెదుపు చిక్కని యర్థ స్ఫూర్తికి ముదుపు గట్టినది. ఒక్క హనుమ ద్విక్రమ పరాజయ్య వస్తువాచక శబ్ద

ములే సంస్కృతములు గావి కడమ వన్నియు తేట తెలుగు మాటలే. ఉదాహృత పూర్వములైన - "ధనమా రాదు, దురాశవోదు....", "కోరిక తీరదాయె, విసుగొల్పునట్లు జూడఁగ దూరమాయె...." ఇత్యాది పద్యములు నిట్టివే. భీష్మ ప్రతిజ్ఞ, భీష్మ సంగ్రామము (పరిశిష్టము - 6,7 పుటలు) సీసపద్యములు నిట్టివే. ఇదే అసలు దాసుగారి బాణి. లోకములో అందరి కవితలలోను శైలి యుండదు. లోకము చేసుకొన్న పుణ్యమును బట్టి కొందరి కుండును. అందరికిని వ్యక్తిత్వ ముండునా? పదిమందిలో తొమ్మండ్రు నిర్గుణ పరబ్రహ్మలుందురు. దాసుగారు సగుణ పరబ్రహ్మయే. పట్టి కన్నుతో చదువుకొనువారి కొక్కొకపుడు వారిశైలి తేలిపోయినట్లనిపించును. అది పద్యముగానీ గద్యముగానీ సంగీతానువగు దాసుగారు తదుచ్చారణ కూపిరి వోయుదురు. ఆయన హరికథలందు గద్య చదువు నొడుపు విన్నవారు మరచిపోలేరు. ఒకపాటి సంగీత వ్యాసంగల మనసుతో చదివినచో వారి పద్యములందు హృద్యమైన శైలి సర్వత్ర గోచరించును. గద్య శైలి యందును వారి వ్యక్తిత్వ ముద్రను గాంచ గలము. (చూ. వ్యాస పీఠము). అందు కాదంబరీ మర్యాదలు మరికొన్ని గలవు. గీర్వాణమునందును దాసవాణి వాల్మీకి వ్యాస కాళిదాస భర్తృహరి ప్రభృతుల అనగా భావపటువు లైన సరళహృదయుల అపేలవ వాగాలింత మైన లాలిత్యము దక్కగొన్నది.

ఉదాహృత శ్లోకములు పరిశీలింపుడు.

భాషానుషమ :

ఒక సధవ యైన సంస్కృతాంధ్ర కళాశాలాధ్యక్షురాలికి క్రొత్తల్లుడు ఆమె కాంగ్లము రాదనియేకాక తెలుగున జాబు వ్రాసిన తెగ మురిసిపోవునని యెంచి ఆస బుత్తరపు పెత్తుగడయే పగరగా నుండవలెనని "గంగా భాగీరథీ సమానురాలైన అత్తికామణికి" అని ప్రారంభించెనట. అది చూచుకొన్న యామె మిక్కిలి వెక్కసం పడి కుక్కకాటుకు చెప్పుదెబ్బ కొట్టవలె నని తలపోసి అల్లువానికి తగిన తాదృశము లైన పురుషసంబుద్ధులు తన యుభయభాషా పాండిత్య పరిణాహమున నెచ్చటం గానక విసుగెత్తి చివరకు— "నేను గంగాభాగీరథీ సమానురాలను కాను కాని మీ భాషాయోష అట్లున్నది" అని రెండుముక్కలు గీకి పారవైచెను. అంతట "నేను కేవలము పవిత్రతాగౌరవము నుద్దేశించి యట్లు వ్రాసితిని. కాని మీ సమాధానము నాకు సంతోషాశ్చర్యములను కలిగించినది" అని తిరుగు టపాలో ఆమెకు సమాధానమువచ్చినది. అట్లున్నది మన తెనుగుయొక్క స్థితి. సంస్కృత సాహచర్యము

లేనిచో అది వట్టి ముండమోపి తెలుగు. ఆ కర్త్రీ యున్నచో నదే మనకు పరమ పావన మైన తెనుగు. ఇదీ వరుస. అల్లువాని యర్థమును తన కావ్యభాష యందు సార్థకము చేయ సంకల్పించిరి దాసుగారు. వెనుకటి 'సంస్కృత ప్రాకృత సమేతరం బయిన భాష అచ్చ యనంబడు' నేమోగాని 'అచ్చా' యనిపించుకో లేదాయె; దానికితో డీయన తద్భవములను గూడ పరిహరించి కేవల దేశ్యాంధ్రమువందే దానికి 'నాటు తెలుఁగు', 'సీమపలుకు' అనుపేర్లు పెట్టి అందు పలు కృతులను, ఒక అపూర్వ నిఘంటువును వెలయించిరి. (వివరముల కిందలి శివ అనుబంధము చూడనగును).

"మొలక లేఁతదనము, దలిరుల నవకంబు,
మొగ్గ సోగదము, పువ్వు తావి
తేనె తీయదనము, తెనుఁగునకే గాక
పరుష సంస్కృతాఖ్య భాషకేది?" (62)

అని తెనుగు యొక్క సొబగు చెప్పుట గాక సంస్కృమునకే యొక పెటకము పెట్టిరి. చరమపాదమున "మోట లాతి నాటు మాటకేది?" అనియు మరియొకచో పాఠాంతరమును వెలయించిరి. తెలుగన్న యింత మమకారము తిక్కన్నకును లేదేమో! అసలు చాలమంది అచ్చతెలుగు కవులను అందు కావ్యము వ్రాసి నలుగురినీ మెప్పించుట యొక గొప్పగా భావించిన వారే కాని వారి యందును ఇంత వల్లమాలిన మక్కువ గలవారుండరేమో! పాల్కురికి సోమనాథుదొకడు "తెలుఁగు మాట లనంగవలదు వేదముల కొలఁదియగాఁ జూడుఁ" డన్నాడు గాని —

"త్రిలింగ భూరేవ భూమిః। త్రిలింగనర ఏవ నా
త్రిలింగ భాషైవ భాషా। నాత్ర కార్యా విచారణా॥

అని యన్న దాసుగారి యంత ఆంధ్రాభిమానము జూపిన వాడు గాడు. అన లట్టివా డుండదేమో! అయితే చిత్రము, అంత కఠోర నియమ నిగళమును కోరి తగుల్చు కొన్నారా దాసుగారు, అయినా అందు రచన అతిహేలగా అవలీలగా చేయుదురు.

ఉదా॥ కోరిక (70) :-

"తెల్లముగా నచ్చ తెలుఁగుతోఁ జెప్పు
మేల బల్కిన్ జేయు నెగ్గెటింగియును
మానిసి? నా యరమర తీర్పు మప్ప!"

అని అర్జునుడు కృష్ణుని తనకు సందేహనివృత్తి అచ్చతెలుగులో సేయుమని అడిగె నట! అహా దాసుగారి మమకారము!

"అనఁ బిన్న నవ్వున ననె నల్లనేల్పు—
కడముట్టె వెట్టి రోకలిఁ దలఁ జుట్టు
మనునట్లు అడిగెదో యబ్బాయి! నీకుఁ
జెవి పట్టలేదు నా చెప్పిన మాట
మఱువకు సరిగ నీమది నిల్పుకొనుము.

కోరికె తప్ప నీకుఁ బగవా డెవండు?
పేరూపు కోరిక, నీకు నీ వెదిరి
అద్దముఁగను పిచ్చుకటు తమకమున
నీ నీడతోడనే నీవు పోరెదవు."

ఇందులో అచ్చతెలుగు వానికేగాదు చచ్చు తెలుగువానికిని అర్థముగాని మాట యే మున్నది? మరియొక చిత్రము. అవసరముపడి యొక్కకోవకు చెందిన పలుకు లెత్తుకొనిరా పట్టిక లేకరువు పెట్టగల దిట్ట ఆయన.

ఉదా॥ సీ. కుదియర్గు, పర్వడి, కుమ్మరింపు, పణము,
చాంగణ, చాళియ, చలికి, చేబ....

ఇట్లు పద్యమంతట నలుబది మల్లబంధ విశేషములను పేర్కొనిరి.

సీ. ఈ వెట్టిపాఱుఁ, డీ యెంబన్న, ముసలి, యం
బేద, పిసాళి, యవిటి, చెనంటి....

ఇట్లు నాల్గు పాదముల నిటువంటి యోగ్యతా వాచకములను ముప్పదింటిని పేర్కొనిరి. ఎంత బరువైన భావమునైన అనాయాసముగ వ్యక్తముసేయు శక్తి తమకును తమ తెనుగునకును ఉన్నవారిలో ఎన్నికైనవారు తిక్కనయు నీయనయు. తెలుగు జాతీయములు లోకోక్తులు గుప్పించుట యందును ఇద్దరును సిద్ధహస్తులు. అంతేకాక వీ రిరువురు సంస్కృత ప్రచురముగా సమాసగుంభన గంభీరముగా రచన చేయ జాలియు "చెల్లియుండియు పైరణ చేయు నతడు" అన్నట్లుగా తెలుగు దనమును వలచినవారు. వీరి మిశ్రభాషా పద్యము లందును తెలుగు పాలే అధికము*. దాసు గారు 'నవరసతరంగిణి' యందు షేక్స్పియరును మిశ్రభాషయం దనువదించిరి. కాళి దాసును అచ్చతెనుగు జేసిరి. అది వారి నియమము. భాషాంతరీకరణమున మాతృకా భాషాశబ్దములు దొరలిన అది యనువాద మెట్లగునని వారి పృచ్ఛ. వారు చాటుపులం

డిడనెడ లెన్సు, రిఫ్లెక్టరు మున్నగు ఆంగ్ల శబ్దములను వాడుటకును వెనుదీయలేదు. మిగిలిన అన్యదేశ్యములు సరేసరి, వానికి కొంత వినియోగ మెక్కువ. పీఠికాపురవర్ణన మొక చతుర్భాషాసీసమున వ్రాసిరి (పుట 44-45. సంస్కృతము, పారశీకము, ఆంగ్లము, తెలుగు). వారు అరబ్బీ పర్షియను భాషలందును మహా పండితులు. ఉమరుఖైయాము రుబాయతును పారశీక మూలమునుండి అనువదించిరి. ఆంధ్రీ కరణము, సంస్కృతీ కరణము ప్రత్యేకముగా జేసిరి. సంస్కృతమున తారకమను నొక కావ్యమును. శ్రీహరికథామృత మనుపేర మూడు హరికథలను, రామచంద్ర, కాశీ శతకములను రచించియుండిరి. అచ్చటచ్చట సంస్కృతమునకు కొంత తెలుగు వాలకము వైచినను వైయాకరణైక వేద్యములైన ప్రౌఢ ప్రయోగములు చేసి ప్రాచ్య పాశ్చాత్య పండిత ప్రకాండుల ప్రశంసల నందుకొనిరి. ఇందలి "సంస్కృత సారణి" యందు కొన్ని మచ్చు తునుకలను జూడదగును. ఆంగ్లమున మహా విద్వాంసుడీయన. తన 24 వ యేటినుండియే షేక్స్పియరు అనువాదమునకు పూను కొనినట్లు స్వీయచరిత్రలో చెప్పిరి. అనేక హరికథలలో అలవోకగా ఆశువుగా సభ్యుల అభ్యర్థన మీదను. స్వయముగను షేక్స్పియరు ప్రభృతుల పద్యముల ననువ దించుట వీరి కొక పరిపాటిగ నుండినట్లు నాటి వార్తా పత్రికల వలన తెలిసికొంటిని. ఆంగ్లమున చిన్నచిన్న గ్రంథపీఠికలు, సంస్కృత శ్లోకానువాదములు తప్ప వేరే రచన లెవ్వియు నున్నట్లు తెలియవచ్చుటలేదు. ఏ భాషయందు రచన చేసినను మృదు మధురముగ హాపణించుట వీరి తీరు. "కృతిని నిఘంటువు వెతికి ముదురు ౙాటి । ముంజెవలెన్ జేయు" మూర్ఖులను, "ప్రౌఢకల్పన లని పన్ని తనకుఁదానె । యర్థం బెఱుఁగలేని' వ్యర్థులను, "తేట తెల్లంబని తెన్గు బాసకు బట్ట । తెరచి చూపించెడి" దేబెలను ఎలుగెత్తి గర్హించిరి.

ఛందస్సౌందర్యము :

ప్రపంచమున సర్వే సర్వత్ర కవిత్వము ఛందోమయ భారతి నాశ్రయించియే ఆవిష్కృతమైనది. ఛందమే కవిత కాదుగాని, అది దీని బహిరాకృతియేగాని దానికిని దీనికిని గల అనుబంధ మతి సనాతనము, సహజము, సమీచీనము, సమంజసము నైనది. ఛందస్సు కవితయొక్క బహిరాకృతి మాత్రమే కాదు. ఒక్కొకపుడు దాని

* తెలుగు భాషగురించి దాసుగారి కున్న అవగాహన మద్భుతమైనది. తత్పరిశీల నార్థము వారి "ప్రేమపల్కువహి" పీఠికను, వ్యాసపీఠమును జూడదగును.

అంతరంగ సంగీతము నాలాపించు ఉత్తమ పరికరముకూడ కాగలదు. సంగీత సాహిత్యములు రెంటను అచ్చమైన సరస్వతీ స్తనంధయుడైన దాసుగారు ఛందస్సును వలచుట సహజము. వారి కృతులు ముక్కాలు మువ్వీసము ఛందోఘటితములే. వారికి స్వస్థాన వేషభాషాభిమాన మతివేలముగ నున్నట్లే దేశిచ్ఛందస్సులందే మక్కువ యెక్కువ. ఈ 'కచ్ఛపి' యందుగల 352 పద్యములందును సంస్కృత శ్లోకములు-69, వృత్తములు-58, దండకము-1, లయగ్రాహి-1. మిగిలిన వన్నియు దేశిచ్ఛందస్సులే. సీసములు-93, గీతపద్యములు (తేటగీతులు+ఆటవెలదులు)-78, కందములు-32, ద్విపదలు-8, మంజరులు-8, తరువోజలు-2, మధ్యాక్కర-1, రగడ-1.

పలు విధముల ఛందస్సులకు లక్ష్యము లుదాహృత పూర్వములు. మిగిలిన వాని కొన్నిటి నుదాహరింతును :-

లయగ్రాహి

చారుగతి నొడ్డునకుఁ జేరుకొని వృక్షముల
ఘోరముగ లాగి జలపూరమున గంతున్
దోరమగు తొండమున నీరమును బీల్చుచు గ
భీర వినదంబు పయిమీఁద నెగ జిమ్మున్
సారస రజంబున శరీర మొగిఁ బూయఁబడ
భూరి కనకాచలము తీరున వెలుంగున్
భోరున మునింగి పయి మీఁది తనచేత నొక
నీరజముఁ బట్టి పొలు పారఁగ నటించున్.

ఇది గజేంద్ర మోక్షణము హరికథలోనిది. మదద్విరద స్వైర విహారమును వర్ణించు నట్టిది. వీటిని చూచిన యేనుగునకు నీలుగెక్కువ. అప్పటి దాని విలాసచేష్టా విశేష ములలో అస లది యేపని చేసినను అందొక ధ్వని వినిగుంభన ముండును. సప్త స్వరములలో నిషాదస్వరమునకు నిదానము గజ ఘీంకృతియేకదా. ఆ చేష్టలన్నియు దాని కతి సహజములు. ఏ అబ్జమువంటి అపురూపపు వస్తువో లభించిన అది యిటు నటు సవిలాసముగా నూగులాడుటయు దాసుగా రెట జూచిరోగాని అదియు చాల సహజమైన సన్నివేశము. అందొక లయబద్ధత యుండును. ప్రకృతి ప్రత్యణువున ఛిటుకు మన్న ధీమల్లో ఛంటిపిల్లశ్వాసలో సంగీతమును దర్శించు లయబ్రహ్మ

దాసుగా రీ సన్నివేశమునకు దగినట్లు లయగ్రాహిని స్వీకరించుటయు ఆ సన్నివేశ మున గల లయహొయలను తన పలుకుబడిలో పట్టుకొనుటయు ప్రశంసావహము.

రగడ

బుడుత నూతను బడిన నుడివివి పొలుపు చెడి పరుగిడు జనకు వలెఁ
గడగి తత్తరపాటుతోఁ గనుకడల వెడవెడపాటుతోఁ దవ
యొడలి చెమటల నీటుతో నెద నుబ్బు గుబ్బుల పోటుతోఁ గడు
నదరు పెదవివి గాటుతో జీరాడు పై వలెవాటుతో మయి
గడను గుంకుమ తేటుతో వెనుకడను గీల్జడ వేటుతో ముడి
వడెడు భూషణకోటితోఁ గొనవంగు చిటికెన గోటితో మొల
సడలు కనకపు శాటితో వెన్దనెడు చక్కని బోటితో వెలు
వడియెఁ గేలి గృహంబు వెన్నుఁడు భక్తరక్షణ లోలుఁడై.

ఇదియు గజేంద్ర మోక్షణము లోనిదే, అసలు ఘట్టము లోనిది. 'సిరికిం జెప్పఁడు, శంఖ చక్రయుగముం జేదోయి సంధింపఁడు....''—అను పద్యము. ఆ సన్నివేశమునే వెన్నుని వేసమును మరించుక మార్చి అతని గజప్రాణావ నోత్సాహ గమన సంరంభమునకు దగిన గతి విశేషము గల రగడను స్వీకరించి, ఏ ఛందస్సును గ్రహించినను చేతగాకున్న నడక చెడగొట్టుటకు కవులకు గల మహావకాశమును జారవిడిచి, ఆ నడక కనురూపములైన పగడ్డైన పలుకులతో, బంధుర నిక్షిప్తమైన భావసౌందర్యమును సంధుక్షిత మొనర్చు అంత్యాను ప్రాసలతో సహృదయ హృదయావర్జకముగా నడిపించిరి దాసుగారు. ఆ యీ ఉదాహరణములను గాని అసలు గ్రంథములోనియే పద్యమును గాని యెంత పరికించి చూచినా తిక్కనగారి కవితలో వలె నెక్కడను కనీసము యతి ప్రాస లందును అదుకులు కవిపించవు. అదుకుంచకూడ దన్నది దాసుగారి శాసనము. తిక్కనకు వలె వీయనకును పదమధ్యయతి అశ్రమ సాధ్యము. సంపన్నులు స్వవ్య యనార్థము కర్చుసేయునట్లు భావముపై నిఘా వేసి కరబదరము లగు శబ్దముల విచ్చలొప్పున అలవోకగా ప్రయోగించుచు అనాయాసముగా వ్రాసుకొవి పోవుటయే వారి వంతు. సందర్భమున కనువైన ఛందస్సు నెన్నుకొనుటలోను వీరిద్దరు సిద్ధ హస్తులు. భీమసేనుని భీషణరోషమును చిత్రించు పట్టున శార్దూలమునో స్రగ్ధరనో యెన్నుకొనును తిక్కన. అట్టిచో సమాసమును పరిభవించుటయు అయన తీరు. సత్యవంతుని వీరాలాపమును (38) దాసుగారొక స్రగ్ధరలో సమాసబహిష్కారము

తోనే గాక క్లిష్ట ప్రాసతోను నడిపించిరి. భీముని క్రోధాతిరేకము నాకచో తిక్కనగారు - "నేలయు వింగియుఁ దాళముల్‌గా జేసి, యేపునరేఁగి వాయించి యాత" అని సీసమునను సమాస రహితముగను చిత్రించి యందు జీవకళ పొదిగిరి. దాసుగారును తాదృశానేక సందర్భములందు సీసమునకు వన్నె దెచ్చిరి.

చూ. 1. నరసింహావిర్భావము (15) :-

సీ॥ గంభీర భీకర గర్జారవంబున
బ్రహ్మాండ ఖాండ కర్పరము వగుల....

2. నక్రవిక్రమము (పరిశిష్టము-పుట 2) :-

సీ॥ ఘూరి ఘూత్కార సంభూత గంభీర గుం
భధ్వానమున శైలపంక్తి వడక....

అయితే యిందు సమాసములును, శబ్దాలంకారములును గలవు. అట్లు లేకుండగను ఆ సందర్భములకు సీసము వియోగించ వచ్చునని విరూపించిరి.

చూ. 1. భీష్మ ప్రతిజ్ఞ (పరిశిష్టము-పుట 6) :-

సీ॥ రాలనీ చుక్కలు, కూలనీ కులగిరు,
లిలఁ గ్రుంకనీ, వార్ధు లింకిపోవి
ఆకస్మికముగ సూర్యాచంద్రముల్ గతుల్
దప్పనీ, జగమెల్ల తల్లడిలవి....

2. భీష్మ సంగ్రామము (పరిశిష్టము-పుట 7) :-

సీ॥ విరిగెడు నరదము లొరిగెడు గుఱ్ఱముల్,
తెగిపడు సిడములు, త్రెళ్లు కరులు....

ఇట ఛందమునకును శైలికిని గల మధుర బాంధవమును దర్శింపగలము. ఫలాని సందర్భమునకు ఫలాని ఛంద మను నియమము సామాన్యకవులకు. విదగ్ధు లే సందర్భమున ఏ ఛందము నెత్తుకొన్నను తమ శైలీ ప్రాగల్భ్యముతో దానికి మొలాము వేయుదురు.

"ముందటి దినములలోపల । కందమునకు సోమయాజి ఘను డందురు." శ్రీనాథుని సీస మందురు. నన్నయ మత్తేభ మందురు. వేమన ఆటవెలది యందురు. ఆదిభట్లవారి దేమనవలెనో నాకు బోధపడలేదు.

నాకుఁగూడ శక్తియందును వ్యక్తిత్వమునందును దాసుగారియందు పోతనత్వ మెక్కువగా ప్రతీయమానమైనను భాషయందును శైలియందును ఛందస్సునందును తిక్కనతనమే యెక్కువ యనిపించును. ఆ మూటి లక్షణముల నా భీష్మ సంగ్రామ పద్య మచ్చముగా తిక్కనగారి దనిపించును.

అనువాదప్రజ్ఞ :

ఈ సరసోక్తి కావ్య మొకఁ డిమ్ముల సంస్కృతభాష నచ్చుగాఁ
జేసిన నట్లు వీఁడు మఱి చేయుట యేటిది యంచుఁ జెప్పఁగా
జేసి యనాదరం బరక చేయకుఁడీ- విలుకాఁడు తూటుగా
నేసిన నందె పాఱ మఱి యేసిన వానిద సూటి గాపునన్.

అని కొఱవి గోపరాజకవి అనువాదయితృ కౌశల ప్రశస్తి నెప్పుడో చేసియుండెను. అర్థవంతమైన మాట యది. గురి నేర్పరిచినవాడు మొదటి విలుకాడే కాని గురిచూచి యేసిన రెండవ వానిదే సూటి. అనువాదకరణమున స్వతంత్ర రచనలో నుండు వెసులుబా టుండదు. అందుచే అనువాదమున నెగ్గినవాడు పెద్ద నేర్పరి క్రిందనే లెక్క.

దాసుగారు భాషాదేవి భక్తులలో అగ్రగణ్యుడు. పట్టగోచులు పెట్టిన పూట నుండి వరుసగా సంస్కృతాంధ్రములు, ఆంగ్లము, అరబ్బీ, పర్షియను భాషలలో వ్యాసంగము చేయుచు అందు విశేషప్రజ్ఞ నార్జించిరి. సంస్కృతాంగ్ల పారశీకముల నుండి కొన్ని యనువాదములు చేసిరి. అందు ముఖ్యమైనవి :

1. సంస్కృతము నుండి తెలుగునకు- బుక్సంగ్రహము, కాళిదాస వాఙ్మయము.
2. ప్రాకృతము నుండి తెలుగునకు- కాళిదాస కవిత.
3. ఆంగ్లమునుండి తెలుగునకు- షేక్స్పియరు వాఙ్మయము, ఫిట్జ్ గెరాల్డు పద్యాలు. (ఉమరుకైయాము రుబాయతు అనువాదము)
4. ఆంగ్లమునుండి సంస్కృతమునకు- డిటో
5. పారశీకమునుండి తెలుగునకు- ఉమరు కైయామ రుబాయతు.
6. పారశీకమునుండి సంస్కృతమునకు- డిటో
7. సంస్కృతమునుండి ఆంగ్లమునకు- కాళిదాస శ్లోకములు.

(కొద్ది-కొన్ని 'మేలుబంతి'లో ఉదాహృతములు).

ఆయా గ్రంథముల గురించి వివరములకు అనుబంధము-8 చూడదగును.

ఇక వారి అనువాద విధానము గురించి కించిత్సమాలోచనము :-

1. సంస్కృతము ననువదించు పట్టున అచ్చతెలుగునే ఉపయోగింతు రది వారి శపథము. భాషాంతరీకరణమున మూలభాషాశబ్దములను ముట్టగూడ దన్నది వారి నియమము. ఋక్కుల ననువదించునపుడు వానిని స్వరపరిచి వీణపై వాయించి చూచుకొని వాని గీతి ధర్మమునకు దగినట్లు మంజులు నెక్కువగా వాడిరి. ఆ వైదిక సంస్కృతము లౌకిక సంస్కృత విద్వాంసులకే కొంత వింతగా నుండునేమో గాని దాసుగారి నాటుతెలుగు మాత్రము ప్రౌఢాంధ్ర ప్రబంధ భాషావల్లభులకును, సామాన్యులకు సరేసరి, సులభ గ్రాహ్యముగా నున్నది. (చూ. పుట 100) లౌకిక సంస్కృతానువాదమున మరీ లాఘవమును జూపిరి దాసుగారు. "యదాలోకే సూక్ష్మం వ్రజతి...." అను అంత పెద్ద శాకుంతల శ్లోకము (98) :-

కం. చిన్నది పెద్దదిగా, విడి
యున్నది కలిసినటు, వంక సురునది సరిగాఁ
జెన్నారు దవులఁ జెంగటఁ
గన్నులఁ బడ దెద్ది తేరు కదువడిఁ బోవన్.

అను చిన్న పద్యముగా అవతరించిన దనువాదమున. అయినను మూలభావ మూచ ముట్టుగా వచ్చినది. అటనున్న పదములన్నియు చిన్న చిన్నవి. సమాసముల అట్ట హాసము లేదు. పద్యపు నడక నల్లేరుపై బండి. అర్థావగతి కరతలామలకము. 'వేదాంతేషు' అను శబ్దసంపుటికి 'ప్రాఁజదువుల కొనల' అని అర్థము నాశ్రయించి యనువాదము. 'భక్తియోగ' మనుటకు "బత్తిజోగ" మని తద్భవ రూపకల్పన. "కుసుమ ప్రసూతి" అను దానికి "పువ్వు సమర్త" అని మనోజ్ఞమైన మార్పు. కాళిదాసుని యౌవన నిర్వచనములు- "రాగబంధ ప్రవాలమ్", "విలసిత పద హృద్యం" అనువానికి 'తగులు తలిరు', 'హొయలు తొలిపెంకి' అను పదబంధము లనువాదము సంజ్ఞ నన్వర్థ మొనర్చినవి. అనువాదము నందలి యీ క్రింది పదములు తెనుగు నుడికారము విగారమును స్ఫురింపజేయుచున్నవి : వామన-మఱుగుజ్జు, పరాఙ్ముఖ-పెడమొగము, అతర్కితోపపన్నం-కోరనట్టి కోర్కె, లక్ష్మీం తనోతి-మెఱుఁగునిడు, శరీరం-బొంది, అర్కః-జగము కన్ను, ప్రతిబోధవత్యః-నెఱ జాణలు, పరితాపం-పలవంత. ఆయా పద్య సందర్భములు పరిశీలించినచో వీని సార్థకత మరింత మెచ్చుగొల్పును.

ఈ మూలాను వాదములను నిదానముగా చిత్తగింపుడు :

మూ॥ అనాఘ్రాతం పుష్పం[4], కిసలయ మలూనం కరరుహై[3],
రనావిద్ధం రత్నం[2], మ్మధు నవ మనాస్వాదిత రసమ్[1],
అఖండం పుణ్యానాం ఫల మివచ తద్రూప మనఘం
నజానే భోక్తారం కమిహ సముపస్థాస్యతి విధిః ॥

అను॥ క్రోలని క్రొత్త తేనె[1], మొన గ్రుచ్చని మావి కె[2], గోరునాటులన్
దాలచనట్టి లేఁ జివుఁ[3], తావి గొనంబడ వట్టి పూవునుం[4],
బోలిన దాని సోయగము ముందిటి నోముల మేటి పంటగాఁ -
బోలుమ దాని నేలుటకుఁ బుట్టిన యాతని దెంత పున్నెమో !

అనువాదమున ఆ చక్కని పదబంధముల పొందిక, అతుకులు లేని యతి ప్రాసలు, అనువాదమయ్యు సహజత్వ మట్టిపడుచున్న శైలీలాలిత్యము, అతని దెంత పున్నెమో అను జాతీయౌచిత్యము మున్నగు నంశములు మాట యటుండ దాసుగా రా మూల శ్లోకమున నొక ధ్వని విశేషమును కనిపెట్టి దానికి సహజమగునట్లు అనువాదమున క్రమము మార్చిరి. అనువాదమున గల క్రమమునుబట్టి ఆ నాల్గు మాటలకు అర్థాంతరముల నే నిట్లూహించితిని- 1 చుంబనము (అధరామృత పానము), 2. దంతక్షతము, 3. నఖక్షతము, 4. అస లనుభవము (సంభోగము). పరిణామక్రమ రమణీయమైన పద్ధతి యదే మరి. ఆ దాసును మించిపోయినా డీ దాసు.

2. ప్రాకృత శ్లోకానువాదమును నాటు తెలుగుననే సంస్కృతానువాదము సాగినట్లే సాగినది. మచ్చునకుమాత్ర మొక్క సందర్భమును చేర్చితిని (పుట 90).

3. ఆంగ్లమునుండి చేసిన యనువాదమున 'నవరసతరంగిణి' యందు షేక్స్పియరు రచనకు మిశ్రభాషయు, 'ఉమరుఖైయాము రుబాయతు'న ఫిట్జ్ గెరాల్డు రచనకు నాటు తెలుగును వినియుక్తములు. రుబాయతునకు ప్రత్యేకముగా సంస్కృతానువాదముగూడ వెలయించియుండుట వలన దాసుగా రట్లు చేసియుందురు. వారు గైర్వాణి నెంత కటాక్షించిరో ఆంగ్లి నంత మచ్చిక చేసుకొనిరి. ఏ పద్యమని యుదాహరింతును ! అటనట కొన్ని పంక్తు లేరి చూపుదును.

షేక్స్పియరు నుండి :-

a. That ever death should let life bear his name
Where life hath no more interest but to breathe ?

ఊపిరి తీయుటే యొక పనియైన
బాపురే బావేల బ్రతు కవరాదు ?

b. That man that hath a tongue, I say, is no man,
If with his tongue he cannot win a Woman.
మాటాడువాఁ డెల్ల మగవాఁడు కాఁడు
మాటలచేతఁ బామల గెల్వకున్న.

c. Lovers, to bed; 't is almost fairy time.
వలపు నూల్కొను మీరల్ పడుకొండు సెజ్జలం
దిప్పుడు గంధర్వవేళ పొనరుచునుండెన్.

d. Love is a smoke made with the fume of sighs.
వల పనఁగ వెచ్చనూర్పులఁ గలిగిన పొగ.

e. So lust, though to a radiant angel linked,
will sate itself in a celestial bed
And prey on garbage.
దివ్యమూర్తిని గలిసియున్ దృప్తి పడక
గుహ్య చాపల్య మెంగిలి కూళ్లు గుడుచు.

ఇది మిశ్రభాషానువాదమైనను తెలుగుపైపే ములు సూపినది. fairy time అనుటకు- 'గంధర్వవేళ', prey on garbage అనుటకు- 'ఎంగిలికూళ్లు గుడుచు' అనునవి గడసరి పలుకుబడులు.

ఫిట్జ్ గెరాల్డు నుండి :-

a. The Bird of Time has but a little way
To flutter-an the Bird is on the Wing.
ఊపిరి పులు గెగిరిన నీ కది దొరకదు.

b. Oh Thou who didst with pitfall and with gin
Beset the Road I was to wander in.
నీవే కలుఁగులఁ ద్రవ్వితి
నీవే వల పన్నినాఁడ వేఁ జను త్రోవన్.

ఆ ఊపిరి పులుగు, కలుగులు ద్రవ్వుట, వలపన్నుట-ఇ ట్లొకటా రెండా ఎక్కుడ

వట్టిచూచినను దాసుగారి రచనలో తేనెవంటి తెనుగుదనము జాలువారుచుండును. దాసుగారిలో తెనుగుదన మున్న దనుట ఉదధిలో ఉప్పున్న దనుట.

4. ఆంగ్లమునుండి సంస్కృతమునకు (80-81) :-

a. షేక్— To guild refin'd gold......

అను. స్వర్ణే హేమ విలేపనం, సమధికే రక్తోత్పలే రంజనం,
చాంపేయ ప్రసవే సుగంధకలనం, హైమోపలే స్నేహనం,
దేవేంద్రస్య శరాసనే సముదితే వర్ణాంతర ప్రాపణం
దీపే నార్కరుచి ప్రదీపన మతివ్యర్థ మ్పృహాసాస్పదమ్ ॥

ఇది భర్తృహరి భవభూతి ప్రభృతుల భవ్యకవితావేశుల రచనా విన్యాసమును దల పించుచున్నది.

b. షేక్— It sems she hangs upon the cheek of night
Like a rich jewel in an Ethiop's ear.

అను. రాత్రౌ కాశిశ్రవణ విచల ద్రత్న భూషేవ భాతి.

c. షేక్— So, Shows a snowy dove trooping with crows
as yonder lady O'er her fellows shows.

అను. వాయసౌఘే చరతి వరటావ త్స్త్రీ మండలే.

ఈ రెండుదాహరణములందును అనువాదమున సంక్షిప్తత కన్పించును. Ethiop's ear అనుటకు- కాశిశ్రవణము, Snowy dove అనుటకు వరట మన వాతావరణము నకు సన్నిహితముగ నున్నవి. ఫిట్జ గెరాల్డ్ పద్యానువాదము నందును ఈ లాఘ వము కన్పట్టును (చూ. 96-98).

పారశీకమునుండి జరిగిన సంస్కృతాంధ్రముల అనువాదము గురించి నే నేమియు చెప్పజాలను. సంస్కృతము నుండి ఆంగ్లీకరణమునకు లక్ష్యము లీ గ్రంథ మున లేవు. 'మేలుబంతి'లో గలవు.

అనువాద మెప్పుడును "అహో మూలచ్ఛేదీ తవ పాండిత్య" మ్మనునట్లు నేలవిడిచిన సాము కారాదు. అట్లని మూలమునకు చిత్తము బత్తె మనుచు అయిన దానికి కానిదానికిని మక్కికి మక్కిగా నుండగూడదు. అనువాదభాషయొక్క స్వభావ జీవలక్షణమునకు తగినట్లు తజ్జాతీయుల వాతావరణమునకు తగినట్లు సహ జత్వమును గల్గి యుండవలె. స్వతంత్రత పేరిట మూలాతిరేక సాహసము తగదు,

అనుసరణ పేరిట మూలవిధేయ సాధ్వసము వలదు. ఈ అనువాద ధర్మముల కను గలముగనే యున్నది దాసుగారి కృషి. స్వతంత్రకృతి ప్రణేత యైననాడు అనువాత యిత యైనచో ఆత డెదిరి కౌశలమును గుర్తింపగలదు, తన కౌశలము దాచుకొన లేడు, ఆ యనువాదము రాణించును అని నిరూపించినా రాయన.

ఆ మహాకవికి రసికాబరవికి నా జోహారు.

సుమారు రెండేండ్ల క్రిందట ఈ గ్రంథమును సంకల్పించి రూపొందించితిని. ఇద్దరు పెద్దల ధర్మమా యని యిప్పటికి వారి అర్థభాగ్యము లభించి నాకామ్య మీడేరి దీనికి మోక్షము వచ్చినది. 'తడవర్తి' యింటి పేరుగాని అడిగినదే తడవుగా తడవు సేయక ముందుకు వచ్చిన రసజ్ఞశేఖరులు శ్రీ బసవయ్యగారు. "దాసభారతీ భార ధూర్వహులలో నే నొకడను" అని సగర్వముగా చెప్పుకో గలిగిన ఈశ్వరరావు గారు అన్న మాట యందు మాత్రము యింటి పేరు నిలబెట్టుకొని వెన్న పూసవంటి మనసుతో నా వెన్ను తట్టి బసవయ్యగారితో జట్టుకట్టి యీ ప్రచురణ భారము నిర్వ హించిరి. ఆప్తమిత్రులు, సహృదయ చక్రవర్తులు ఆ యిరువురకును నా కృతజ్ఞతా కుసుమాంజలి.

ముద్రణమున ఎవరి యేమరుపాటు వల్లనైతేనేమి కొలది దోషములు లేక పోలేదు. అయితే ఏమంత దారుణము లైనవి కావు. త్వరలో దీనికి ద్వితీయ ముద్రణ భాగ్యము లభించునను ఆశగలదు. అప్పుడవి సవరింతును.

ఈ గ్రంథ ముద్రణము నుచితముగా ప్రారంభించిన శ్రీ ఉషశ్రీ ప్రింటర్సు వారికిని, మధ్యలో ఆదుకొని, అచిరకాలమున దీని నింత సర్వాంగసుందరముగా తీర్చి దిద్దిన సహృదయులు వెల్‌కం ప్రెస్ మేనేజింగు డైరెక్టరు శ్రీ పి. రామకృష్ణమూర్తి గారికిని, ముద్రణ విద్యాధురంధరులు శ్రీ యస్. పాండురంగారావు గారికిని నా సౌహార్ద సాధువాదములు.

'నాయని నాల్గు మోము లవునా యెటు ముద్దిడె ?' దంచు నల్వ యా
ప్యాయముగా హసింపఁగ, 'అనంతముఖున్ నను నెట్లు ముద్దిడం
బోయెదొ ?' యంచుఁ జెల్వ నగ- "ముద్దిడెదన్ గను' మంచు నల్వ నా
రాయణదాసు గాఁగఁ బ్రభవందు సరస్వతికిన్ నమస్కృతుల్.

యస్వీ జోగారావు

ఈ యఖిలమ్మునందుఁ బర
మేశ్వరుఁ డెట్టులు నిండియుండెనో
యా యఖిలమ్ము వచ్చి తన
యంతన నుండెస యాదిభట్ల నా
రాయణదాసులో హరిక
థాకృతి భారతి సర్వశిల్ప వి
ద్యాయుతి సంస్కృతాంధ్రముల
యాకృతియై పెఱుమూర్తియై మఱిన్.

మహాకవి విశ్వనాథ

# విషయ సూచిక

## I హరికథా సారణి

# II కావ్య సారణి



# III శతక సారణి

పుట

# IV రూపక సారణి



# V ఆచ్ఛిక సారణి



# VI సంస్కృత సారణి

# VII అనువాద సారణి



# అనుబంధములు

# I హరికథా సారణి

## ౧. అంబరీష చరిత్రము

### 1. సర్వమత సామరస్యము :

సీ॥ ఆదికారణ మెన్నరాదు కావున స్వభా
వము లోకమని చెప్పు బౌద్ధమతము
జగ మబద్ధము బ్రహ్మ సత్యం బటంచు నెం
తయు బోధపర్చు నద్వైతమతము
సగుణుఁడీశుఁడు ప్రపంచము వాని యిచ్ఛావి
భూతి యంచు గణించు ద్వైతమతము
ఇహమె నిక్కము పరంబెల్లఁ గల్లయటంచుఁ
దెల్లముసేయు నాస్తికమతంబు

ఇన్నిమతములలో సారమెంచియెంచి
దయయు నిర్మోహము న్భక్తి ధర్మబుద్ధి
నాల్గిటిన్గ్రిమముగఁ బొంది నయము మీఱ
జయము మన మందవలయు నో సభ్యులార !

చం॥ మహిఁగడు నైకమత్యమున మానవులందఱు, నొక్కరీతిగా
సహనము సర్వభూతదయ సత్యము జ్ఞానముఁగల్గియుండొరుల్
రహి ననుకూలదృష్టుల ననారతము న్గనఁగొంచు సౌఖ్యమీ
యిహమునఁ బొందుచుంట నిఁక నేఁ బరికించెడి భాగ్యమెన్నఁడో:

## 2. కృత్తి:

సీ॥ అభ్రంలిహాదభ్ర విభ్రమాభ్ర భ్రమ
కృన్నీల దీర్ఘ శరీర మమరఁ
బ్రళయకాలానల ప్రభను జిక్రీకృతే
క్షణముల రౌద్ర మక్షయముగాఁగఁ
దైత్రిలోక్య కబళనోత్సాహ సూచకఘన
వక్త్రత్రయోగ్రత వాసికెక్క
బర్వు బర్బరకేశ పాశారుణప్రభా
కాల సంధ్యారాగ కాంతిఁదనరఁ

గ్రకచ కఠిన కరాళ దంష్ట్రిలు వెలుంగఁ
బదయుగోద్ధూత పాంసువు ల్పదలుగప్ప
నేఁబదముల నింగివి నిడ్డతలల
నతిగొనిఁచెఁ గృత్తి తా మిత్తి పగిది.

# ౨. గజేంద్ర మోక్షణము

## 3. సంప్రార్థనము:

గీ॥ అన్నిటికిఁ దుద మొదలయి యున్నవాఁడ!
పలుతెఱంగుల నొకఁడవై పరగువాఁడ!
దొరికి దొరకని యట్టులఁ దిరుగువాఁడ!
నేను నీవాఁడఁజుమ్ము నాలోనివాఁడ!

గీ॥ కోరికల కడ్డుదగిలెడు వారిలోన
గొప్పవాఁడవుగాన నిన్నొల్వవలసె

అడ్డుదగిలెదు వాఁడెక్కడై వయప్డ
వేడుకొనకేమి చేయుదు విఘ్ననాథ!

గీ॥ నాకు మూగి నత్తి లేకుండఁజేసిన
యమ్మ! నీ దయారసమ్ముఁ జల్లి
నాదుమాట మెత్తనఁగఁ దీయగాఁ దేట
గా నొనర్చి నన్ను గావరాదె.

సీసార్ధము॥ తెలుకలియెద్దు కన్నుల గంత కట్టఁగఁ
బడి గాన్గనకుఁ బూన్పఁబడి యొకింత
యును దారితోచక యుండియు నెంతయు
మునికోలచే దండిఁబొడువఁగఁబడి
చుట్టిన త్రోవనే చుట్టెడు తీరున
మనమును ఘనమోహమునను గ్రుడ్డి
వారలమె విధివశమున సంసార
మందు పూన్పఁగఁబడి ముందలగతి

తెలియకున్నను గాలంబువలనఁ బోట్లు
పడసి చర్విత చర్వణ వర్తనంబు
సలుపుచున్నార మిట్టి యజ్ఞానదశను
బొందకుండగఁ నీకుందు
బ్రోచుఁగాన వేడుఁడీ
నీచరతులగాని-నిత్యసంపదనూని
కాచమక్కరగాని-గదుసుతనములూని
యోచనం బికనేల గతి-జూచుకొననిది వేళ తడ
వాచరించుటమేల భవ-మోచనంబగుఁ జాల॥ యీకుందు॥

## 2. కృత్తి :

సీ॥ అభ్రంలిహోదభ్ర విభ్రమాభ్ర భ్రమ
కృష్ణీల దీర్ఘ శరీర మమరఁ
బ్రళయకాలానల ప్రభను జక్రీకృతే
క్షణముల రౌద్ర మక్షయముగాఁగఁ
త్రైలోక్య కబళనోత్సాహ సూచకఘన
వక్త్రిత్రయోగ్రత వాసికెక్క
బర్బు బర్బరకేళ పాళారుణప్రభా
కాల సంధ్యారాగ కాంతిఁదనరఁ

గ్రకచ కఠిన కరాళ దంష్ట్రిలు వెలుంగఁ
బదయుగోద్ధూత పాంసువు ల్పదలుగప్ప
నేఁబదముల నింగివి నిద్దతలల
నతిగొనిఁచ్చెఁ గృత్తి తా మిత్తి పగిది.

# గజేంద్ర మోక్షణము

## 3. సంప్రార్థనము :

గీ॥ అన్నిటికిఁ మొదల మొదలయి యున్నవాఁడ !
పలుతెఱంగుల నొకఁడవై పరగువాఁడ !
దొరికి దొరకని యట్టులఁ దిరుగువాఁడ !
నేను నీవాఁడఁజుమ్ము నాలోనివాఁడ !

గీ॥ కోరికల కద్దుదగిలెడు వారిలోన
గొప్పవాఁడవుగాన నిన్గొల్వవలసె

అడ్డుదగిలెదు వాఁడెక్కుడై వయప్డు
వేడుకొనకేమి చేయుదు విఘ్ననాథ!

గీ॥ నాకు మూగి నత్తి లేకుండఁజేసివ
యమ్మ! నీ దయారసమ్ముఁ జిల్లి
నాదుమాట మెత్తనగఁ దీయగాఁ దేట
గా నొనర్చి నన్ను గావరాదె.

సీసార్ధము॥ తెలుకలియెద్దు కన్నుల గంత కట్టఁగఁ
బడి గానుగకుఁ బూన్పఁబడి యొకింత
యును దారితోచక యుండియు నెంతయు
మునికోలచే దండిఁబొడువఁగఁబడి
చుట్టిన త్రోవనే చుట్టెడు తీరున
మనమును ఘనమోహమునను గ్రుడ్డి
వారలమై విధివశమున సంసార
మందు పూన్పఁగఁబడి ముందలగతి

తెలియకున్నను గాలంబువలనఁ బొల్లు
వడసి చర్విత చర్వణ వర్తనంబు
సలుపుచున్నార మిట్టి యజ్ఞానదశను
బొందకుండగఁ నీకుండు
బ్రోచుఁగాన వేడుఁడీ
నీచరతులగాని-నిత్యసంపదనూని
కాచమక్కరగాని-గడుసుతనములూని
యోచనం బికనేల గతి-జూచుకొననిది వేళ తడ
వాచరించుటమేల భవ-మోచనంబగుఁ జాల॥ యీకుండు॥

# 4. పరిణామము :

కాంభోజి_సీసమాలిక

పరిపూర్ణుఁడగు పరబ్రహ్మ సర్వప్రపం
చాకారుఁడై తనయందు దానె
యవతరించు యథేచ్ఛ నడఁగు, నీ జగమెల్ల
నతనికి నాటపట్టయి చెలంగు,
నొకటి సున్నను గూడియున్నప్డు పదిగతు
లందు పోలిక మాయనొంది యతఁడు
తొలుతను బదివేషములఁ జూపు, నవ్వాని
జాడల జంగమ సంఖ్యపెరుగుఁ,
గేవల జలచర జీవులలోఁ జేప
పదివేషములలోన మొదటిమచ్చు,
దీని రెక్కల జాడనాని పైకెగిరెడు
పక్షులు బుట్టె నాపైని, నాల్గు
కాళ్ళతో భూజల గతులందు తాబేలు
రెండవరకముగా నుండు, దీని
వలె పంచనఖములఁ బరగు నడవి పంది
మూడవయది, దీని మొదలు చేసి
తోకలుగల మృగలోక మంతటిలోన
సింహము నాల్గవ చెల్వు, తోక
గలుగక చేతులు గాళ్ళేర్పడగఁ బొట్టి
యగు మేను గల్గి మాటాడగలుగు
మనుజుఁ డైదవ తీరు, మఱివానికన్న దై
ర్యంబు కాంతియు బుద్ధి నలరునట్టి
మనుజుఁ డాటవపోల్కి, జనలోకపాలన
దక్షుఁడై యుత్తమోత్తముఁడుగాఁగ
నెగడు భూభర్త యేడగువేష మదియె వృ

ద్దికి మేర యంతలోఁ దీసివేఁత,
క్రమముగా సృష్టికిఁ గలుగు నెన్మిదియవ
వేషము మతున వెలయుచుండు,

తొమ్మిదవరూపు వికృత వేషమ్ము, మఱియుఁ
బదియవది మృగలీలలోఁ బరఁగుఁ, దుదకు
భూమిచరములు జలముల మున్గు, సృష్టి
యెల్లయును దెగు, మిగులు సర్వేశుఁ డొకఁడు.

## 5. సగుణోపాసన :

ద్విపద॥ పతి దూర దేశంబు పట్టినయపుడు
సతి వాని చిత్రంబు సరగునఁదెచ్చి
కనుఁగొని యుప్పొంగుఁ గన్నీరు నించుఁ
గొనియాడు మనవి గైకొనుమని వేఁడు
నతిభక్తి గొల్చు నాథాయనిపిల్చు
బ్రతిమాలు పదముల పైఁబడి సోలుఁ
దన గతిఁగని పొక్కు ధైర్యంబు దక్కు
తనదు సొమ్ములఁదీయు ధర్మంబు పేయుఁ
బెనిమిటి చరితంబు వినిపించువారిఁ
గని గారవించు సత్కథల నాలించు
నటువలె మనము నిత్యంబు సర్వేశుఁ
బటమున భావించి బ్రతుకుట మంచి.

## 6. సూర్యాస్తమయము :

గీ॥ తన్ను వెంటఁ దగులుచున్నట్టి కోడె చీఁ
కటుల కెదిరి నిల్చు కడిమిలేక

పశ్చిమాబ్ధియందుఁబడి దాఁగె సూర్యుండు
కాల మొక్కరీతి గడుపఁగలమె.

## 7. చంద్రోదయము :

గీ॥ ప్రొద్దు పండుటాకు పోలిక రాలెఁ, గెం
జాయ చివురులెత్తెఁ, గోయిల లనఁ
జెలఁగి కవిసెఁ జీఁకటులుఁ, బూచెఁ జుక్కలు,
పైని జందమామ పండుదోఁచె.

## 8. సరోవరము :

చ॥ చనిచని కాంచె నుల్లసిత చారుపయోరుహసన్మరందఖా
దనమదమత్తబంభర వితానరవ ప్రతిమానగానమా
నవియమితోరు భంగపటునాద మృదంగ రవానుకూల చ
క్రనివహరావతాళ రవరమ్య విశాల సరః ప్రధానమున్.

## 9. విపన్న ద్విపము :

ద్విపద॥ సరసులోపల వెయ్యి సంవత్సరములు
సరిగాను మకరితో సల్పెఁదాఁబోరు
అంతకంతకు నక్రమధిక సత్వమున
వింతసొంపున హెచ్చి వేఁ దనుఁ బట్ట
బహులపక్షపు విధు పగిదిఁ గన్పట్టి
యహమర్ధమగు తరి నలరు మానవుని
నీడపోల్కిని డింది నీటునుదప్పి
వాడిక్షీణించె నా వనగజ మపుడు

కాలకింకరుచేతఁ గష్టాత్ముపగిది
జాలరి వలఁబడ్డ ఝషము చందమునఁ
జెలఁగి సంసారంపుఁ జిక్కునఁబడుచుఁ
బొలుపుమాలిన జ్ఞాని పోల్కిని మఱియు
నప్పులలో మున్గు నలఁతి చందమున
నప్పులలో మున్గి హస్తీంద్రుఁడపుడు
చెడుగు నక్రమువల్లఁ జేడ్పడి కనుల
బుడి బుడి కన్నీరు పొడమఁజింతించె.

మ॥ ధరణీమండలమెల్ల నేలినను విద్యాసాగరుండై నఁద
త్వరమాధ్యక్షుఁడునైన నెవ్వఁడయినన్ బ్రారబ్ధముల్ దప్పునా
యెఱుఁగన్వచ్చెను నాకుఁజూడ మును నింద్రద్యుమ్న భూపాలుఁడన్
గురుశాపంబున నింతవచ్చె నని యా కుంభీంద్రుఁ డూహింపచున్.

## 10. విరాడ్రూపము :

మధ్యాక్కర॥ అతఁడిట్లు నిర్గుణ బ్రహ్మంగమాత్మలో నలరుచుండ
స్తుతిఁజేసి యంతటోఁ దుష్టిఁబొంద కాతురతనుబొంది
చతురత్వమూని సర్వేశు నంతటన్ సగుణునిజేసి
యతిభక్తితోడ వర్ణించె సంతసంబతిశయిల్లంగ

చ॥ జలధులు రోమకూపములు, శల్యము లద్రులు, సూర్యచంద్రు ల
క్షులు, పవనంబు లూరువులు, శుక్లము వర్షము, మిన్ను శీర్ష, మి
య్యిల జఘనంబు, మేను జగమెల్లయునై వెలుగొందు నేవిభుం
డలఘుఁ డనంతుఁడవ్యయుఁ డనాది గురుండగు వానిఁ గొల్చెదన్॥

## 11. హరివెంటన్‌సిరి :

గీ॥ కావిపావడ జీరాడ కాంచి పీడ
కౌను జవ్వాడ నారదమౌని పాడ
మేచకముతోడఁ దొల్కారి మెరుపుజాడ
నేగుదెంచెను లక్ష్మి సర్వేశుసీడ.

# 3. గౌరప్ప పెండ్లి

## 12. ఆత్మజ్ఞత

సీ॥ మురికి కాయక మిది-మూనాళ్ళ ముచ్చట
గాలిలోని యిలాయి కరణిఁగదలు
తలఁచినట్టులరాదు-తగువానివలె మెలఁ
గినఁ దప్పఁగడువ దీ-గిడ్డబ్రతుకు
తవతోడివారల-న్దానెట్టులైనఁ గుం
దింపక మేల్పొంపు-పెంపుకాదు
ఒరిమిక చొప్పడ-దోరిమి కుదురదు
మెలఁకువ న్వంతయే-మిగులుఁదువకు

అనుచు నెఱిఁగిన గొప్పవా-రనయము నిను
వేడి చావని పుట్టని వెరవుఁ గనిరి
తొల్లి, యీనాఁటి కల్లరిం-డ్రెల్ల నిన్ను
మఱచి రెంటికిఁజెడి పిల్కు-మారుచుండ్రు.

## 13. సంగోరు గౌరు :

సీ॥ ఎడమపై పాడుది-కుడి త్రట్టు మగవాఁడు
నడుబొంది నిరువుర-బెడఁగుదోఁప
నిటు కప్పు గొప్ప కొ-ప్పటు మినువాఁక బొ
ట్టుకడాఁగు పస్పె వెం-ట్రుకల కొండె
యీాక్రేవ బిగిరైక-యా కెలఁకునఁ బాప
పేరిటఁగ చ్ఛటఁ-బెరుఁగు దాలు
రెంట త్రాగుడు తిండి-పెంటితే రీవల
నా చక్కి క్రొవ్వాఁడి-యాలఁబోతు
పిన్నజాబిలి మూఁడవ-కన్ను వింగి
నేల లేలెడు నేరుపు-నిందు తన్వి
యెదురెఱుంగక మటి మటి-బ్రతుకువేడ్క-
గౌరు ముక్కంటులకు వంతు-గాఁ జెలంగు.

మ॥ ఇటుముక్కంటియు మెట్టుపట్టి,కవమై నింపారు చెల్వంబుతో
నెటు లెందేనియుఁ దాముకాని దినుసే దీలేని యప్పెల్ల ము
చ్చటల న్మచ్చికఁదోఁచు వాఁడు మగయోజ న్గొల్చునవ్వారి బా
నటయై కోరని కోర్కులిచ్చెదరు పెల్చ న్వేల్పు కన్నాకులై.

# ౪. జానకి శపథము

## 14. ప్రబోధము :

సీ॥ పెద్దలమాటలఁ బెడచెవిబెట్టకు
కార్పణ్యమున నహంకారపడకు
మెట్ట వేదాంతము పట్టి యంతయు మిథ్య
యని ధర్మభంగముగ నడవకుము

దేవాలయములందు దీర్ఘసేవలను మా
హాత్మ్యంబు లేదని యార్యఁబోకు
విపరీతబుద్ధివై స్వీయకులాచార
ముల మాని పరమతములను గొనకు
ప్రాణులం జంపనొల్ల కెబ్భంగినైన
మార్గానర్చకు మే యపకారికైన
నొరుల గొప్పకు నుల్కకు మో హృదయమ
సర్వము న్విషమయమని శాంతిబొందు.

సీ॥ తెలియని సుఖదుఃఖములు బొంది కొన్నాళ్ళు
పొత్తిళ్ళలోఁబడి పొరలినావు
తలిదండ్రులకుఁ దప్ప వెలిలోక మెఱుఁగక
తప్పటడుంగులఁ దారినావు
కొన్నాళ్ళు పిమ్మటం గోతిచేష్టలు గల్గి
దుడుకుదనంబునఁ ద్రుళ్ళినావు
అటుపయిఁ గొన్నాళ్ళ లడియాసవలపునఁ
గడు మోసకత్తెలం దడవినావు
ఇప్పు డెటఁగియు నెఱుఁగక గొప్పకొఱకు
వ్యర్థ సంసారమున దేవులాడెదీవు
ధరణి నీమీద నేమి కాఁదలఁచి నావొ
చాలు నికనైన డెందమా శాంతిబొందు.

సీ॥ ధనము కావలసిన దంభము ల్మోసము
ల్సేవ లిచ్చకములు సేయవలయు
కామ సంతృప్తికై కాంతలకున్ లొంగి
కాని గడ్డెల్లను గఱువవలయు

వ్యకుటుంబ వృద్ధికై వ్యయము ప్రయాసంబుఁ
బడి యాత్మ సౌఖ్యంబు వదలవలయు
పేరొందుటకుఁ బెద్ద వేషంబులం బెక్కు
దేశంబులం దిమ్మదిరుగవలయు
అల దిగంతపురేఖ యట్టులను మదికిఁ
జేరువై తోచి సంతుష్టి దూరమగును
దుఃఖమే మిగిలియుండును దుదకు మనకు
గాన నిహ భోగముల పయిఁ గాంక్ష తగదు.

## 15 వేసవి వేళలు :

సీ॥ ఆకైన నల్లాడనీక దిగ్బంధన
ముగ గాలి చెమ్మటం బొదవె నుక్క
మిన్నంటి చెల్వకై మెలపుతోడుత గ్రద్ద
చాలుగ నిరుప్రక్కఁ జాచె రెక్క
ముంగాళ్ళతోఁ జెట్టుమొదట గాతన్ ద్రవ్వి
కుదురుగఁ బడుకొనె గుంటనక్క
యెండమావులఁ గాంచు చెంతయు దప్పితో
వాడి పరువువెట్టె లేడిబక్క
యొడళు లుడుకెత్తి తుమ్మెద లుడిగె సద్దు
రగులుకొను నగ్గికిం గనరాదు హద్దు
అడవిపందికి బురదనీ రయ్యె ముద్దు
వెలసెఁ బనిరద్దు నిడువేసవి నడుప్రొద్దు

సీ॥ ఉడుకెత్తి పాదుల న్మడిగిన నీడలు
చల్లగఁ దూర్పున సాగుచుండె

వడదాకి తొఱ్ఱల నడగిన పిట్టలు
ముదముగఁ బైటను మ్రోగుచుండె
కడు నెండవేడిమి న్గాగిగిన గాడ్పు హా
యిగ మంచుకొండకై యేగుచుండె
కొండను దిగి మేతకొఱకు బెబ్బులు లుమ్మి
రిగఁ బల్లములఁ జెలరేగుచుండె
పాములకుఁ బుట్టలోనుండి పడగ హెచ్చె
మడువు నెడఁబాసి యేనుంగు లడవిఁజొచ్చె
ప్రొద్దు పడమటకు వ్రాలి మఃద్దువచ్చె
నెగడి జానకి వాలుకన్నుగవ విచ్చె.

సీ॥ ఎల్లపిల్లలు గూళ్ళకెక్కఁగ గుడ్లగూ
బలు బుషిపక్షులుం బయలుదాసె
వైదేహి దురవస్థ పరికింపలేనట్లు
ఖిన్నుఁడై సూర్యుండు కన్నుమూసె
పసపుఁ గుంకుమము నాకసమున సంజయ
న్పేరానపెద్దమ యారఁబోసె
అంచెలుగా పక్కు లరచుచు దెసలందు
ధరణిజ కష్టంబు నెఱుకజేసె
చీకటిముసుంగునన్ భూమి చింతఁబండె
చుక్కలు న్నీతకై మింటఁ బొక్కుచుండెఁ
బొదలి దవుదివ్వెలుగఁ గొండపొళ్ళు మండె
జనకజకు నప్పు డష్టమకళనియు నిండె.



# ౫. ప్రహ్లాద చరిత్రము



## 16. పూర్వకవులు :

గీ॥ పూర్వకవు లందరున్ గడు పూజ్యు లందు
భాగవతులయి గోస్తనీ పాకముగను
గృతులొనర్చు నధికుల సంస్కృతమున జయ
దేవుఁ డెనుఁగునఁ బోతనం దెలిసి యెంతు.

## 17. ఆధునిక కవులు :

సీ॥ పూర్వప్రబంధము పోల్కికై చచ్చిన
యీఁగ నంటించెడు హీనుఁ డొకడు
ప్రౌఢకల్పన లని పన్ని తనకుఁదానె
యర్థం బెఱుఁగలేని వ్యర్థు డొకఁడు
కృతిని నిఘంటువు వెతకి ముదురుతాఁటి
ముంజె వలె నేయు మూర్ఖు డొకఁడు
తేటతెల్లంబని తెన్గుబాసకు బట్ట
తెరచి చూపించెడి దేబె యొకఁడు

కలివశంబున శారద కలుషయయ్యెఁ
బిదపకాలంబునఁ దలంపు పిచ్చియయ్యె
అచ్చు చవకయ్యె మూఢులు మెచ్చుటయ్యె
నహహ! యెందుకు కవులెరి యాధునికులు.

## 18. ప్రహ్లాదపాత్ర శీలచిత్రణము :

సీ॥ ఇతరుల మనము నొప్పించఁ డే కరుణావి
శిష్టుఁడు తన కంత చెల్లియైనఁ
జోద్యమునకునయ్యుఁ జూడఁ డే ధృతిశాలి
పరకాంతఁ దానెంత సరసుఁడైన
నఖిలజనంబుల కడకువఁ జూపు నే
విజ్ఞాని తా దొరబిడ్డఁడైనఁ
దెలియనియట్టులఁ దిరుగు నే తత్వవి
స్ఫూర్తి తా సర్వజ్ఞమూర్తియైన
వ్యసనముల కెదుర్చుక్క, సత్యంపుమొక్క
యందపుఁ దుదిమెట్టు, తెలివి కాటపట్టు
జ్ఞానభాగవతాగ్రణి, దానవమణి
యజునకు న్నక్తి సున్న ప్రహ్లాదు నెన్న.

## 19. సదసత్సంశయము :

సీ॥ హరియన నెవఁడవి యందురేని యతండె
ముఖ్యకారణ మన్ని భూతములకు
ఆకాశమట్టుల నంతట నిండియుఁ
దా నెద్దియుం గాక తనరుచుండు
కల్లను నిక్కంబు గావించు నాతండు
సున్నకు విలువను బన్నునట్లు
అతనికి వేఱైన దదియె శూన్యము దాని
నే మాయ యని మన మెఱుఁగవలయు
పెక్కులేల యెల్ల వేదాంత సారంబు
తేటతెల్లముగను దెలియపరు

ఎద్ది కలదో యదియె యీశ్వరతత్వంబు
ఎద్ది లేదో యదియె యీ జగంబు

కం॥ కలిమిగలవాని లేమిన్
గలవాఁ డెటు లాశ్రయించి కలిమిఁ దెలుపునో
తెలియుఁడు లేని జగం బిది
యొలయ న్సర్వేశు నొద్ద నున్నటు తోఁచున్.

## 20. నరసింహావతారము :

✓ సీ॥ గంభీర భీకర గర్జారవంబున
బ్రహ్మాండ భాండ కర్పరము వగుల
చటుల సటాచ్ఛటా చలన సంజాత ప్ర
చండ వాతాహతిన్ గొండ లెగయ
కాలానలాభీల కీలాభ జిహ్వా ప్ర
భావళిన్ జగమెల్లఁ జేవురింప
తరుణేందు భాసుర దంష్ట్రినఖచ్ఛాయ
లలమి దిక్కులకు వెన్నెలలుగాయ
కరము లురమును శిరము సింగంబుమాడ్కి
నాభికిన్ గ్రిందిభాగము నరునిపోల్కి
నలర నరసింహురూపున నవతరించె
నాశ్రితపరాయణుండు నారాయణుండు.



# ౬. భీష్మ చరిత్రము



## 21. కర్తవ్యబోధ:

సీ॥ పసుల జన్మమునఁ జంపఁగనేల నాకలి
గొన్న భూతమ్ముల కన్న మిడుఁడు
నోరునొవ్వఁగ వేదపారాయణము లేల
నందటిఁ మోల సత్యము వలుకుఁడు
తీర్థయాత్రల డస్సి తిరుగులాడఁగనేల
నార్తులకెల్ల సహాయపడుఁడు
సన్యాసిలిక్ష నెంచఁగనేల మనతోటి
పాటివారలకునై పాటుపడుఁడు

ఎందుకిఁక వేయిమాట లీ యిలను సర్వ
జనుల కుపకారముగ నడువని మనుజుఁడు
జపతపంబులు నిష్ఠలు సలుపుటెల్ల
బూడిదంబోయు పన్నీటి పోల్కిఁగాదె.

సీ॥ బ్రతికియున్నంతకు స్వర్గనరకముల
సంగతిఁ దెలియ వసాధ్యముగద
తరలినవారలు పరలోకవార్తలఁ
జెప్పిరా మనతోడ నెప్పుడైన
మర్త్యుల నోళ్ళలో మలయు వేదములకుఁ
గనఁగన నొక ముక్కుమొనయుఁ గలదె

దీపమాలీనయట్లు తెవ్వి శూన్యంబగు
దేహాంతములయందుఁ దెల్లముగను
మనకు గగనారవింద వరనము లేల
యిహమునందున స్వమతాభివృద్ధి మీఱ
నెల్ల రన్యోన్యమైత్రికి హేతువైన
ధర్మవర్తన మెపుడైనఁ దప్పఁజనదు.

గీ॥ చెలఁగి తలిదండ్రుల యభీష్టములను దీర్చు
పుత్రులకు నిశ్చయంబుగఁ బొందరాని
పదవులుండునె ధరణిలోపల సమస్త
జనులకుం బితృభక్తి రసాయనంబు.

గీ॥ చెల్లునని పెద్దలమని తోఁచిన విధమునఁ
జెలఁగి సంసారులకు బాధ సలుపరాదు
నీతిమాలిన యపుడు మన్నింపఁదగదు
గురులనైన మరెట్టి భూసురులనైన.

గీ॥ తమకు లాభ మెదియుఁ దలపోయ కెంతయుఁ
బరులకొలకు పాటుపడుచునున్న
పిన్నవారికైనఁ బెద్దలకైనను
మంచిచెడ్డ దెలుప మనసె సాక్షి.

## 22. భవనిరాసము :

సీ॥ తల్లిగర్భమునం దొదవినట్టి కష్టము,
పొత్తిళ్ళ లోపలఁ బొరలుబాధ,

పసితనంబున నన్యవశతచే నిబ్బంది,
యౌవనంబునఁ గామయాతనయును,
వార్ధక్యమున వ్యాధివలన వేదన, క్షుత్పి
పాసల నంటినపట్ల నిడుమ,
సతత మంతర్బహిశ్శత్రుజనిత పీడ,
తాపత్రయంబునఁ దగులుచింత
బ్రతుకు నిఖిలం బిదియె సుఖాభాస మకట
దుఃఖపూరిత మటుగాన దురితదూర!
వాసుదేవ! ముకుంద! యీ భవము మఱలఁ
జెందనీయక నన్ను రక్షించు కృష్ణ!

## 23. కర్మము:

సీ॥ పాతాళగంగ నుపాయంబునం బైకి
రప్పించవచ్చు యంత్రములచేత
మెలపున జీవనదులఁ గాల్వలం దీసి
నీరు వలయుచోట్ల నింపవచ్చు
పర్వతములఁ గల బలు నీటిధారల
నెప్పట్టులకునైనఁ ద్రిప్పవచ్చు
వేయేల మఱికొన్ని వెళవులఁ గోరిన
వేళ వాన న్గురిపించవచ్చు
కర్మమునఁ గానిదెద్దియుఁ గానరాదు
కర్మమే దైవతము జగత్కారణంబు
కర్మవశమున స్వర్గాధికార మందు
వాని కిటు లంచమిచ్చుట వట్టి వెఱ్ఱి.

## 24. భక్తలక్షణము :

సీ॥ నీవె సర్వంబని నిశ్చయించినవాఁడు
భవరోగ మంటఁడో పద్మనాభ!
త్వద్దివ్య నామామృతము గ్రోలువాఁ డిహ
భోగంబు లొల్లఁడో భోగిశయన!
నీ పదాంబుజ భక్తినిరతుఁడౌ వాఁ డన్య
కర్మము ల్సేయఁడో జ్ఞానరూప!
నీదు దాసులతోడ నేస్త మందినవాఁడు
పరుల సేవించఁడో పరమపురుష!
నీవలన బ్రతుకున్‌గాంచు నేను నిన్ను
మోసపుచ్చఁగఁ బూనితి మూఢుఁడ నయి
అక్కటా! గ్రుడ్డు పిల్లను వెక్కిరించు
నట్లు మాధవ! గోవింద! హరి! ముకుంద!

## 25. మహార్తి చిత్రణము :

సీ॥ చిరుగుంట కల్గిన చెక్కిలితోడుత
నద్దిరా! యద్ద మెట్లగును సాటి
ముక్కుప్రక్క మొదలు మోవి మూలవరకుఁ
బొల్పారు వంక కే పోల్కిగలదు
హొయలుఁగఁ బల్చాలు నొకవైపు గన్పర్చు
పిన్ననవ్వున కెటు వెన్నెల యెన
నడుమ చక్కనినొక్కు తొడరిన గడ్డము
పొలుపున కెద్దానిఁ బోల్పవచ్చు
భళిర! యాత్మైకవేద్య స్వభావమహిమ
నుపమ లుత్ప్రేక్షలుం దమ యూహఁ బన్ని

తప్పుబల్కుట గాక సత్యమునఁ దరమె
యజునకైనను మఱి వాని యబ్బకైన.

## ౭. మార్కండేయు చరిత్ర

### 26. అభ్యుదయాభాసము :

సీ॥ జనులార మన పిన్నతనమున మనకుఁ గ
లిగిన హాయి, యప్పటి మన యవస్థఁ
గనుగొంటిరే నాఁడు కనులకుఁ జీమప్రా
కుట సైత మెంతయో గొప్ప చోద్య
ముగద యెంతటి యాకలి గొనియైనం జప్ప
టులు విన్నయంత నేడ్పు దొలఁగుఁగద
నేడు మోదముసేయ నేరవెవ్వియు మన
చూపులకైనను శ్రుతులకైన

నక్కటా!యీడుతోడుత నాసపురుగు
పెరిగి చెలరేగి సంతుష్టి జెరచుచుండె
జ్ఞాన మేపారె నజ్ఞాన మనుచుఁ
జెప్పుకొనుటకు లోలోన సిగ్గుపుట్టె.

### 27. మనుష్యుల పోకిళ్లు

గీ॥ ఎట్టిచీరఁ జూచి వెట్టియెనలు బెట్టి
పరుగులిడుచు నార్చు బట్టఁబోలి
ప్రతిభఁ గాంచి యోర్చు ప్రాజ్ఞత లేమిఁ బై
కుబ్బి శక్తిహీను లుల్కుచుంద్రు.

గీ॥ పాలకులు తనకిచ్చు జీవనముకన్న
రెండురెట్లులు గుఱ్ఱపుబండికొాలకు,
సానిపాపకు,మఱియు సీసాలకొాలకు
నిచ్చు నుద్యోగి కప్పెచ్చువచ్చునెట్లు?

సీ॥ ఒకచోట సాధులఁ ద్రికమకలం బెట్టి
బాధించి మను న్యాయవాదిజనము
లొకచోట రాజులయొద్ద నిచ్ఛకములఁ
బల్కుచు నెగడు విద్వత్కులమ్ము
నొకచోట లంచము లొడిసి మ్రింగుచు దంభ
మొయ్యనఁ జూపు నుద్యోగిగణము
నొక్కచో వెలిసేత లెక్కించుకొనుచు రూ
కలఁ దీయు పీఠాధికారిబలము

లక్కటా వీరలే యిపు డవనియందు
సకలజన సూత్రధారులై సాగుచుంద్రు
మారికివ్వలె వీరికి మనుజులెల్ల
వడకుచుందురు కలికాల వశముచేత.

ఉ॥ అప్పెగవేయకుండ మరి యర్థము దొంగిలకుండ శత్రువు
లొప్పపడకుండ పాలకులు జూచినఁగాని సమస్తసౌఖ్యము
లెప్పునఁ బారఁద్రోలి యవశంబయి వచ్చెడు చావుదయ్యము
న్రొప్పఁగఁజాలినట్టి చతురుం డొకఁడైనఁ గనంగవచ్చునే?

## 28. స్తుత్యమృత్యుంజయము:

శా॥ గౌరీచిత్త సరోజభృంగ।త్రిజగత్కల్యాణదాపాంగ।సం
సారధ్వాంతపతంగ।మూర్ధవిచలత్స్వర్గాపగాభంగ।కే

యూరప్రాప్తభుజంగ।మర్దితబలోగ్రోద్దండమాతంగ।తా
రారాట్పరిజ్వలితోత్తమాంగ।లలితార్ధస్వాంగ।మృత్యుంజయా

మ॥ చటులాంభోధిగభీరభాష।విచలత్స్వర్వాహినీభూష।సం
కటసంసారవిశోష।దృష్టివిలసత్కారుణ్యపీయూష।దు
ర్ఘటరక్షోజనభీష।భక్తజనహృద్రాజీవసంతోష।సో
త్కటగౌరీరమణీయవేష।దురితాంధఃపూష।మృత్యుంజయా

మ॥ రవిచంద్రానలనేత్ర।దుర్ఘటమహారక్షఃపురీజైత్ర।సం
స్తవనీయోరుచరిత్ర।భక్తజనహృద్రాజీవసన్మిత్ర।దు
ర్భవషడ్వర్గలతాలవిత్ర।గిరిజారామావనీచైత్ర।భ
స్మవిలిప్తాంచితగాత్ర।భూరివియదంభఃపాత్ర।మృత్యుంజయా

మ॥ కరుణాలోకనజాల।రాత్రిచరమేఘస్తోమవాతూల।సిం
ధురచర్మాంచితచేల।మూర్ధవిలసద్వ్యోమవాహినీకూల।న
గ్గిరిజాచిత్తవిలోల।భక్తజనహృద్వీధీనటచ్ఛీల।భా
స్వరదక్షిణయశోవిశాల।శశిరాజత్ఫాల।మృత్యుంజయా।

మ॥ నిరతశ్వేతగిరీంద్రగేహ।ప్రమదోన్నిద్రాశ్రితవ్యూహ।బం
ధురగోనాయకవాహ।దుష్టదనుసూనుస్ఫోటనోత్సాహ।దు
స్తరరక్షఃపురదాహ।పర్వతతనూజాబద్ధసమ్మోహ।సిం
దురచర్మాంచితదేహ।భక్తజనబంధుస్నేహ!మృత్యుంజయా

మ॥ అరుణాంభోరుహవీక్ష!దైత్యకులరాడ్దస్తీంద్రహర్యక్ష!దు
ర్ధరహాలాహలభక్ష!సంచకితభక్తప్రాణసంరక్ష!దు

ర్ధరసంసారవిపక్ష! సర్వసుమనఃప్రస్థాపనాధ్యక్ష! సిం
ధురదేహాంచితకక్ష! భూమిధరరాడ్పుత్రీకృపేక్ష! మృత్యుంజయా!

మ॥ నతబృందాభయదాన! ఫాలతలవిన్యస్తోద్ధురాత్ప్వాన! సం
తతసామాగమగాన! యోగిజనహృద్యన్మోక్షసంధాన! ప్రో
ద్ధతహాలాహలపాన! రక్షితకనద్దాక్షాయణీమాన! సం
గతకారుణ్యనదీన! శశ్వదపరోక్షజ్ఞాన! మృత్యుంజయా!

మ॥ పరిపుష్టాబ్జభవాండ! శిక్షితసురప్రత్యర్థివేదండ! సం
సరణచ్ఛేదనశౌండ! కల్మషతమిస్రస్తోమమార్తాండ! దు
ర్భరరక్షోజనదండ! దారితమదోగ్రక్రూరపాషండ! బం
ధురవేదాళికరండ! శూలవిలసద్దోర్దండ! మృత్యుంజయా

## ౮. యథార్థ రామాయణము



## 29. రాకాసి:

సీ॥ పదఘట్టనమునకు బెదరి జంతులు పాఱఁ
బెను హుంకృతికి దెస ల్వీటదేలు
వ్రేలాడు కొప్పున వెదురుదొంకలు చిక్కు
వడి నేల నూడ్చు చప్పుడు నొనర్ప
గాళ్ళకుఁదగులు వృక్షంబు లన్నియు గడ్డి
కాడలవలెఁ జాపకట్టుకొనగ
అడుగడ్డునకు మధ్య నాపాటి యీపాటి
యేఱులుం గుట్టలు నిముడుచుండ

లోనికిం బైటి కూర్పు పుల్గులనులాగ
నరకపాల ముక్తాభరణంబు లెసఁగ
నగ్నికుండము లట్లు రక్తాక్షి లలర
వచ్చి తాటక పిడుగులువడగఁ బల్కె.

## 30. తత్త్వము :

గీ॥ లేని దున్నయట్లు లీలకై తలపోసి
పురుషుఁ డందు బంధమోక్షములను
బిల్లకాయ మాడ్కి నెల్ల జగం బిది
వచ్చుఁ బోవు నతని యిచ్చకొలఁది.

గీ॥ ఎటుల భావింప నటు తోఁచు నిజ్జగంబు
ఆత్మ తప్ప మఱే వస్తువైన లేదు
కలుగుఁ దనయంత జ్ఞాన మజ్ఞానమట్లు
శాశ్వతంబగు నాత్మకు సహజమిద్ది.

గీ॥ కలదనిన లేదు, లేదన్నఁ గలదు జగము
నభమునందువఁ గన్పడు నల్పు మాడ్కి
నిర్గుణుఁడు నిత్యుఁ డాత్మ డనిశము ప్రకృతి
నంటఁ డంటియు నీ రామరాతు వలెను.

## 31. ప్రభాతము :

సీ॥ తప్పు బయల్వడ్డ చొప్పున, నోడిన
వెరపునఁ జంద్రుఁడు వెల్లఁబాఱె

సిరిదొఱంగినవాని పరివార మటు సన్న
సన్నఁగఁ జుక్కలు సాఁగఁదొడఁగెఁ
గ్రొత్తగాఁ గవగూడుకొన్న దంపతులకు
గుండియల్ ఝల్లనఁ గోడి కూసె
దవ్వెంత యేగియుఁ దలక్రిందుపిట్టలు
దారితప్పక తమ తావుచేరెఁ
గలువలు న్వాడెఁ,దమ్మిపూవులును వీడెఁ
బులుఁగులున్ బ్రొద్దునకు మేలుకొలుపు పాడెఁ
బన్ను లే కెల్లరికి నబ్బె బైరుగాలి
తెల్లముగఁ దూర్పు బళ్ళునఁ దెల్లవారె.

## 2. నవవధూవర చేష్టలు :

సీ॥ పరులకుఁ గనరాని వెరవున నొండొరు
సొలపునఁ గ్రేఁగంటఁ జూచుకొంట
వంగిలేచుచుఁ బరస్పరము లాఘవమున
దోసిళ్ళఁ దలఁబ్రాలు పోసికొంట
లంకెవడిన చెంగుల న్వ్రత్తపది ద్రొక్కి
తడబాటున మిథము తగులుకొంట
మనసులఁ గల్పిన కనుల కన్యోన్యమున్
జల్వకప్రపు బుక్కఁ జల్లుకొంట
బలు వసంతపు బిందెలోఁ బరగు నుంగ
రంబు వెదకుచుఁ గెంగేలు రాచుకొంట
మొలకనవ్వులు నవ్వుచు ముద్దుగొంట
నవవధూవర చేష్ట లందముల పంట

సీ॥ తలుపుతెఱచుపాట తడబడి యొండొరుం
బేర్కొన సిగ్గున న్వెనగులాట

కెంగేలు గలిపిన సింగారపు పచారు
నడ్గడున నివాళి నందు సౌరు
అలుకోర్కి మడుపుల నందించుకొను నేర్పు
నిముసమ్ములోన వేసముల మార్పు
ఇక్కువలఁ బువుచెండ్లేయు జాణతనంబు
నెగసక్కెముల మొల్కనగుల డంబు
గడుసుముద్దు వినీవినపడని సుద్దు
కన్నుమెలపు కడు స్గత్తకొన్న వలపు
క్రొత్త యాలుమగలు గయికొన్న పగలు
పూని గడియించు టెటు నల్వయైనఁ గాని.

## 33. వనవాస రాజభోగము :

సీ॥ ధరణి తివాసి, వితానము విను, వ్రేల
బడు దీపగోళము లుడులు, వెల్గు
చూపెడు దివిటీలు సూర్యచంద్రులు, కొండ
గాలి జంత్రము, తలగడలు రాలు,
సౌధరాజము పర్ణశాల, కార్ముకములు
ద్వారపాలురు, మంటియరుగు గద్దె,
కరములు బంటులు, కాళ్ళు గుఱ్ఱములు, దుం
పలు భోజనము, చెటుపట దుసు,
జడలు సొమ్ములు, ధర్మరక్షణము ధనము,
దుర్గము గుహ, యథాలాభతుష్టి మౌళి,
శమము మిత్రము, శుద్ధసత్త్వము సచివుడు
యడవి రాజ్యము, మఱి మన మధిపతులము.

## 34. కష్టసుఖములు :

గీ॥ కష్టసుఖములు మబ్బుల కరణి వచ్చు
నరిగెడుఁ దమంత నవియుఁ జింత్యములు కావు
ఏది యెట్లుండినప్పటి కీ బ్రతుకున
ధర్మపద్ధతి సుంతయు దప్పరాదు.

## 35. భగవంతుని కొలత :

సీ॥ వలయరేఖకుఁ బోలి వశమె తెల్పంగ నీ
కాదిమధ్యాంతము లప్రమేయ!
యెల్లజగంబుల కీవె యాధారము
లెక్కల కన్నింటి కొక్కటివలె
ధర్మమువైపె యెంతయు జోగుచుందువు
బలువువంక ద్రాసుముల విధమునఁ
బెఱుగవు తఱుగవు విభజింపబడవు శూ
న్యాంకమువలె నకలంకచరిత!
పిన్నకుంబిన్న పెద్దకుంబెద్ద వీవు
కొలతకందవు నిన్నెన్న నలవికాదు
చెలఁగు సరిబేసియై నీవు తలచినంత
భక్తమందార భవదూర పరమపురుష!

## 36. రామభక్తి :

గీ॥ రామచంద్రుని కన్న శరణ్యుఁ డెవఁడు
రామనామము కంటెఁ దారక మిఁకెద్ది
రామభక్తిని మించు సామ్రాజ్యమేది
దయను సెలవిండొహో రామదాసులార!

## 37. హనుమద్విక్రమము :

సీ॥ ఉరికితి వేని సర్వోర్ధ్వ లోకంబులు
గిరగిర సుడివడి తిరుగకున్నె
త్రొక్కితి వేని యధో భువనము లెల్ల
దట్టముగా నట్టగట్టకున్నె
యూదితి వేని మహాదధు లన్నియుం
జిఱుతుంపురై మింటఁ జెదరకున్నె
గ్రుద్దితి వేని మేరుధరాధరం బైన
మఱి తుమురై మచ్చమాయకున్నె
సత్యసంకల్పుఁడవు మనోజవుఁడ వీవు
కామరూపి వప్రతిహతగతివి నీవు
నీ మహత్వ మొకింతయు నీవెఱుఁగవు
గాని హనుమంత! నీవు సాక్షచ్ఛివుఁడవు.

## 38. కుంభకర్ణుఁడు :

సీ॥ సంజకెంజాయచే నంజనాచల మటు
కావిదుస్తుల నీలకాయ మమర
విరుగడ మేరుశిఖర మినచంద్రుల
వలెఁ దలకుండలంబులు వెలుంగఁ
గ్రొమ్మెఱుంగుల తోడి క్రొక్కారు మబ్బట్లు
తారహారముల నెద విలసిల్లఁ
గొండలఁ న్మల్లెపూచెండుల గతి నెత్తఁ
జాలిన శూలము కేలఁ దనర
ప్రళయభైరవువలెఁ దాండవము సలుపుచు
నట్టహాస మళనిశబ్ద మపహసింపఁ
గోటగోడ నొక్కడుగున దాఁటి కుంభ
కర్ణుఁ డేతెంచెఁ గపులు నల్గడలఁబాఱ.

# రుక్మిణీ కళ్యాణము



## 39. అరుణకిరణము :

గీ॥ తొంటికొండకు జేగురు తోడుకుండ
చేతులం జాచివచ్చిన లేతయెండ
జగములకు నెల్ల వాచి పెద్దగను దోఁచి
చిన్నయౌటకు వేడి మించెను మరీచి.

# ౧౦. సావిత్రీ చరిత్రము

## 40. శోకహతలోకము :

సీ॥ నిరుపేదలకుఁ గుక్కమురికి సంతానమ్ము
కోటీశు నాలికి గొడ్డటికము
చేతనైన కురూపిఁ జేరనీయదు చెల్వ
యందకానికి లోని యంగు సున్న
మృష్టాన్న మారోగ్యహీనుల కుండును
దినగలవారికిఁ దిండిలేదు
దాతను ముంగాళ్లఁ దన్ని యేగెదు కల్మి
కడు లోభివానిని గౌగిలించు
ఉన్నవా రున్నదని యేడ్వ నుర్విలోన
లేదనుచుఁ గుండెదరు సిరిలేనివారు
చూడ నీ లోకమంతయు శోకహతము
సత్యముం దయ గల్గిన జనము తప్ప.

ఉ॥ ఎన్నఁగఁ గోరనప్డు లభియించును సంపద జాతిబొమ్మకున్
సన్నుతపూజమాద్కి,బెలుచం దనుగోరిన రాదు లచ్చి బల్
చన్నలు మానకమ్మకటు,చావక తీరని గూనివంపు లా
గున్నది స్వేచ్ఛలేని బ్రతు కో జనులార!యఁకేటి సౌఖ్యముల్.

సీ॥ శ్వానసంగతి యటు సంసార మిది సౌఖ్య
మామీఁద బహుళ దుఃఖాకరంబు
పానకాబ్రాయని బలుదప్పిపలెను భో
గేచ్ఛ యెన్నటికి శాంతించఁబోదు
ఆకాశమందు నల్పటు తనపై బాంధ
వప్రీతి గల్గుట భ్రమకృతంబు
ఎనుముతోకంబట్టి యీతకు దిగినట్లు
క్షోణీపతుల నమ్మి గొల్చుచుంట
అనుచు రూఢిగఁ దెలిసి సత్యంబు దయయుఁ
గదిమి దప్పక ధర్మార్థకామములను
పరహితంబుగ సల్పెడి భాగవతులు
సంతతానంద పదవికి సాగుచుంద్రు.

## 41. క్రతునిరాసము:

సీ॥ స్వర్గములోన రంభాభోగ మిట బహు
మానముఁ గొన యజమానుఁ డొకఁడు
దక్షిణకై బకధ్యానంబు సల్పుచుఁ
బండితమ్మన్యుఁడౌ బ్రహ్మ యొకఁడు
సకలక్రియలఁ బృథగ్జనముల నియమించి
దంభుఁడై తిరుగు నధ్వర్యుఁ డొకఁడు

కడుపు కక్కూర్తికై కమురుకంపున కోర్చి
యుక్కిరిబిక్కిరౌ హోత యొకఁడు

శ్రుతుల సారంబుఁ దెలియక క్రతువులందు
బశువులం జంపి సౌఖ్య మల్పంబుఁ గొందు
రుచిత మెఱుఁగక యిదియె విధ్యుక్త మందు
క్రూరకర్ములకుం దయ దూరముకద.

సీ॥ మెఱిగి 'నహింస్యా త్సర్వాభూతాని' యని శ్రుతి
నాదరింపక 'పశుమాలభేత'
యనునట్టి యధమ మంత్రానుసారంబుగ
నల నీచకులము లెల్లమ్మకొఱకు
బలులిచ్చు తెఱఁగునఁ బండితమానులై
విప్రులమంచును విఱ్ఱవీఁగి
జన్మంబునం బేద జంతువులం జంపు
కటిక యాజులకును గలదె ముక్తి

ఉపనిషత్తులు శ్రుతికాంత కూర్ధ్వభాగ
మం దహింసను స్థాపించు నదియె మోము
కనుఁ దధఃకాయ మాపెకుఁ గర్మకాండ
మూని పశుహింసఁ దెల్పు నపాన మచట.

గీ॥ చెఱకుఁ దీపి యనఁగఁ జేరి యద్దానిని
వేళ్ళమోయ నములు వెడగు పగిది
వేదవాక్కు లెల్ల విధులని పశుహింస
నలుపు కూళ భోగములను గోరి.

## 42. ఉత్తములు :

√

సీ॥ ఉత్తము లగువార లుర్విలోఁ దలిదండ్రి
మాటలకుం జవదాటలేరు

పెద్దలఁ బొడగాంచి వినయంబుఁ గన్పర్తు
రార్తులకు న్హిత మాచరింత్రు
కలనైన నవ్వులకైనఁ గల్లలు వల్క
రొరులగొప్పం జూచి యుల్కరెపుడు
ప్రాణిహింసను జేయ రే నెపంబుననైనఁ
దమ కులాచారము ల్దప్పఁబోరు
వ్యభిచరించరు, కొనరు దుర్వ్యసనములను
జ్ఞాను లవుదురు, సోమరుల్గారు, గర్వ
మందరు, బ్రతికెదరు స్వకష్టార్జితముగ,
నీశ్వరునిఁ గోర్కెమాని భజించుచుంద్రు.

## 43. విశ్వరూపిణి

సీ॥ చేమంతిపూవుగ శీతాంశుఁ గీలించి
యొప్పుగ గగనంబుఁ గొప్పుబెట్టి
తారలన్ముత్యాల చేరుచుక్కనమర్చి
నుదిటిపై సూర్యుఁ దన్బొట్టుదిద్ది
చందోయిగా మేరుమందరములఁ జేర్చి
జలధితరంగము ల్వళులఁజేసి
రోమావళి న్వనస్తోమంబుఁ గావించి
ఘనజఘనము భూమిగా నొనర్చి
తన యధఃకాయ మఖిలపాతాళ మగుచు
నశ్వపతి జ్ఞానదృష్టియం దవతరించె
విశ్వరూపంబు తోడుత వేదమాత
పాలితాశ్రితవర్గ సువర్ణదుర్గ.

సీ॥ కంటికి రెప్పట్లు కడు జాగరూకతం
బిల్లలఁ గని పెంచు తల్లి నీవు

అన్నదమ్ములఁ గని పెన్నిధులని కూర్మి
లెక్కించు నక్కచెల్లెండ్రు నీవు
నాయమ్మ నాయయ్య నాకన్నవారని
గొబ్బున ప్రేమించు కూతునీవు
ప్రాణంబు లన్నియు భర్త కర్పించి యి
ల్మర్యాద కాపాడు భార్య వీవు
కార్యహేతువు వీవు,జగమ్ము నీవు
నీవె యంతయు,నెద్దియుం గావు నీవు
నీదు తత్వంబుఁ దెలిసి వర్ణింపఁదరమె
యాశ్రితజనార్తిధర్గ ! మాయమ్మదుర్గ !

## 44. పుంసాం మోహనరూపః :

సీ॥ మొకరితుమ్మెదల నార్పోసిన యట్టులు
ముంగురు ల్నొసటిపై ముద్దులూర
తెలిదమ్మిరేకులఁ దెగడు వాల్గందోయి
నెమ్మియు నోరుపు నెనరుఁ దెలుప
పలుచాలు మల్లెమొగ్గలు,చివుర్వాతెర,
కార్జాంపము బవిరిగడ్డ మమర
కుంచపుమొదలటు గొప్పమెడయుఁ బెద్ద
తలుపువలె రొమ్ము తనరుచుండ
శిరఃముంగాళ్ళ దాటు చేతులును,మరియు
నడుము పిడికిట నిముడు,కుందనపుఁ జాయ,
యొడలు తిన్నని యేరాసియొడ్డు పొడవు
అడుదేమితవిని మగవాఁడె వలచు.

సీ॥ కందున్న పున్నమ చందురుఁ గాదంటి
మోపిని మోమున కుపమ యేది

యజ్ఞము ల్వాడు నటన్న నిక్కుఁ డోయి
కగు నెచ్చట నిదర్శనాతిశయము
ఏన్గుతొండమ్ము లిస్సి వంక లన పీవి
హ స్తమ్ములకును దృష్టాంతమున్నె
మరి యనంగుం దగు మరుని కితనితోడ
సకియరో సుందరైన సమ పదెట్లు

సహజ సద్గుణ సౌందర్యశాలికైన
సతతదోషాధిక కురూప యుతునకైన
దానియెందు కలంకార శాస్త్రగరిమ
యంక నీ యందకావి వర్ణించు టెట్లు.

## 45. ఆమని :

సీ॥ చెవులకుఁ జల్లగఁ జెలఁగి కోయిల కూసె
నందడి పెండ్లిబాజాలు మ్రోసె
కన్నె వేపయుఁ దొగర్గున్న సమర్తాడెఁ
జలివేంద్ర దాపున సంతగూడె
కమ్మ మామిడితోట కాపుల పని హెచ్చెఁ
బిల్లగాలులు మురిపించి వచ్చె
గొడుగులు, జోళ్ళందచిదిముడిఁ జల్లార్చెఁ
దాటిముంజలు కడు దప్పిఁ దీర్చె

కావడవి వెల్గెఁ, బడవసికారు గల్గె
నందె లింపాయెఁ గౌగిలు ల్పదలిపోయె
ప్రొద్దు లేపారె; మావులు పొట్టివారె
ఆమని మొదలుపెట్టె, బల్ హాయిహెచ్చె.

## 46. భూత భూతేశ తత్త్వము :

సీ॥ పెనిమిటికడ ముద్దుగునిసెడి గువ్వ న
దేల సాళువడేగ యెగరఁదన్నె
పచ్చగఁ జివురించి బలసిన దొంకల
తెగఁద్రాకి మేకపో తేలమేసె
నీటియొడ్డునఁ ద్రుళ్ళి పాటఁబాడెడు కప్ప
జెట్టినిఁ బామేల పట్టిమింగె
కొండను ఢీకొను కొమ్ముల విదళించు
నేన్గును సింగ మదేల చంపె

ఇజ్జగంబున నన్యోన్య హింసవలనఁ
బ్రదులు భూతంబు లిది స్వభావంబుగానఁ;
గాని ప్రకృతివిలక్షణ కార్యమైన
యీశుతత్త్వము దయ నా కిదెట్లు వచ్చె.

ఉ॥ జంగమజీవు లెల్ల మఱి స్థావరభక్షణ జేసి వేడ్క లు
ప్పొంగఁ బరస్పరంబు హితముం బచరింపుచుఁ జావులేక వి
ష్ఠంగొని దైవభక్తులయి జ్ఞానవిభోగముల న్సమానులై
రంగుగ నున్నయప్డు శిశిరా సుఖియించెద నెమ్మనంబునన్.

## 47. విజయలక్ష్మి వివాహము :

సీ॥ భూమి పీఠము,నభంబు న్మేటిపందిరి,
బహుళ ప్రతతి సాక్షివహ్నిగాఁగ
ముకుట తనుత్రాణముల నుండి దుల్లెడు
రవము శైత్యు ల్దలఁబ్రాలుగాఁగ,
జంబుక స్వస్తివాచకులకు శత్రుల
తలలెంతయు ఫలప్రదానములుగఁ,

గూలెడి భట హయ కుంభి భూరిధ్వను
లోలి బాజాబజంత్రీలు గాఁగ,
బలు వసంతము నెత్తురువరదగాగ,
నాకబలి మ్రుగ్గులట్టు లాంత్రములు మెఱయ,
మఱియుఁ బగయొజ్జ ఠంకృతిమంత్రములనఁ
బెండ్లియాడుదు నన్నోహో విజయలక్ష్మి ।

## 48. వీరాలాపము :

స్రగ్ధర॥ కఠినజ్యాఘోష మాశాఘనకరటిఘటా కర్ణము ల్వ్రక్కలింపన్
పిఠరప్రోద్భూత దావాగ్నినిబిడ పరరాణ్ణీరసాగాళిఁ గాల్పన్
జఠరీభూతారినూత్నోష్ణ రుధిరమదిరోన్మత్త భూతంబు లార్వన్
వితరు ల్స్తోత్రింప నస్మద్విజయయశము దిగ్భిత్తుల న్వెల్లవైతున్.

## 49. తొలిచూపులో వలపు :

సీ॥ సలలిత పాదాంబుజాతంబులందునఁ
గొదమతుమ్మెద గవగూడునట్లు
భాసుర నిమ్ననాభీ సరోవరమున
గండుచేపిన జోడు గలయు భంగి
ప్రథిత పీనోన్నతోరః ప్రదేశంబున
ఖంజరీటము జతగట్టు మాడ్కి
కమనీయవక్త్ర రాకాసుధాకరు పజ్జ
ఘనచకోరము జంట నెనయు కరణి

ఏకముగ వలపుజిగురన నెదలనదికి
సన్నిధిం జేరినకొలంది చనువు మిగిలి
రెప్ప లెగసిన క్రమమున గొప్పమీరి
దంపతుల చూపు లొండొంటఁ దారసిలె.

# ౧౧. హరిశ్చంద్రోపాఖ్యానము

## విద్యాగర్వము

గీ॥ తా నెఱుంగుదు ననెడు విద్యలకు మేర
యల దిగంతపురేఖ హద్దట్లు తోఁచుఁ
గాన సంపూర్ణ పాండిత్య మూనితి నని
యులికి సభ నాడుటలు పిచ్చికళలు గావె.

## ధనలోభ దంభము :

మ॥ ధనభోగంబుల యాశచేఁ బొదము నీ తత్వప్రబోధంబు లీ
వినయంబు, ల్మడిపంచెలుం, గరముల న్వ్రేలాడు మాల లొప్పనం
టను నామంబులు, చేతఁ బొత్తములు, కంఠంబందు రుద్రాక్షలున్
ధనవాంఛ న్విడనాడు వారలకు నీ దంభంబు లింకేటికిన్.

## భరతఖండము :

సీ॥ సర్వ శ్రుతిస్మృతి శాస్త్రంబులకు మూల
కందమై విఖ్యాతిఁ జెందె నెద్ది
సంతత జపతప స్స్వాధ్యాయ సత్వ్ర
తావనీసురులచే నలరె నెద్ది
స్వచ్ఛంద రాజ్యసంపద గల్గి పావన
చరితులౌ నృపతుల వరలె నెద్ది
గణియించుటకు నశక్యంబైన కాలంబు
నుండి నాగరికత నిండె నెద్ది

గూలెడి భట హయ కుంభి భూరిధ్వను
లోలి బాజాబజంత్రీలుగాఁగ,
బలు వసంతము నెత్తురువరదగాగ,
నాకబలి ముగ్గులట్టు లాంత్రములు మెఱయ,
మఱియుఁ బగయొజ్జ తంకృతిమంత్రములనఁ
బెండ్లియాడుదు నన్నోహో విజయలక్ష్మి!

## 48. వీరాలాపము :

స్రగ్ధర॥ కఠినజ్యాఘోష మాశాఘనకరటిఘటా కర్ణము ల్వ్రక్కవింపన్
పిఠరప్రోద్భూత దావాగ్నినిబిడ పరరాణ్ణీరసాగాళిఁ గాల్పన్
జఠరీభూతారినూత్నోష్ణ రుధిరమదిరోన్మత్త భూతంబు లార్వన్
విఠరు ల్స్తోత్రింప నస్మద్విజయయశము దిగ్భిత్తుల న్వెల్లవెతున్.

## 49. తొలిచూపులో వలపు :

సీ॥ సలలిత పాదాంబుజాతంబులందునఁ
గొవమతుమ్మెద గవగూడునట్లు
భాసుర నిమ్ననాభీ సరోవరమున
గండుఁబేసిన జోడు గలయు భంగి
ప్రథిత పీనోన్నతోరః ప్రదేశంబున
ఖంజరీటము జతగట్టు మాడ్కి
కమనీయవక్త్ర రాకాసుధాకరు పజ్జ
ఘనచకోరము జంట నెనయు కరణి

ఏకముగ వలపుజిగురన నెదలనదికి
సన్నిధిం జేరినకొలంది చనువు మిగిలి
రెప్ప లెగసిన క్రమమున గొప్పమీరి
దంపతుల చూపు లొండొంటఁ దారసిలె.

# ౧౧. హరిశ్చంద్రోపాఖ్యానము



## 50. విద్యాగర్వము :

గీ॥ తా నెఱుంగుదు ననెడు విద్యలకు మేర
యల దిగంతపురేఖ హద్దట్లు తోఁచుఁ
గాన సంపూర్ణ పాండిత్య మూనితి సని
యులికి సభ నాడుటలు పిచ్చికశలు గావె.

## 51. ధనలోభ దంభము :

మ॥ ధనభోగంబుల యాశచేఁ బొడము నీ తత్వప్రబోధంబు లీ
వినయంబు,ల్మడిపంచెలుం,గరముల న్వ్రేలాడు మాల ల్స్నానం
టను నామంబులు,చేతఁ బొత్తములు,కంఠంబందు రుద్రాక్షలున్
ధనవాంఛ న్విడనాడు వారలకు నీ దంభంబు ఏంకేటికిన్.

## 52. భరతఖండము :

సీ॥ సర్వ శ్రుతిస్మృతి శాస్త్రంబులకు మూల
కందమై విఖ్యాతిఁ జెందె నెద్ది
సంతత జపతప స్వాధ్యాయ సత్యవ్ర
తావనీసురులచే వలరె నెద్ది
స్వచ్ఛంద రాజ్యసంపద గల్గి పావన
చరితులౌ నృపతుల వరలె నెద్ది
గణియించుటకు నశక్యఁబైన కాలంబు
నుండి నాగరికత నిండె నెద్ది

మొదట దేవుని యున్కి నీ భూజనముల
కందఱికి నెద్ది తెల్పెనో యట్టి భరత
ఖండమునఁ జెట్టుచచ్చెడు కాలమునకు
మురుగు పిందెలవలె నిప్డు పుట్టె జనము.

## 53. మాంసాశన నిరాసము :

గీ॥ ఆయురారోగ్యకరములై యతిశయిల్లి
పాలు చక్కెర ధాన్యముల్ ఫలము లుండ
జంతువులఁబట్టి తిననేల జాలిమాలి
జ్ఞానవంతుల మనుకొను మానవులకు.

## 54. సత్యదౌర్గత్యము :

సీ॥ ధనముల నాశించి తగని బేరము చెప్పు
వర్తకు నోటికి వడకివడకి
దీనుల కొంపలు దీసెడు ప్లీడరు
కూటసాక్ష్యంబులఁ గుందికుంది
మిగుల లంచము మేసి నిగిడెడు నుద్యోగి
కలమునఁ గన్నీరు గార్చికార్చి
సోమరిపోతులై సోదెలు పల్కెడి
మతగురువుల చెంత మాదిమాది

యెట్టులుంటివి చెప్పుమా యెల్ల వేద
సరసులం బొల్చు రాయంచ। సాధుమైత్రి
గడపు చుక్కాని। సత్కులాంగనల సొమ్మ।
సువ్రతమ్ముల ముఖ్యమ్మ। సూనృతమ్మ।

## 55. శ్మశానము :

సీ॥ వెదురు నిచ్చెనలపైఁ బీనుంగు లొకచోట
నొకచోట గుండాల నుబుకు మంట
కటికయొజ్జల మంత్రకర్మంబు లొకచోట
నొకచోట నత్తెన రుడుకు తంపి
చచ్చినవాండ్లకు శకునము ల్దీర్చు కా
కు లొకచో నేడ్పు బందు లొకచోటఁ
బాతిన శవములఁ బైలాగు నక్క లొ
క్కెడ నొక్కచోఁ ప్రేవు లీడ్చు గ్రద్ద

లుండు ఘోరశ్మశానము దండఁజేరి
తనదు దుస్థితిఁ దలపోసి తలయు నూచి
వెల్లబబ పైకిఁ జూచి నిస్పృహత నవ్వి
యీశ్వరు నపు డతండు ప్రార్థించె నిట్లు.

## 56. పౌషతోషము :

సీ॥ ముంగిట వాకిళ్ళ ముగ్గులు జెన్నొందుఁ
గల్మికూర్పుల నెలగంట ముందు
అత్తవారింటిలో నల్లు డున్న పసందు
వెలుగుచూపుల బోగి వేగు సందు
పెతల కెల్లరికిఁ బేర్వేరునఁ బిలుపందు
రచ్చపందు వగు సంక్రాంతిపొందు
పాటలాటలు దక్కఁ బనులన్నిటికి బందు
కనుమజాతర పేదకాపు విందు

ప్రొద్దురాకకు నిట్టూర్పు పొగలఁజిమ్ము
క్రొత్తచాపును వద్లును గుత్తకమ్ము
కుంపటుల్ గౌగిళుల్ గోరుకొన్న సొమ్ము
పౌషమాసమ్ము సర్వ సంపోషణమ్ము.

# II కావ్యసారణి

## ౧౩. బాటసారి

### 57. నిదాఘవేళ

సీ॥ నెమరువేయుచు లేళ్ళు నీడల నాగె లోఁ
            బొదలలో నెమళులు కుదురుకొనియె,
లోఁతు మడుంగుల నీఁతాడె నేన్గులు,
            పందులు బురదలఁ బాదుకొనియె,
గొమ్మలపైఁ జేరుకొనియెఁ గోఁతులు,పక్షు
            లన్నియుఁ దొఱ్ఱల నణఁగఁజొచ్చె,
లోవలఁ బడి పులు లావులింతలు దీసె,
            నొండులలోఁ బాము లూర్పులుచ్చె
   నడవి సందడి తగ్గె, నల్గడలయందుఁ
   జెలఁగి పొగ చిమ్ముకొంచు కార్చిచ్చు హెచ్చె,
   రెండు జాముల వేసవి మండిపడుచుఁ
   గొండ బీఁటలువాఱంగ నెండకాసె.

### 58. గారడి సూర్యుడు :

గీ॥ ఔర!గారడి సూర్యుండ!యబ్బరంబు
కద బ్రతుకువలె నీ కరకౌశలంబు
అల్ప భౌమంబుల న్జూపి యధిక దివ్య
ములను గన్పట్టనీయక మోసపుచ్చు॥

## 59. వేసవి వేకువ :

సీ॥ ఒంటిపాటునఁ బొక్కి యురువయి కెంపెక్కి
విన్ను తూర్పునఁ దూఱె వేఁగుఁజుక్క
ఱెక్కలు జాడించి ముక్కును గోడించి
కొక్కొరోకో యని కూసెఁ గోడి
నీటితావులఁ దాటి తోఁటల గడితేటి
యొసలు చల్లనఁ జేయుచుండె గాలి
యైదు జాముల కడ్డుగాఁ దోఁచు నిఁకఁ బ్రొద్దు
పొడమెడు నని చాటఁదొడఁగె గంట

కట్టు లెడఁబాసి పిట్టలు బయటఁ బాఱెఁ
దలలు టిక్కించి మొక్కలు చెలువుమీఱె
బలిమి తోడుత నిదురబరువు జాఱె
నెబ్బున న్వేసవి ఱేయి తెల్లవాఱె॥

## 60. తొలకరి :

సీ॥ తొలి తెల్ల కొండలవలె నున్న మొగుళులు
గొప్పలై నీలిరంగులఁ దనర్చె
దూదిపింజెల లాగు దొడ్డమబ్బుల నేకి
కరువలి పఱపులుగా నొనర్చె
వెండిచబుకుఁ ద్రిప్పి వేసినయట్టులు
మెఱుములోడుతఁ బెద్ద యురుము పుట్టె
నేలఁ గమ్మని తావి నెగడించు చందంద
వలుదలై లెక్క చినుకులు మొదలిడె

మింటికి న్మంటికిఁ దఱచుమీఱి వాన
యడుగు లను తీఁగెల బిగించి యాఱవ పడి

వీణె వాయించు నెఱజాణ గాణ మాడ్కి-
నందముల గుప్పి గాలి పాడఁదొడఁగె॥

## ౧౩. వెంలుబంతి

## 61. విద్య :

సీ॥ రిఫ్లెక్టరుం బోలి రెట్టిజేయును నైజ
మగు తెల్విదీపంబు నంటి విద్య
కష్టకాలంబునఁ గడుబీదఱికమున
నుల్లము నోదార్చుచుండు విద్య
దుర్వార దుర్మోహ గర్వాబ్ధిలో మున్గు
నప్పుడు పైఁదేల్చు తెప్ప విద్య
సర్వోపకారంబు సలుపఁగఁజాలెడు
నెల్ల యంత్రముల పుట్టిల్లు విద్య
యట్టి విద్యలఁ బ్రతిఫల మరుగఁబోక
బోధ చేయుచునుండు నీ మూగ గురుల
పౌత్తముల నిట్లు పబ్లికుసొత్తు గాగ
నిచ్చు నాతని శ్రేష్ఠిగా మెచ్చరాదె॥

## 62. గురుశోకము :

సీ॥ ఏ దినంబున శోక మెఱుఁగని బుధులెల్ల
కన్నీటి వరదలు గార్చినారు
చీమబారుల వలె శిష్యు లే దినమున
నెంచలో బడి పరువె త్తినారు

గ్రహణదినము పోల్కిఁ గనుపట్టె నెద్దిన
మఖిలజనస్నాన మతిశయిల్లె
నెద్దినంబున బ్రతుకెల్ల నీ పురిలోన
దుర్దినమ్మై యేమి తోఁచకుండె
నెద్దినంబున మనబడి యేపు దరిగె
నెద్దినంబున గురువుల ముద్దుచెల్లె
నెద్దినంబున శ్రోత్రియం బేపుదొరఁగె
తద్దినంబా యిది? బుధ విపద్దినంబు.

మ॥ స్మితపూర్వాస్యసరోజ,మున్నత భుజా శ్లిష్టంబు,వాజాను లం
బిత బాహుద్వయ,మబ్జనిర్మల శిరో వేష్టంబు,సత్యామృతాం
చిత వాక్పూర,మఖండవక్ష,మరుణస్ఫీతంబు,శిష్యాళిఁ బ్రో
వుతమంచు స్మరు చంద్రశేఖర మహామూర్తిం బ్రశంసించెదన్.

సీ॥ ధర్మమూర్తీ!నీకు తర్పణతోయము
భక్తి నేపారు మా బాష్పధార
పరమపావన!నీకు పార్వణపున్ముద్ర
లకలంకము లగు మా త్రికరణములు
పండితోత్తమ!నీకు ప్రచ్ఛాదనం బచ్చ
నిజమున కలరు మా నిర్మలాత్మ
అగ్రజాగ్రణి!నీకు నాబ్దికకర్మము
పరువైన మా సత్ప్రవర్తనంబు
తే॥గ॥ డెబ్బదైదేండ్లు బ్రతికినా వబ్బ యుభయ
తారకంబుగ నీ వలె గౌరవంబు
గాచుకొన శక్య మెవని కిక్కలియుగమున
సత్కళాంబి రామానుజాచార్యవర్య॥

## 63. దేశదుర్దశ :

సీ॥ ప్రతివస్తువున్నాగ్గి వంతులు ధరహెచ్చె
నెంతటి దుర్దశ యిప్డు వచ్చె
సంగ్రామమునకునై సకలధనము చెల్లె
భటనికరము పరంపదము వెళ్లె
వర్ణములకుఁ బరస్పరకలహము మించెఁ
బ్రాచీనమర్యాద లంతరించె
కలవు,వింతతెవుళ్లు మఱిమఱి కొనసాఁగెఁ
బ్రజలకెల్ల స్వార్థపరత రేగె
డంబ మేపారె,దుష్టభోగంబుమీఱె
ధర్మము నశించె,స్త్రీస్వతంత్రత లభించె
ఆస్తికత యడుగువట్టె సత్యమ్ము గిట్టె
కర్మభూమికి శనిగూడె జ్ఞానమూడె.

## 64. త్రిలింగము :

శ్లో॥ త్రిలింగదేశభాషైవ పరుషాక్షరవర్జితా
నిస్పష్టా సర్వసులభా స్వతంత్రా సర్వలౌకికా॥

శ్లో॥ త్రిలింగభూరేవ భూమిః। త్రిలింగనర ఏవ నా
త్రిలింగభాషైవ భాషా నాత్ర కార్యా విచారణా॥

## 65. పురవర్ణన :

సీ॥ భ్రాజతే కుక్కుటేశ్వర మాధవాలయా
ఖ్యం నభశ్చుంబి సౌధాంతరే

హాస్పిటల్ మీషజ-హాతాబ్నిమూనవి
హీషష్త్ సౌఫీర్జి-హీరసాల
రావు సూర్యారావ్ది-రాజా బహాదుర్ది
చారిట బిల్రూల్ స్లేజింట్ఫరెవ్రి
చదువుల పుట్టిల్లు-చల్లగాలి న్వెద
జల్లుఁ బొగ్డ్తలి-వేల్లఁ వెల్లు
మేటిపంటల టెంకి క-ల్మిమెద లంకి
బెస్టుటౌనిగ్గొడావరీ-యాసిస్టిజె
మర్జపీర్వ్యజవాల్జవాల్-మీర్జనాన
పీఠికాపుర మ సి త్రి-విష్టప మివ

సీ॥ వేసవి యెండైనఁ బ్రియమగుచుండు ని
ల్లాలి చూపుల పొలయల్క మాడ్కి
హితమయ్యెడు నకాల హిమపాత మయ్యు వి
వాహ మందలి యుపవాస మట్లు
పరుషప్రకృతి యయ్యు బహుఫలదం బగు
ననవరతంబు పిత్రాజ్ఞ కరణి
అత్యున్నతం బయ్యు నతిసులభం బగు
సాదుల భగవత్ప్రసాదము వలె
చెమటపట్టని తావు, సౌఖ్యముల ప్రోవు
అలసటల గొట్టు, దొరలకు నాటపట్టు
క్రూరజంతుల వేర్విత్తు, క్షోణి నత్తు
కనుక నీ నీలగిరియే స్వర్గంబు తునుక॥

దండకం॥ జయజయ జగతి శీతానిలోద్భూత రంగత్తరంగావళీ
రమ్య కాసారకేళీ చరన్మత్త శుండాల శుండోత్థిరాంభః
కణా స్వాదనోత్ఫుల్ల సూనాంచిత్రారామవల్లీనికుంజా:
లులాయాసుర క్రూరసమ్మర్దనాంఘ్రిద్వయ స్ఫార

దుర్గాలయాలంకృతాశేష భూమీధర భ్రాజితాగ్నేయభాగా:
ముహుర్జ్వాలసూర్యాంశు దీప్తాయుధస్తోమవేషా
లసత్సైనికాజ్ఞానుకూల ప్రచండప్లుత ప్రాపితస్వేద
పూర్ణాభిషిక్తాంగ విభ్రాజమానాశ్వరింఖా
సముద్ధూత ధూళీ పరివ్యాప్త దిఙ్మండలా:
లోహయంత్రోజ్ఝిత స్వాదునీర ప్రపూర్ణ స్ఫురత్కుంభ
భారోచ్చలన్మధ్యవక్షోజవేణీనితంబాంచితాంభోరుహాక్షీ
కటాక్షేషు మూర్ఛద్యువప్రాప్త వాతాయన
ప్రోన్నతస్ఫీత సౌధాగ్రసంభాసురా;
పాఠశాలాగతానేక బాలామణీవార సల్లాప
మంజు ప్రతిధ్వానవత్కూజదుత్కంఠశాలీ శుకీయుక్త
నానావిధాలోల భూమీజపంక్తీ కనన్మార్గ
పార్శ్వోరుపీఠీ మనోజ్ఞా:రమావిష్ణుదాంపత్య శోభాయమాన
క్షమాపాల చూడామణీ శ్రీ మహాచామరాజేంద్ర
వాణీవిలాసాధివాసప్రియా:
సర్వ కర్ణాటదేశోత్తమాంగీకృతా
రాజధానీ మహాశూర నామ్నీ జయ జయ॥

## 66. కళా కౌ శల ము :

సీ॥ ఆడఁజాలనివాఁడు పాడుఁ,బాడఁ నేని
వాఁడు చదువుఁ,జదు వోడువాఁడు
మాటలు చెప్పెకు,మాటలు నేరని
వాఁడు మాటంబట్టి పనియొనర్చు,
కొలువుగద్దియ నెక్కవలవిగాకున్నవాఁ
డందముల న్మెచ్చు.నదియుఁ జేత
కానివాఁడు తనకుఁ గల కొలంది న్లయ
కాంద్రకు న్దగిన కాన్కల నొసంగు

ఆటపాటల చవిలేని మోటకొయ్య
కయ్యమునకు మున్ముందుగాఁ గాలుదువ్వు
ఉబ్బరమ్మెక్కి యందఱ నుసురుపెట్టు
నెల్లరికి లేనిపోని తప్పెన్నుచుండు॥

గీ॥ ఆటపాటలు మప్పుట కలవి కాదు
ముక్కుసెవులట్లు మేనితోఁ బుట్టవలయు
మొద్దురొదవాలకము తోలుబొమ్మలాట
వెక్కిరింపులల్లరిమూఁకవింతజోక॥

మూఁపు॥ చచ్చినవారల మెచ్చు
న్మచ్చిక బ్రతికున్నవారి మఱుఁగునఁ బుచ్చున్
నచ్చి యవిటి యొరు పన్నిక
నచ్చొత్తింపించి తనదె యని చాటుకొనున్॥

ఆ॥వే॥ అందమైన ఆవలి మందికుతుకల లే
దటులఁగాన నెమలి,యాలపోతు,
చింజి,బాతు,మావిచిగురుమేపరి,తేజి,
యేన్గు గొంతుక లేదె యెన్నవలసె॥

ఆ.వె. ఎఱ్ఱచీరఁ జూచి వెఱ్ఱి యెనలు బెట్టి
పరుగు లిడుచు నార్చు బఱ్ఱెవోలె
ప్రతిభజూచి యోర్చు ప్రాజ్ఞత లేమి పై
కుబ్బి శక్తిహీను లుక్కుచుంద్రు.

తే॥గీ॥ ఎల్లరెవరంతవారు వారెందునైన
నొక్కొకని కొక్క నేరుపు దక్కియుండు
నిండుచూపునఁ గొఱవకు నీల్గుఁబోతు
తన్నుఁదా మెచ్చుకొనుచుండు నన్నువలెను.

తే॥గీ॥ ఎందుకో పెద్దలు పడిక ప్లేర్పులచిరి
యాటపాటలు కొల్వున కనువగునటు
తెల్లముగనున్న నలిగిన తెన్ను మాని
త్రొక్కఁ బెడత్రోవ నావంటి నిక్కఁబోతు॥

సీ॥ అంకుల కొల్వున కంకింపకున్నచో
నాటకాదది పేఁకులాటగాని
జన్నపుఁదిండుల నెన్నఁబోవని యెడఁ
బాటకాదది బంగిపాటగాని
వేల్పులగొప్ప తోపింపనేరని చోట
మీటకాదది మోటమీటగాని
జేజేల నెపుడు కైసేయని పట్టున
మాటకాదది కానిమాటగాని
మ్రోలఁ దెఱఁగట్ల రావింపఁ జాలనప్డు
చదువుకాదది నెఱ్ఱగుడ్డి చదువుగాని
జియ్యల న్మది నెలకొల్పఁ జెల్లనపుడు
వ్రాఁతకాదది చెదపుర్వు వ్రాఁతగాని॥

గీ॥ వేల్పులం గొల్చుకొనుటకు వీలుకాని
యాట పాట చదువు లెల్ల బూటకములె
కూటికై దేవులాడు టాటోటు టంకు
బొంకు టకటొంకు బడి మున్నిముచ్చుపనులె॥

కం॥ ఈ యుసురు లేని వ్రాఁతలు
వాయింపులు అవశికాంధ్ర పన్నిక లే వే
ల్పీయక సుంతయు రాఁబో
పేయెడఁ దగు నాటపాట లెవ్వరికైనన్॥

ఆ॥వే॥ తోటివారి కొఱకు పాటుపడెడి వాఁడె
నిక్కమైన చదువు నేర్చినాఁడు

ఒరులఁ జెఱచియైన నొక్కఁడే కుడిచెడి
తిప్పకాయబ్రతుకు తిండిచేటు॥

## 67. కవి:

శ్లో॥ కవి స్సాక్షాత్త్రియీమూర్తిః కావ్య మేతచ్చరాచరమ్
న కశ్చి ద్వస్తుతో భేదః కార్యకారణయో స్తయోః

శ్లో॥ యః కోపి ప్రతిభాశాలీ కవిర్లోకే విశిష్యతే
మహీయతే నభస్యేక ఏవాయం లోకబాంధవః

శ్లో॥ ధర్మార్థకామమోక్షాణాం కావ్య మేకైక సాధనమ్
ప్రత్యక్షా దేవతామూర్తిః కవిరేవ న సంశయః

శ్లో॥ సంగీతం పుష్పముద్దిష్టం సాహిత్యం తద్రజః స్మృతమ్
ఆస్తికత్వం ఫలం ప్రోక్తం కైవల్యమ్ రస ఈరితమ్

తరువోజ॥ తొల్లింటివారు చదువుకొను చెల్లఁదొడివారలకుఁ బెంద్రోవ చూపుటకు
మళ్లిపుట్టెడు లెవు ల్మాన్పించు మంచి మందిచ్చి నిచ్చలుం బ్రతికించుకొలుకు
అల్లరిచేయు చిప్పడుజాతులెల్ల నల్లిబిల్లిగ మాట లల్లువారగుచుఁ
జిల్లరమూఁకలం జెల్లరే।పొగడి చిక్కించుకొని డబ్బు చెలరేగుచుంద్రు

✓ గీ॥ సాఁగి కమ్మెచ్చునవ్వచ్చు తీఁగ కరణి
సాలెపురుగు కడుపులోని నూలువలెను
దబ్బున న్బొర్లిపడు కొండ ధార మాడ్కి
సహజకవిత బయల్వెడి-సన్నుతిఁగను

ద్వి॥ కొతికి యాడుపుకాళ్ల గుజ్జుపుతట్టు
గతి బల్మి లాగిన కవన ముండెడును

గీ॥ కావ్యదోషంబు లరసి జగదుపకృతిగ
నుల్లనము నీతి ప్రజ కుప్పతిల్లునట్లు
వింతవలెఁ బ్రాతసంగతి న్వెల్లడించు
వేదబము మాని సహజకవిత్వశాలి.

కం॥ కనుపర్చు న్దెల్లముగాఁ
దన కావ్యాదర్శమునఁ బదార్థము లెల్లన్
జనములకు న్సత్కవి యా
తనివలె మేల్పఱుప్పటకు నితరుల వశంబా.

కం॥ పదముల పొందికచే రస
మొదవించియు శక్తిచూపియు నసత్కావ్యం
బుఁ దెలుపరాదే కవియున్
గదుకొని "తారాశశాంక"కారుని మాడ్కిన్.

గీ. కాళిదాసుని రఘువంశ కావ్యముఁ గనుఁ
గొనియు, భవభూతి నాటకమును జదివియు,
బాణు గద్య మరసియుఁ గవనము చెప్ప
వెఱవఁ దద్దిర నావంటి వెఱ్ఱివాఁడు.

## 68. శృంగార సంగీతము :

చ. వలపుల మీరిమీరి నునువాతెర తేనియ లానియాని గు
బ్బల నెద గ్రుమ్మిగ్రుమ్మి పలుభంగుల ముద్దులు వెట్టివెట్టి 'నే
వలచిన వన్నెకాడ! యిఁక వద్దుర జా'గని పైకి లాగు నిన్
దలఁచిన గుండె ఝల్లుమని తల్లడ మందుగదే తలోదరీ!

ఉ॥ సన్నపుమోటిక ల్గలుగు చక్కనిచన్నులఁ బైట జారఁగా
చెన్నగు వీణ మోపి శ్రుతిచేయుచు మెట్లు లమర్చి తీగెలన్

## కచ్ఛపీ శ్రుతులు

క్రొన్నెలవంక లొప్పు కొనగోళ్లను మీటుచు నీదు చెంత నా
చిన్నన వాద్యగానముల సేతఁ దలంచెద భీమశంకరా!

చ॥ క్రమ మెఱుఁగంగలేని విధివ్రాఁత బలమ్మునఁ దమ్ము మోయు మ
ధ్యముపయి నీదు చన్ను లిసుమంతయు నక్కటికంబు మాని యు
బ్బి మదకఠోరభావమున విస్తరమంది చలింపఁజేసి జృం
భము నటు జూపకున్న క్షతమర్దన బాధలపాలు గావుగా
అమితవిజృంభణంబు లబలా!తగునా?సుజనాళి కెప్పుడున్.

మ. ధనమా రాదు,దురాశ పోదు,పరతత్త్వజ్ఞానమా లేదు,కృ
ష్ణునియందా మది నిల్వఁబోదు,సుమబాణు న్నోర్వఁగారాదు, ని
న్నెనయన్ లోకములోన వాదు,విరహం బిట్లుండగానీదు,పా
వనవంశంబు స్వతంత్రమీదు చెలియా!వాంఛ ల్తుదల్ముట్టునే?

గీ. కెంపెదవి గంటువఱపు సీత్కృతులఁ గఱపు
మయి గగుర్పాటు సేయుఁ బైపయిని డాయు
రేయి జెలరేగు బవ లెదబాయ బాగు
చెలియ పోలిక చలియును డెలియవెలయు.

ఉ. కోరిక దీరదాయె,నిను గొబ్బునఁ జూడఁగ దూరమాయె,నీ
వారికి భారమాయె,సుమబాణుని వైరము ఘోరమాయె,నీ
నేరుపు నేరమాయె,మరి నిందలు నారులునూరులాయె,నా
పేరున లోపమాయెఁగద భీతమృగాక్షి!యిఁకేమి వ్రాయుదున్.

ఉ. నీ దయఁబొంది మారుని తృణీకృతుఁ జేసిననాఁడు మెచ్చి రో
హో ధృతివంచు నిప్పు డొహొహోయని నవ్వెద రెంత వెఱ్ఱులో!
యే దురమం దనంగుని జయించుట లెట్టులు నిన్నుఁ బాయగాఁ
గాదె క్షణంబు వత్సరముగాఁ- బ్రకృతి న్వికృతు ల్వెలంగెరున్

## 69. మశకమాధవము :

శ్లో. చక్రభ్రమణకరత్వా త్కుదృష్టిబి ర్దూరం వర్జ్యమానత్వాత్
శ్రుత్యన్త ఖేలనత్వాత్ మశకః త్వామేవ మాధవం మన్యే.

## 70. దేశభక్తి ప్రబోధము :

ఆ॥వె॥ మనదు శక్తి యెకమత్యము బొందక
యలఁతి పగతునైన నడఁచునెట్లు
లెన్నునందుఁ బడక రెండుజాముల యెండ
కడఁగి దూదినైనఁ గాల్పఁగలదె॥

గీ॥ మీసములు రోసములు గల మేను మనది
ఇళ్లు వాకిళ్లు పైపాటు లెల్ల మనవి
ఆటలుం బాటలుం బలుగోటు మనవి
బలుపు పెనుదిండి సోమరిపాటు మనవి
కాని మన తల్లిదేశము కాదు మనది

## 71. కఱవు :

కం॥ త్యాగము చెడెఁ, బేదలు కా
రాగృహము న్దిండికై చొరన్గడఁగిరి, బల్
తీఁగలు చెట్లు న్మాఁడెన్,
క్రాఁగిన చమురువలె నెండ కాయుచునుండెన్.

కం॥ అంగనలకు శ్రమ మయ్యెన్
గంగాధరులకును మిగుల గర్వం బయ్యెన్
రంగుచెడె స్నాననిష్ఠలు
ఎంగిలి భాండముల కుది యిసుకయె చేసెన్.

చ॥ తలుపులు మూసిలేవెచట, దాళము పెట్టెకు వేసిలేదు, కు
క్కలయినబంటులైనమటి కావలియుండుటగానరాదు, వీ
దుల బడియుండిన స్ధనము దొంగిలఁబో రెవరైన సుంతయుఁ
భళిభళిరాజెవందు పరిపాలనము న్గలవట్లు చేసెదుఁ.

## 72. అర్ణోవర్ణన :

సీ॥ పల్లంబు వంకఁ బ్రవర్తించె నీర్వీశే
 ష్యముజాడఁ జను విశేషణము భంగి
అడవి కార్చిచ్చుల కాదేశమై కొండ
 వఱద యాగమమయ్యెఁ జెఱువులకును
గమిఁ బ్రకృతిప్రత్యయము లట్టు లన్యోన్య
 మెదయ కేళ్లుం గాల్వ లేకమయ్యె
కర్మభావ ప్రయోగములందుఁ దప్పని
 యాత్మనేపద మటు లలరెఁ గప్ప
వడి నలౌకిక విగ్రహ వాక్యముగతిఁ
గోకిలరవంబు వాడుక నేకయుండె
పల్లవిత బహువ్రీహి సంపటల మగుచుఁ
బ్రబలి వ్యాకరము వలె వాన వెలిసె॥

సీ॥ ఏయెడఁ బెట్టనియెరువు వందునఁ గ్రొవ్వు
 చేనిలంకలఁ దనలోన నిల్పి
మొలనూలువలె సేతు వులియఁగ లేచి కా
 ల్వలకేలు చాచి జీవనము లొసఁగి
సంసారము న్గడ్పు స్వతరంగములవంటి
 పడవల న్దరులకుఁ బ్రజల నడిపి
పెరిగినకొలఁది సత్పురుషజీవిత మట్టు
 లెల్ల ప్రాణుల కుపకృతిగఁ దిరిగి

దాతయటు లన్నిచోట్లఁ బ్రఖ్యాతి వడసి
పండితునివలెఁ బూజ లెప్పట్లఁ గాంచి
ఆర్యగతిఁ బూర్వమర్యాద ననుసరించి
సప్తఋషి పద్ధతుల గోద జలధినెనసె॥

ఆ॥వె॥ పానగోష్ఠి నెమ్మి వలెఁ గొన్ని కాల్వలు
వాన కురియు నంతవగకుఁ దోఁచి
పంకశేషము లయి యింకెరుఁగ, మఱికొన్ని
మన్ను నపుడు సుజనమైత్రిఁబోలు॥

సీ॥ మీఁదుక్రిందుల దవ్వుమేరఁ ద్రుళ్లిడుచోఁ జ
తుర్విధ వాద్య మాధురి వహించు
చెలఁగి చరాచర జీవులఁ బెంచుచో
సదయ బౌద్ధప్రశాసనము మించు
సుడిగొని త్రిప్పి వస్తువు ముంచి తేల్చుచో
డాఁగురుమూఁతలాట మఱపించు
పైకుబ్బి బండల బంతులాడించుచో
గారడీని కరలాఘవముఁ గాంచు

నిగుడు కార్చిచ్చుపాలిటి నిధనతార
తీర పుష్పిత సకల ధాత్రీజవార
కలితడిండీర నవమధుతులితనీర
స్వచ్ఛముక్తాప్రభాపూర యద్రిధార॥

ఉ॥ నూతులు కొన్ని సజ్జనమనోగతిఁ జేయుఁ బరోపకారముల్
ప్రీతిగఁ దీపులై,సులభరీతిగ జీవనదాయకంబులై
యేతటినైనఁ,గొన్ని కడనేవగఁ,జేఁదుగ,నంటరాక,దు
ర్జాతుల శాసనంబటు లెసంగెరు నప్పులఁ గష్టకారులై.

## 73 టెన్నిసుక్రీడ :

సీ॥ ధర్మార్థ మెగచు మత్స్యముల లంకించు గ్ర
దలగతి బంతికోలలు చలింప
అస్వతంత్రపు బ్రతుకట్టు లట్టిటు తూలఁ
గొట్టఁబడిన చెండ్లు మిట్టిపడఁగ
రాణివాసపు తెఱలా గంటరాక మ
ధ్యస్థమౌ జూలు మర్యాద నిలుప
యజ్ఞవాటము వలె స్వచ్ఛమై నున్నని
హద్దుల నాటప ట్టలరుచుండ

భటులు మగ్గపుకండెల పగిది తిరుగ
ఓటమి న్గెల్పు లెక్కించు మాట చెలఁగ
అలకనారాయణ గజేంద్రుఁ డతిలఘువుగ
వేడుకలుమీరఁ గందుకక్రీడ సల్పె.

## 74. తిరువళ్లూరు రాజాయి పాట :

గీ॥ జిలుగు రతనాలపేట, పూచెండులాట,
క్రౌంజవుల యూట, అమృతంబు కొలను మోట,
వలపు ముద్దుల మూట, పువ్విల్తువేట,
హాయి నొడవోయు తేట రాజాయి పాట.

## 75. పప్పు వెంకన్నగారి పాట :

ఒకసారి పావుర మొదిగి వచ్చిన యట్లు
వానకోయిల పిట్ట పలికినట్లు

ఒకపరి మేల్పాటా నొడిసి పట్టినయట్లు
మించుతో మబ్బు గర్జించినట్లు
ఒకమారు వెన్నెల లొలికి కాసినయట్లు
కొలనిలో జలకేళి సలిపినట్లు
ఒకతూరి గవ్వ గిలకరించినట్టులు
చేడెతో పూల చెండాడినటు

చిన్నినాయన్న నీ పాట వెన్నముద్ద
లేసినట్టులు జువ్వల నెగచినట్లు
సన్నచెంబేలి జాజులు జల్లినట్లు
చిన్నిపూదేనె పైపయి చిందినట్లు.

# III శతక సారణి

## ౧౪. సూర్యనారాయణ ము

❖❖

### 76. సూర్యనమస్కారములు:

మ॥ అరవిందప్రియ! నీవు దూరమగు నప్డయ్యయ్యో! దుర్దాంత దు
స్తర ఘోరాంధతమిస్ర మగ్నమయి భూతవ్రాత మాపత్పరం
పరలం బొందును నీదు తత్వ మెదలింప న్సర్వము న్మాన్యమా
వరయ న్నీవె చరాచరంబులు మహాత్మా! సూర్యనారాయణా!

మ॥ కమలా! నీ వికసింపఁజేయునెడ శృంగారంబు హాస్యంబు, దు
ర్దమ మందేహతమిస్రమారణమున న్రౌద్రాద్భుతోద్వీర సం
క్రమ బీభత్సభయానకంబులు, లసత్కారుణ్యముం దావకీ
న మహాభక్తులయందు. నస్తగిరిపొంతన్శాంతి భావంబు నీ
వమరంజేయుదు నిత్యనిర్గుణుఁడవై హాసూర్యనారాయణా!

మ॥ తనరంగా భువనైకసుందర వధూదంతచ్ఛదాస్వాదనం
బునకై కాదు త్రిలోకరాజ్యవిభవంబుం బొందఁగాఁ గాదు శా
స్త్రనిరూఢప్రతిభావిశేష మగుపట్వున్గోరి కా దక్కటా!
విను సత్యంబుగఁ జూడ కేద్పెదను దంత్రీ! సూర్యనారాయణా!

మ॥ ధనమా రాదు, దురాశ పోదు, పరతత్త్వజ్ఞానమా లేదు, యౌ
వనమా నిత్యముఁ గాదు, వార్ధకమున న్వామాక్షియోఁ జేదు, జీ
వనమా యెన్నఁగఁ బాదు దుఃఖములకుం, బల్మాఱటు ల్గావున
న్నిను నేఁ గొల్తు నిఁకేల వాదు దయఁ గన్మీ సూర్యనారాయణా!

మ॥ సమత న్లోకుల కెల్ల భూతదయయు న్సత్యంబు బోధించుచు
శ్రమణ స్నీదగు కీర్తి రాల్గరఁగ గానప్రౌఢిచేఁ జాటుచు
స్సమదంబొప్పఁ, బరాంగనావిముఖత న్వర్తించుచు బ్రహ్మచ
ర్యము నే పల్పెద నాకుఁ దోడుపడు మన్నా! సూర్యనారాయణా!

శా॥ ఊహాపోహలు శాస్త్రశోధనములు న్యుక్తు ల్కృతుస్నానము
ల్పాహమ్మంచు వచించుట ల్వృథలు; సత్యంబుం దయ న్గల్గి యు
త్సాహం బొప్పఁగ భక్తితో భవదుదంచన్నామసంకీర్తనం
బాహా! సేయక మోక్ష మబ్బుటెటు లయ్యా! సూర్యనారాయణా!

మ॥ ధరణిం జీఁకటివేళ దవ్వువెలుఁగుం దర్శించు కందోయికి
న్మఱి యే వస్తువులైనఁ దోఁచనటు నిన్ ధ్యానించు నవ్వాని క
ద్దిర! యీ లోకవికారము ల్మది రవంతేనిం గనన్రావుగా
యరయంగాఁ దవ జీవితంబున మహాత్మా! సూర్యనారాయణా!

మ॥ అమర న్వంగరునుండి దావిదగు చాయ న్వేఱుపేయంగ శ
క్యముకానట్టుల విజ్ఞగం బెదవరాదయ్యారె। విన్నుండి: చ
క్రమునం గోణమురీతి నారయఁగ నీ త్రైలోక్య మేపారి నా
శము నీయందునఁ జెందుచుండుఁ బరమేశా! సూర్యనారాయణా!

శా॥ ద్వైతంబుండుట యుక్తి కాదు,మఱి యద్వైతంబు ప్రత్యక్షబా
వాతీతం బటుగానఁ గర్మములు సేయ న్మానరాదెంతయున్
ద్వైతాద్వైతసమంబు బ్రహ్మ మనుచున్ధర్మంబు నిర్మోహియై
ఖ్యాతి న్పల్పినవాఁడె యుత్తముఁ డనంబ!సూర్యనారాయణా!

శా॥ పాముం జావదు, కఱ్ఱయు న్విరుగ దన్నార్తాను సారంబుగా
సామర్థ్యంబున వస్తుశోధన యెడ న్శంకాసమాధానము
ల్నీమం బొందవు గాన జ్ఞానమునఁ దుష్టిం జెందరా దెందువ
న్స్వామీ!నీ పదభక్తి యోగమునఁ దప్ప న్సూర్యనారాయణా!

మ॥ అరయంగా సకల శ్రుతిస్మృతి పురాణాద్యర్థసారంబుఁ బ
ల్కిటు నా శక్తికొలఁదిఁ జూచి తుద కిమ్మై రూఢిఁ గైకొంటి సం
సరణాంభోధిఁ దరింపఁజేయుటకు యుష్మద్భక్తి దక్కన్య మీ
నరలోకంబున లే దుపాయ మని యన్నా!సూర్యనారాయణా।

# ౧౫. సత్యవ్రతి శతకము*

## 77. సత్యవ్రతి:

కం॥ బ్రతుకున సుంకం బెఱుఁగక
స్వతంత్ర రాజ్యంబు సేయు ప్రభువవలెఁ, బతి
వ్రతవలె, సహజకవి వలెన్
సతతము సంతస మెసంగు సత్యవ్రతికిన్.

కం॥ అతిజార విసుగుఁ బతికిన్
మతిహీనుఁడు దనము లొసఁగు నుతి తిరుపతికిన్
స్తుతి పొసఁగు జగత్పతికిన్
సతతము సంతస మెసంగు సత్యవ్రతికిన్.

కం॥ అతుల వికారము మీన మ
న్మతవాదికి శక్తిహీన నీచ కుమతికిన్
క్షితి సూనృతు నెడ పొగసది
సతతము సంతస మెసంగు సత్యవ్రతికిన్.

కం॥ బ్రతుకునఁ జదువులు సందెలు
చతురకళానిపుణతయును సర్వప్రజ్ఞల్
వితత సూనృత మాదవిచో
సతతము సంతస మెసంగు సత్యవ్రతికిన్.

[* ఈ శతకము ముద్రితమట. ఆనందగజపతి ప్రభువున కంకితము. నే దలబ్ధము. కొలది పద్యములు మాత్రము దొరకినవి. సం.]

# ౧౬. ముకుంద శతకము*

## 78. హృదయ నివేదనము

కం॥ పొందుగ నిన్నుం బాడుట
కుం దప్పు మఱెట్టి వృత్తిఁ గొల్పింపకు న
న్నుం దయతో నారాయణ!
కందళితానంద మూలకంద! ముకుందా!

కం॥ ముం దెట్టులనో! పసితన
మందే నీ భక్తి పొడమె బాగుగ నది వి
ల్పం దగురా నారాయణ!
కందళితానంద మూలకంద! ముకుందా!

కం॥ మందుల మారివి నీ దెస
డెంద మిటుల భ్రమముఁ జెందెడిన్ విడువక ప్రో
వందగురా నారాయణ!
కందళితానంద మూలకంద! ముకుందా!

కం॥ ఇందలి లౌకిక దంభము
లందున నా మనసునిల్ప కనవరతము నిన్
జెందింపుము నారాయణ!
కందళితానంద మూలకంద! ముకుందా!

[* ఈ శతకమునుండి కొలది పద్యములు మాత్రమే నే డుపలబ్ధములు. సం.]



# ౧౭. మృత్యుంజయ శివ శతకము

[దాసుగారికి జీవితమునను కళారంగ వ్యాసంగమునను నిత్యానపాయియైన సహచరునిగ నుండి ఆయనను కంటికి రెప్పవలె కాపాడుచు అవసరమగుచో కర్రపెత్తనము చేయుచు తన యావజ్జీవితము ఆయనతో హరికథలలో పాటకచ్చేరీలలో సహకారగానముచేయుచు పెద్దపెద్దపండితుల పేరోలగములలో పెథాషనిపించుకొన్న గాంధర్వధూర్వహుడు పేరన్నగారు - ఆయన కన్నగారు. వారి అనుబంధము జన్మాంతర సౌహార్దబంధురము. ఆ అన్నగారు మృత్యుముఖద్వారమున బడినప్పుడా ప్రక్కనే ఆర్ద్రనయనాలతోనున్న దాసుగారి ఉద్విగ్న హృదయమునుండి అలవోకగా అళువుగా బాహిరిల్లిన దీ శతకము. ఆయింతా పేరన్నగారు బ్రదికి బట్టగట్టిరి. తదుపరి పెక్కేండ్లు దాసుగారి నిర్యాణానంతరమును జీవించిరి.]

## 79. సహోదర సౌహార్దము :

కం॥ భోగములఁ గోర నొల్లము
భోగీశ్వరభూష ! బ్రతుకు పొడిగించినచో
నీ గానము సంతుష్టిగ
బాగుగ ప్రకటింప నాసపడితిమిర శివా !

కం॥ జోడుగ నీడగఁ దోడుగ
వేడుకతో శ్రుతుల మేళవించుచు నిన్నుం
బాడి కసి దీర్చుకొందుము
వేడెద మాజంటఁ బెంచు పెక్కేండ్లు శివా !

కం॥ ఆశ్రితులము నీ కీర్తన
కే శ్రమ ప్రాణంబు లనక యెల్లదెసలు రా
గాశ్రితములుగాఁ గవగా
మిశ్రలయలఁ బాడఁ జిరము మెలఁగించు శివా !

కం. నే బ్రతికిన సార్థక మే
మీ, బుజములు కాళ్లు కనులు మెద లేనట్లౌ
నా బ్రతుకు, జంట నలరం
గాఁ బ్రోచిన నిన్నుఁ బాడి కరగందు శివా !

# IV రూపక సారణి

## ౧౮. సారంగధర నాటకము

### 80. తెనుఁగుతీపి :

ఆ.వె. మొలక లేఁతదనము, దలిరుల నవకంబు,
మొగ్గ సోగదనము, పువ్వుతావి,
తేనె తీయదనము, తెనుఁగునకేకాని
పరుష సంస్కృతాఖ్య భాషకేది ?

### 81. బలవా నింద్రియగ్రామః :

గీ॥ ఒంటిపాటున సొగసరి కంటఁబడుట
పలుకరించుట కొక్క నెపము దొరకుట
కలుగునప్పుడు మోహంబు కనులఁ గ్రమ్మ
జ్ఞానులైన వివేకంబు గానలేరు.

గీ॥ ముత్తెపుంజిఱునవు మొలకలెత్తుచుండ
చీకటి, మెఱపు వాల్జూపు చిమ్ముచుండ
తులుకుగుబ్బల పయ్యెదకొంగుఁ జార్చి
బల్మివెట్టెడి జవరాలిఁ బాయఁదరమె ?

### 82. జగత్తు - భగవంతుడు :

మ॥ కలయందెత్తెడు మేనఁ దోఁచెడు జగత్కార్యంబులుం జిత్తసం
చలత న్వాస్తవమందు పోల్కిఁగనుఁడీ సర్వప్రపంచంబు న
జ్ఞులకు న్నిక్కముగాఁ గనంబడెడుఁ, బ్రాజ్ఞు ల్పూర్ణభావంబు ని
శ్చలధ్యానం దమకన్న వేఱు గన రీశత్వంబుఁ బ్రాపించుచున్.

గీ॥ శాశ్వత ప్రకృతిలోన బీజంబు జారఁ
బూర్ణతం బట్టి పిన్నగాఁ బోలుఁ బెద్ద;
పిన్నదీపంబు క్రోవియం దున్న గుణముఁ
గన్నయటు పిన్నలో బుద్ధిఘనతఁ జూపు.

గీ॥ తల్లి పైని వలపు తగిలెనేవియును స
త్యంబు దాఁగెనేవి; ధరణిలోనఁ
బాపకృతమున కనుభవములేదేవియు
దేవుఁ డుండెననుచుఁ దెలియుటెట్లు ?

## 33. చిత్రాంగి మేడ:

సీ॥ ఇరుదట్ల కీల్పొమ్మ లింపుగఁ బాడంగ
స్వర్గంబు నెక్కింపఁజాలు మెట్లు
అద్దంబువలె మేని నంతయుఁ గన్పర్చఁ
జాలిన నున్నని పాలగచ్చు
జీవకళలతోడఁ జెలఁగి నవరసముల్
చెలువారఁ జూపెడు చిత్తరువులు
మాటిమాటికి వింత మాటలాడుచుఁ బంజ
రములలరించు గోరలు చిలుకలు

కలుగు నీ మేడపైనుండి కాంచునపుడు
క్రింది జనములు చీమల చందముగను
తోఁటలుం బూరిబయళుల వాటముగను
గానఁబడుచుండెఁ దిరిగెడి కన్నుఁగవకు.

## 34. కులకాంత:

గీ॥ కులముం బౌరుషముం గల
తలిదండ్రుల కొదవి తగిన దాంపత్యమువన్

జేఁగు జవరాంత్ర చిత్తం
బులు చలియించునెడ లోకమున హద్దున్నే ?

గీ॥ అగ్నిసాక్షిగఁ బరిణయ మాడుకొన్న
ధవుని యెదలోనఁ దఱుగని తంపిపెట్టి
బంధువుల కెల్లరికిఁ దలవంపు చేసి
జారగా మనుటకన్నను జావుమేలు.

## 85. చంద్రుని మొగము :

గీ॥ తా నొనర్చిన చీఁకటితప్పెటిఁగియు
మగని విధిలేక కనిపెట్టు మగువఁ బోలె
వెలితిపడి ప్రొద్దుముంగల నిలిచెఁ జంద్రుఁ
డాకసంపుపెనమున మాడట్టుపలెను.

## 86. మేలిముసుగు :

గీ॥ సన్నమబ్బునఁ దోఁచెడు చందురువలె
ఆకు చాటుండిన గులాబి యలరు మాడ్కి
నీటఁ బ్రతిఫలియించు మానికమువోలె
చీరముసుఁగునఁ జిత్రాంగి చెల్వమీఱె.

## 87. దైవోపహతుఁడు :

గీ॥ ఆపదకు హేతువులు దోఁచియైనఁ దన్నుఁ
బ్రాణమిత్రులు వారించియైన వన్నుఁ
బోలి తప్పుత్రోవం బడిపోవుఁ గాని
యకట! దైవోపహతుఁ డెట్టు లాఁగఁగలఁడు!

## 88 ఋతాన్వృతమ్:

✓ గీ॥ నెనరు, దిట్టతనము, నోర్పు, నిర్మలతయు,
విశ్చలతయుఁ, దటస్థత, నియమితగతిఁ
జెందు దృష్టియు, సుస్మితమందవాక్కు-
సత్యవంతుని యాస్యలక్షణము లివ్వి.

గీ॥ దొంగతనము, సిగ్గు, వెంగలితనమును,
వగలసెగలు పొగలు, వలపుసొలపు
గొలుపు కన్నుఁగవయుఁ, గొంకెనవ్వుల మాట
కల్లబోతు ముఖము వెల్లడించు.

## 89. కళాఖళీహారిక:

సీ॥ చిలుకపాలపై జిలజిల బారు సెలయేటి
నీటిపై లకుముకి దాఁటు చూచి
నానాట నలవాఁటు బూని మెల్లనఁ జేర
వచ్చు జింకల కూర్మిపాటు చూచి
మడుఁగులఁ జెలలాడి బెదిదపు టొద్దులఁ
బొలయించు నేనుఁగుపోటు చూచి
దువ్వి ముద్దుగొనుచు దొడ్డ పులులతోడ
నాటాడు చెంచెత నీటు చూచి

వర్ణనము సేయుచున్ భూరివనములందుఁ
బలురకంబుల పిట్టల పలుకులకును
స్వరముగట్టుచుఁ జెట్టుల పట్టలందుఁ
బద్యములు వ్రాయు భాగ్యంబు పట్టు నెపుడు!



# ౧౯. దంభపుర ప్రహసనము*

## 90. వేసవి:

ఉ॥ కాలువ కంపులన్ బరగు గాడుపు, లెల్లదఁ దేళ్లుకుట్టి గ
గ్గోలగ నేర్పు నేడుపులు, కుక్కల వేటలు, దోమకాటులున్,
ప్రేలెడి సోదె బూచులును, రేగు విశూచులు, పొక్కు పుండ్లునున్
గాలెడి వింఢ్లు గల్గి నరకంబయి వేసవి వచ్చె నిచ్చటన్.

[* ఇది యొక పద్యరూపకమట. 1921 ప్రాంతమున రచింపబడినదట. ఇంద పాత్రము లానాటి కతిపయ విజయనగర పురప్రముఖులకు ప్రతీకములట. అచ్చయి దని వినికిడి. గ్రంథ మలబ్ధము ఎట్లో యీయొక్క పద్యము మాత్రము దొరికినది,సం.

⁂

# V ఆచ్ఛిక సారణి

## ౨౦. అచ్చ తెలుఁగు పల్కుబడి

### 91. తెలుఁగు తెలివి:

మంజరి ॥ తీయన మెత్తన తేటతెల్లంబు
నుడులలో నచ్చతెనుంగు నయంబు
అచ్చతెలుఁగువార లచ్చతెనుంగు
తెలియవియెడ వారి తెల్వి దొసంగు.

వేల్పుబాసాడివ వెలయునా మెప్పు
వేల్పులకే చెల్లు వేలుపు పల్కు
మానిసికిం దగు మానిసి కుల్కు
దయ్యపు పలనింత తగదు మానిసికి
మనుగడకున్ నాటు మాటలే చాలు
బ్రతికున్న తల్లి యిప్పటి నాటుబాస.

ఎల్లపల్కులఁ దెలుఁగే మేలుబంతి
ప్రజలలోనన్ దెల్గువాఁడే వలంతి
తెల్గునాడే నలుదెసల నాదెమ్ము
పాట లాటలు తెల్గువారల సొమ్ము.

తేటతీయని యచ్చతెనుఁ గనువాఁడు
వాసికెక్కిన చదువరి మొనగాఁడు.



# ౨౧. వేల్పు పంద

[ఇది సింహాచల స్వామిపై చెప్పఁబడిన శతకము. దాసుగారి స్వానుభవ మః కావ్యము. భక్తికి భండారము. లోకజ్ఞతకు కొటారము.]

## 92. రెంటత్రాగుఁడు తిండి మెట్టుంటువేల్పు !

సీ॥ సంజాదు కలనైన నమలకయుండుట
        పలుమాఱ్లు నీపేరు తలఁచుకొనుట
లాఁతియిల్లాండ్రపై లలిగొనకుండుట
        పొమ్ము నీదద్దదంబున కతుకుట
తనకొఱకై కల్ల లవఁబోవకుండు టె
        న్నాళ్లైన నీతిరునాళ్లఁ గనుట
యిర్గుపొర్గులకు పెద్బెర సల్పకుండుట
        నీకుగుర్జాల కావికల నిడుట

తనకుఁగల్గినదానితోఁ దవ్విగొనుట
నీకు విల్వుదోఁపిచ్చుట విక్కుపముగ
మంచినడువడిలేక నిన్గాంచుటెట్లు
రెంటత్రాగుఁడుతిండి మెట్టంటువేల్పు॥

సీ॥ మిన్నునేలలనెల్ల మెఱఁగు మైతాల్పులఁ
        గడుఁ గన్కరమ్ముతోఁ గపినఁగావి
తావిల్లి వేఁగియు న్దనతోడివారికి
        నెమ్మినాఁకొంట మానిచినఁగావి
పెంటల నగరుల స్వీడుల నెందేవి
        నీ గొప్ప చాటి వినిచినఁగావి
యేకోరికలులేక నీకుఁగోపెలతిర్వ
        శకతిరునాళ్ళఁ గొలిచినఁగావి

అకట మఱి యెట్టి మంచివాఁ డైనఁగాని
తప్పుకొనలేఁ డులియుఁగొయ్య ద్రిప్పురట్టు
పగడ నీ నమ్మకమున కే యగడులేదు
రెంటఁ ద్రాగుఁడు తిండి మెట్టంటువేల్పు!

సీ॥ సారులఁ, దరుకులఁ, గౌరులఁ, గోపుల
జెలఁగి గజ్జెఁగట్టి చిందు తీర్చి
వేడుకతో నొత్తుకాఁడు, గుమ్మెతకాఁడు
తోడరాఁగొంతెత్తి పాడియాడి
కుడికయిం జిప్ప మువ్వడుల మ్రోఁగించుచు
నెడమ కైకన్నవ న్నుఁడులఁ దెలిపి
మందుచల్లినయట్లు మంది వేలకొలంది
సోల నీ ముచ్చట ల్వేయు చెప్పి

నాల్గువందలయామద ల్పాలుపలనుల
నయిదుముమ్మాఱు రెట్టింప నయినయేండ్లు
హాయిగా నిన్ను గొల్చిన యతఁడె మేటి
రెంటఁ ద్రాగుఁడు తిండి మెట్టంటువేల్పు!

సీ॥ కుడియడ్డుపడ్డాడి, కుమ్మరింపు, పణము
చాఁగణ, చాళియ, చలికి, చేట
కన్నాత, కల్లము, కళవరము, తిణిగి,
గొంతుమా, ట్డాఁటడుగు, మొన, కిల్లి
తోరహత్తము, తొట్టి, తొక్కుస, పారము
రూణింపు, తాళము, రొండిద్రేటు
సీసము, సమసము, జేబ, కందణము, పె
ట్లాగు, లోబిత్తరి, లాఁగురింజ,

రాటము, సురాటము, న్పరిపోటు, కెల్లి
లోమొనతడకా, లెక్కొర్లి, లో లొంకఁదొట్టి

యంజమెట్టుఁ దొల్లి నీ యందగొంటి
రెంటద్రాగుఁడు తిండి మెట్లంటువేల్పు!

# ౨౨. వేల్పు మాట

[ఇది భగవద్గీతకు అనువాదము కాదు. మఱి - మానసపుత్రిక. దాసుగారికి దత్తపుత్రిక. దీని పీఠిక చివర దాసుగారి వ్రాయస మిట్లున్నది :- "ఇరువ దేడంకెలలో నెద్దియైన నొక యంకెను దలంచుకొని యీ వేల్పుమాట పొత్తములో నెద్దియైన నొక పెద తెఱచి మీఁదినుంచి క్రిందివఱకు లెక్కింపఁబడిన యిరువదేడు బంతులలోఁ దాఁ దలంచిన యంకెగల బంతి చదువుకొన్నప్పుడు తాననుకొన్న పని యేమగునో తప్పక తెలియఁగలదు" అని. వాసుదేవుడు తమ హృదయమునే గాక వాక్కును గూడా ఆవేశించి యున్నారని కాబోలు దాసుగారి విశ్వాసము. ఆ సంఖ్యా నిర్దేశము సాభిప్రాయముగ నున్నది. సం.]

## 93. కోరిక :

బది॥* తెల్లముగా నచ్చ తెలుఁగుతోఁ జెప్పు
మేల బల్మిన్ జేయు నెగ్గెఱింగియును
మానిపి? నాయరమఱ తీర్పు మప్పు!
అనఁ బిన్నసవ్వున ననె నల్లవేల్పు
కరముద్దె వెట్టి, తోఁకలి తలచుట్టు
మచునట్టు లడిగెదో యబ్బాయి! నీకుఁ
జెవి పట్టలేదు నా చెప్పినమాట
మఱువకు సరిగ నీమది నిల్పుకొనుము
కోరికె తప్ప నీకుఁ బగవాఁ డెవఁడు
నీరూపు కోరిక, నీకు నీ వెదిరి
అద్దము గను పిచ్చుకటు తమకమున

*చిత్రముగా దాసుగారిట్లు తమ విష్ణుసహస్రనామాది కృతులందును 'మంజరి' ని 'బది' యని స్వతంత్ర నామమున వ్యవహరించిరి.

నీ నీడతోడనే నీవు పోరెదవు
నను నమ్మలేదు తిన్నఁగ నీవు గనుక
మదిలోన నీ కరమర తీరకుండె
మఱి వేఱు చూడకుమా ననుందప్ప
నా రూపు మరియాద నడిపెడు నేర్పు
మరియాద నడుపు నీ మార్తుర నోర్పు
ఏకోర్కెయున్ లేక యెదిరి నడంచు
కోర్కె మానక సమకూరదు మేలు
పవివడి నీ పగవారల నోర్చు
కానకు నీ కోరని కోర్కె చేకూరు
జగమునకున్ మేలు సలిపెడు కోర్కెఁ
తెలఁగుట తగు మానిసికి మరియాద
మరియాద నడుపుము మఱిమాట లేల
నీ బ్రతు కిదేరు నీ కోర్కె దీరు
తనియు కోరిక మెయితాల్పు సాజంబు
కోర్కున్న దనుకఁజేకూరదు తనివి
కోరిక చేతనే కోరికన్ గొట్టు
వెరవున విసముచే విస మూడ్చువలయు
వినువాఁడ నీవు, చెప్పెడువాఁడ నేను
నీకును నాకు లేనేలేదు వాసి
తలఁపు తనంతఁ గదలుచు నిల్చుండు
కదలిక నీవు, నిల్కడ నేను మఱియు
నీ రూపు కల, నిదుర నా రూపు
పాటువడుము నన్నుఁ బ్రాపింతు నీవు ॥

# VI సంస్కృత సారణి

## ౨౩. శ్రీ హరికథామృతము

### 94. తత్త్వదర్శనము :

శా॥ "కాల స్సన్నిహితో మతి ర్విచలితా తన్త్వ౽౽గమస్సూచితో
దారాపత్యగతం మనాగపి మనో నాద్యాపి సంధుక్షతే।
యత్తత్త్వం కథితం త్వయా బత పరివ్రాదేకవేద్యం మునే
సూక్ష్మద్వార మనూనవ స్త్వివ మమ శ్రోత్రం న తద్గచ్ఛతి."

స్ర॥ స్యాద్రాజ్యం స్వర్గతుల్యం విరహిత సకల జ్ఞాతివైరం సుధర్మ్యం
కాన్తా సాధ్వీ ప్రశాన్తా నిరత నవవయోరూపరమ్యా లభేత ।
ఆరోగ్యం సుందరత్వం విపుల భుజబలం వేదశాస్త్రప్రథాః స్యుః
సర్వా ణ్యేతాని సౌఖ్యం నహి దదతి సదా భక్తివన్మాధవస్య ॥

భూలోకస్యైకార్థే వార్ధక్యమయం పరే స్వతారుణ్యం
దర్శయతి లోకబంధుః వ్యసనోదయయో స్సమానురాగేణ ॥

ప్రవృద్ధార్కేందు కిరణైః పరిపూర్ణం దిగన్తరమ్ ।
శోకానందాశ్రు సంపాతైః ప్రసూతాక్షితలం యథా ॥

విపన్నమేనం దృష్ట్వా మే క్షుభ్యతే హృదయం భృశమ్ ।
తస్యావస్థా మయా ప్రాప్తా దయా౽పి బత దుస్సహా ॥

సీ॥ సంవర్థ్యమాన తృష్ణా రుజాక్రాన్తవ
యసి గలితే౽తి మిథ్యా వివేక,
తన్కరేణాపహృత నిజ విశ్వాస వి
భవ ఇహ తాపక భక్తిహీతి,

మహహా సముద్దర్తు మప్యశక్తోభవన్
దుఃఖ్యన్ పరిభ్రమన్ దుస్తరభవ,
విపినేఽరిసత్త్వ విభీషణ ఈషణ
కంటకే విభ్రాన్తి కష్టమార్గ,

ఏవ తాపత్రయాభీల-దావ పావ
కావృతే మర్త్య ఉగ్ర మృత్యువ్వజగరేణ
కబలితో నశ్యతితరాం ప్ర-కంపమాప్య
హే జగన్నాథ సంశ్రిత-హృద్విబోధ ॥

స్వచ్ఛాయాం దర్పణే పశ్యన్ యుద్యతే చటకో యథా ।
మాయాయాం స్వం వీక్షమాణః తథామూఢో విముహ్యతి ॥

అవిద్యా నిద్రయా జన్తుః భవస్వప్నం ప్రపశ్యతి ।
జాగర్తి శ్రీపతేః నామశ్రవణేన న సంశయః ॥

హరిభక్తినౌకయైవ ప్రకటిత సంసారవారిధిం తరతి ।
ఇతరేణ కర్మణాఽఽజ్యేనేవ నరః ప్రజ్వలయతి భవవహ్నిమ్ ॥

లీలామానుషరూపే పరమాత్మని కేశవే వృథైవాభూత్ ।
జాంబవతః సామర్థ్యం జీవన్ముక్తే యథా భవోద్ధత్యమ్ ॥

దరితుం పాతయితుం సంచలయితు
మయతిష్ట బహువిధోపాయైః ।
కృష్ణం భల్లూకపతిః కింతు
ఆకాశ ఇవ హరి రభూదచలః ॥

స్థూలం సూక్ష్మం, ఋజుం వక్రం, స్నిగ్ధం బర్బర మైక్షత ।
విపరీతం వస్తుతత్త్వం కుచేలో రథ విభ్రమాత్ ॥

సగుణోఽపి నిర్గుణస్త్వం
సుశ్యామల విగ్రహోఽశరీరోపి ।
కార్యమపి కారణమభూః
కృష్ణ । త్వాం వేత్తి కః శివేన వినా ॥

# ౨౪. రామచంద్ర శతకమ్



## 95. భక్త హృదయము:

భుజంగప్రయాతమ్—"బలం రోదనం బాలకానా"మితి త్వం
విదన్ మాం సమాశ్వాసయా తీవ మూఢమ్।
విజానాసి మే తత్త్వచేతః త్వమేవ
ప్రసీద ప్రసీద ప్రభో రామచంద్ర ॥

సుఖేష్వాకృతః స్యాత్ ప్రయత్నః ప్రజానాం
త్వదీయానుకంపాం వినాఽనర్థకారీ।
భవాన్ యంత్రీ, అహం యంత్ర ఏవా స్వతంత్రః
ప్రసీద ప్రసీద ప్రభో రామచంద్ర॥

తరంగోఽస్తి వార్ధౌ, నవార్ధిస్తరంగే
తథా విశ్వమస్తి త్వయి, త్వం న విశ్వే।
త్వమేవ ప్రమాణప్రమేయ స్వరూపః
కథం విద్మహే త్వాం ప్రభో రామచంద్ర ॥

మహీజాధరోష్ఠ ప్రవాలేఽలి కల్పా
పురద్విట్ ధనుః కాననేఽగ్నిచ్ఛటాభా।
నకృత్యౌ-శికాంఘ్రిస్థితాఽంభోజతుల్యా
చకాస్తే స్మ తే దృక్ ప్రభో రామచంద్ర ॥

నభః ఖండశో ముద్గరేణేవ భేత్తుం
పదార్థస్థితిం తర్కతో వేత్తుమీహే।
అలం తత్త్వ జిజ్ఞాసయా శూన్యదృష్ట్యా
భవద్భక్తిరేవాస్తు మే రామచంద్ర ॥

'బహూస్యా'మితి ప్రేక్షణేనైవ విశ్వం
వినిర్మాయ మాయామయం త్వయ్యనన్తమ్ ।
సదా క్రీడసే నిర్గుణోఽపి స్వభావాత్
అచింత్య ప్రభావ ప్రభో రామచంద్ర ॥

మహూర్వేదశాస్త్ర ప్రభేదా నశేషాన్
మదీయానుభూతిం సమంతాద్విచార్య ।
దృఢం నిశ్చినోమి ప్రమాణం ప్రమేయం
ప్రమాతా త్వ మేవేత్యహం నిశ్చినోమి ॥

తులాయాం సమం దర్దురాం స్తోలయేచ్చేత్
సమన్వేతు కామః శ్రుతీర్బ్రహ్మణి స్యాత్
కథం వేదితవ్యః స యః సర్వవేత్తాఽ
ప్యలం వ్యర్థజిజ్ఞాసయా రామచంద్ర ॥

దశాస్యో దరా ప్రాణయుక్తః శరీరీ
విదేహాత్మజారూప విద్యాఽపహారీ ।
భ్రమాబ్ధిం సముల్లంఘ్య బ్రహ్మవ్రత స్తం
విజిత్యాప తాం త్వం పునా రామచంద్ర ॥

మమ స్వప్నదృష్టాంతతో వ్యాసమానే
ర్మతం సత్యమద్వైత మేవేతి మన్యే ।
తథాపి త్వదీయాంఘ్రిభక్తి రుచిర్మే
యథా జానకీ తే ప్రభో రామచంద్ర ॥

అహం శీకర స్త్వం సముద్రః కరోఽహం
త్వమర్కోఽస్య హంరేణు రద్రీశ్వర స్త్వమ్ ।
అహం నశ్వర శ్శాశ్వత స్త్వం మృషాఽహం
యథార్థ స్త్వమేవ ప్రభో రామచంద్ర ॥

యతో జాయతే యత్ర తో లీయతే తత్
యథా మానస వ్యోమతః స్వప్న విశ్వమ్
మృషైత జ్జగద్భ్రా న్తిజన్యం సమస్తం
భవానేవ సత్యం ప్రభో రామచంద్ర ॥

నభో నైల్యవత్ రూప్యవచ్ఛుక్తి కాయాం
త్వయీదం జగత్సర్వ మధ్యస్తమేవ ।
అసంగో భవాన్ సచ్చిదానందమూర్తిః
త్వయా పాలనీయా వయం రామచంద్ర ॥

యథాఽంధాః గజం జజ్ఞిరే శాస్త్రిణ స్త్వాం
తథైవా విదన్ పౌరుషేయ ప్రమాణైః ।
అవాఙ్మానసం సత్య మాత్రైకవేద్యం
భవద్దివ్య తత్త్వం ప్రభో రామచంద్ర ॥

## ౨౫. కాశీ శతకమ్

## 96. కాశీపురి :

శ్రోణీభరాలసా ఘట్ట సోపానాన్యవరోహతి ।
గంగామపి పునాతీవ స్నాతి కాఽపి పతివ్రతా ॥

మద్రూపేణైవ గంగాయాం త్వత్కృతం స్నాన ముద్వహేత్ ।
తారయేత్ త్వాం భవాబ్ధే ర్నా వద న్తీవేతి రాజతే ॥

శ్యామలత్వం శీతలత్వం సాధుత్వం నామ విందతి ।
కృష్ణాత్ చంద్రధరాత్ జహ్నోః క్రమాద్గంగా భగీరథాత్ ॥

కాశ్యాం దేశీయభాషాయాం సర్వదా భోజ్యవస్తుషు ।
మర్త్యవేషేషు సంగీతే సర్వత్ర మధురోరసః ॥

సౌధస్యాగ్రేఽరుంధతీవ మధ్యే సౌదామనీ యథా ।
అధస్తాత్ పాంచాలికేవ కాశ్యాం భాతి కులాంగనా ॥

నౌకాస్థిత జనోత్సృష్ట దీపికాఽఽలి ర్విరాజతే ।
గంగాయాం తారకారాజిం హసన్తీవాంబరాశ్రితామ్ ॥

బహువేషైః బహుమతైః బహుభాషాభిరన్వితా ।
వారాణసీ కీర్తయతి విశ్వేశం విశ్వరూపిణమ్ ॥

త్రిగుణైరేవ సంసారచక్రం భ్రమతి తత్త్వతః ।
బ్రువన్నితీవానడుద్భి శ్శకటో గచ్ఛతి త్రిభిః ॥

విశ్వేశ్వరాభిషేకాయ సతి భాగీరథీజలే ।
కాశ్యాం కోమాం వాంఛతీతి నారికేలో నజాయతే ॥

భుంక్తే యథేష్టం బలవాన్ భోగాన్ రుదతి దుర్బలే ।
శత్రూన్ జిత్వా వశామేత్య బలీవర్దః ప్రగల్భతే ॥

యేనకేనాప్యుపాయేన బహ్వన్నం ప్రాప్నుయాదితి ।
పునస్సమ్ముషితం వస్త్రం దదాత్యన్నాయ వానరః ॥

సూత్రేణోత్క్షిప్తమాకాశే వీక్ష్య శ్యేనః పతంగకమ్ ।
ప్రహర్తుం తం ప్రయతతే సహతే కః పరోన్నతిమ్ ॥

ఆరోగ్య ప్రతికూలాఽపి కాశీ సంసేవ్యతే సదా ।
ముముక్షుణా, ఽతిదుష్టాఽపి భర్త్రేవోత్తమ భార్యయా ॥

యమునా ప్రముఖా నద్యో గంగాయాం సంప్రవేశనాత్ ।
తస్యా నామ్నై వాప్నువంతే పత్యుర్గోత్రం యథా స్త్రియః ॥

వినీలకాచవలయ రాశివాభాతి జాహ్నవీ ।
శశోః కనీనికేవాపి శిశిరర్తౌ వినిర్మలా ॥

మాదృశః పాతకః త్వాదృక్పావనీ నైవ విద్యతే ।
దిష్ట్యాఽఽవయో స్సమావేశో గంగేఽద్య సమభూదహో ॥

## తారకమ్

## 97. ఈశ్వరతత్త్వము :

భేదో యథా కాండ తరంగయో ర్న
స్యాత్తేఽస్య లోకస్య తథైవ దేవ
సర్వః ప్రపంచః త్వయి కల్పితో వా
స్థాణౌ భవే ద్దస్యురివ భ్రమేణ ॥

దృశ్యాప్యదృశ్యా సదసత్స్వరూపా
త్వదీయ మాయా భ్రమకారణం సా
దిగంత రేఖావ దతీంద్రియంతే
త త్త్వం జగన్నాటక సూత్రధార !

భ క్త్యైవ తేఽధీశ్వర దేవతాఽపి
శక్నోతి వేత్తుం పరమార్థ త త్త్వం
దృష్టి స్వరూపం ముకురశ్రియైవ
విలోకితుం శక్యత ఆదిదేవ !

ఏకత్వసంఖ్యా ప్రతిపాదకోఽంకః
నిరంతరం బోధయతే బహుత్వం
బిందువ్యన్వితః సుష్ఠు యథా స్వభావ
యుతః త్వ మేకోపి తథాఽసి దేవ॥

## 98. ఆదర్శ పురజనులు :

చంద్రికా ధవళచ్ఛాయా స్తత్రత్యా రేజిరే జనాః
అన్యోన్య మైత్రీం కుర్వంతః సంజానంతో యథాయథమ్
విద్యయా సమయాకృత్య ప్రియాకృత్య ముహుర్గురూన్
.... .... ....
ఏకతానాః సాంయుగీనాః వాగ్మినో హృదయాలవః
క్షేమంకరా మహోత్సాహాః ఓరస్వంతో యశస్వినః
సమానపంక్తి భోక్తారః సమవర్ణవిభూషితాః
సామాన్య భాషా వక్తారః సమానాచార వర్తినః
వయః పరిణయం స్త్రీణాం విద్యాభ్యాసం స్వతంత్రతామ్
ప్రాపయంతః .... .... ....
సామాజికా ఆస్తికా స్సత్కులీనా ధార్మికా బుధాః
శాకాహారా వావదూకాః కృతినః పురుషోత్తమాః
తత్రత్యకా బభూవ స్త్రీ వీరమాతా సులక్షణా
గృహకార్యపరా ప్రాజ్ఞీ బుధమాన్యా పతివ్రతా
వీథీ ర్విశాలా అమలా జలయంత్ర పరిష్కృతాః॥

## 99. సుకవి :

న దేవతాధీన మనః ప్రవృత్తిః
స్వాతంత్ర్య సంకల్పిత చారుకావ్యః
దయార్ద్ర చిత్తోఽంచిత సత్యవాక్యః
కలాచణః సత్కవిరేవ నాఽన్యః ॥

నవరుచివేదీ సర్వభూతానువాదీ
లలిత చరణధారీ సాధ్వలంకారహారీ
పరవశ సుఖయోగ శ్చిత్రసంకల్పభోగః
కవిః .... .... ....

# VII అనువాద సారణి

## ౨౭. నవరస తరంగిణి

### 100. షేక్స్పియరు సొగసులు:

[గీర్వాణాంధ్రములలో అనువాదము]

మూలము :

A. To guild refind gold, to paint the lily
To throw a perfume on the violet
To smooth the ice, or add another hue
unto the rain bow, or with taper-light
To seek the beauteous eye of heaven to garnish
Is wasteful and ridiculous excess :

[King John—Act IV. Sc. ii]

౧. అను : శ్లో॥ స్వర్ణే హేమవిలేపనం, సమధికే రక్తోత్పలే రంజనం,
చాంపేయప్రసవే సుగంధకలనం, హైమోపలే స్నేహనమ్,
దేవేంద్రస్య శరాసనే సముదితే వర్ణాంతరప్రాపణం,
దీపే నార్క-రుచిప్రదీపన మతివ్యర్థ మ్రుపహాసాస్పదమ్

౨. ద్వి॥ బంగరుపూఁత మే-ల్బంగారమునకుఁ,
తెంగలువకు రంగు-సేఁత, నెత్తావి
సురపున్న కెరవుతె-చ్చుట, మంచుగడ్డ
మఱి నున్పుసేయుట,-మరియొక రంగు
నగవైరి వింట నొ-నర్చుట, పట్ట
పగలు వెలింగెడు-భానుని కాంతి
హెచ్చింపఁ జేవత్తి-నెత్తిపట్టుటయు
నచ్చపు నగుఁబాటు-నధికము వృథయు.

B. He was a man, take him for all in all
I shall not look upon his like again.

(Hamlet-Act I. Sc. ii)

౧. శ్లో॥ సోఽహమాత్వమా న్సర్వదైవ
సంపూర్ణ సుగుణాకరః
నాహం కదాపి వీక్షిష్యే
తస్య ప్రతివిధిం పునః ॥

౨. ద్వి॥ పురుషుఁ డాతండు సం-పూర్ణగుణుండు
నరయఁ బోవ నీఁక నే-నతనికి సాటి,

C. O, She doth teach the torches to burn bright!
It seems she hangs upon the cheek of night
Like a rich jewel in an Ethiop's ear
Beauty too rich for use, for earth too dear!
So, shows a snowy dove trooping with crow
As yonder lady O'ur her fellows shows.
(Romeo and Juliet—Act I. Sc. ii)

౧. శ్లో॥ అత్యంతంప్రజ్వలితు మబలా శిక్షతేఽహో ప్రదీపాన్
రాత్రౌ కాశిశ్రవణ విచలద్రత్నభూషేవ భాతి
సౌందర్యంచానుభవితు మతిశ్రేష్ఠ మూర్వ్యా అమూల్యం
వాయసౌఘే చరతి వరటావ త్సఖీమండలే సా.

౨. గీ॥ చిఱుకలకొలికి దివిటీల-వెలుఁగనేర్పుఁ
గలిగి వజ్రంబు పగిదిఁ జీ-కటిని మెఱయు
నందమంద నత్యధికంబు-నవని కరుదు
కాకులం దంచ యది తోడి-గరితలందు.

D. Cowards die many times before their deaths;
The valiant never taste of death but once.
[Julius Caesar—Act I, Sc. ii]

ఆ. వె. ఎన్నఁ బిఱికివార లెన్నియోమాఱులు
చచ్చుచుంద్రు తాము చావక మును
పెన్నదైన ధైర్యమున్న జనులు చావు
చవి యెఱుంగ రొక్క-సారి తప్ప.

E. Friendship is constant in all other things
Save in the office and affairs of Love;

Therefore, all hearts in Love use their own tongues;
Let every eye negotiate for itself,
And trust no agent; for beauty is a witch;
Against whose charms faith melteth into blood.
[Much Ado About Nothing—Act II, Sc. i)

చ. వలపునఁ దప్ప మైత్రి పెరవస్తువుల నన్నిట నుండు నిల్కడన్
వలచిన యెల్ల డెందములు వాడుట మేల్ దమ నోళ్లఁ గావునన్
దెలుపుతఁ దన్నుఁగూర్చి ప్రతిదృష్టి తనంతట నమ్మ కన్యునిన్
చెలువొక మంత్రకాఁ డతని బూమెల నెమ్మి కరఁగు మర్లుగాన్.

F. That ever death should let life bear his name
Where life hath no more interest but to breathe ?
[Titus Andronicus—Act III, Sc. i]

ద్వి॥ ఊపిరి తీయుటే యొక పని యైన
చాపురే చావేల బ్రతు కనరాదు ?

G. His words are bonds, his oaths are oracles;
His love sincere, his thoughts immaculate;
His tears pure messengers sent from his heart;
His heart as far from fraud as heaven from earth.
[Two Gentlemen of Verona—Act II, Sc. vii]

ఉ॥ ఆతని నుళ్లొడంబడిక, లాతని యొట్టులు దేవవాక్కులౌ,
నాతని ప్రేమ నిష్కపట, మాతని యూహ లకల్మషంబులౌ,
నాతని మానస ప్రచలితామల దూతలు వాని యశ్రులౌ,
నాతని యాత్మ వంచనకు నౌ దవు స్వర్గము భూమికింబలెన్.

H. My crown is in my heart, not on my head;
Not decked with diamonds and Indian stones;
Nor to be seen : my crown is called content;
A crown it is, that seldom kings enjoy.
[Henry VI—Part II Act III, Sc. i]

గీ॥ నా కిరీటము నాదు డెందమున నుండు
నా తలన్గాదు, వివిధరత్నములఁ జెక్కఁ

బరఁగలే, దద్దియున్ గానఁబరఁగఁబోదు
తవిలి నా మౌళి-దొర లది కనుట యరుదు.

I. If thou remember'st not the slightest folly
That ever love did make thee run into,
Thou hast not loved :
Or if thou hast not sat, as I do now,
Weaning thy hearer in thy mistress' praise,
Thou hast not loved :
Or if thou hast not broke from company
Abrupthy, as my passion now makes me,
Thou hast not loved.
[As You Like It—Act II, Sc. iv]

సీ॥ ఉరువడి ననవిల్తుఁ డుసికొల్పఁగా నీవు
నెఱపిన యేపాటి నేరమైన
మఱచిపోయితివేని మఱి నీవు వలచియుం
డఁగలేదు; నీ విప్డు నా తెఱఁగునఁ
గూర్చుండి నీ చెలిన్ గూరిచి పొగడుచు
వినువారలకు నెల్ల విసుకు కలుగ
నలుపనిచో నీవు వలచియుండఁగ లేదు
కొంచెమైనం బరికించి చూడ;

చెలఁగి నా మరు లిపుడు నన్ జేసినట్లు
కతము చెప్పక నీ చెలికాండ్రనుండి
యూపు దబ్బున విడఁబడి యేగవేని
వెండియున్ నీవును వలచియుండలేదు.

J. I would have broke mine eye-strings, cracked them, but
To look upon him, till the diminuition
Of space had pointed him sharp as my needle;
Nay, followed him, till he had melted from
The smallness of a gnat to air; and then
Have turned mine eye, and wept.
[Cymbaline—Act. I, Sc. iii]

గీ॥ దూరమున సూది మొనయంత తోఁచువఱకు,
నణువుకంటెనుఁ దగ్గి మాయ మగుదనుక,
నరములు తెగునంతకునుఁ గన్గవను విప్పి
వానిఁ గనుఁగొని పిదప నే వగచియుందు.

K. When most I wink, then do mine eyes best see,
For all the day they view things unrespected;
But when I sleep, in dreams they look on thee.
[Sonnets]

కం॥ కనుఱెప్ప మూసినప్పుడె
కనెదున్ నా కన్నుదోయి కర, మేమనఁ ప్రొ
ద్దునఁ గాంచువాని నరకు
న్గాన దది, నినుఁజూచు-నేను గూర్కెడుఁ గలలోన్.

L. The iron tongue of midnight hath told twelve;
Lovers, to bed : 't is almost fairy time.
[Midsummer-night Dream—Act V, Sc. i]

కం. నడిరేయి యినుప నాలుక
నుడివెం బన్నెండు-వలపు నూల్కొను మీరల్
పడుకొండు పెజ్జలం ది
ప్పుడుఁ గడు గంధర్వవేళ పొనరుచునుండెన్.

M. Love is a smoke made with the fume of sighs;
Being purged, a fire sparkling in lovers' eyes;
Being vexed, a sea nourished with lovers' tears:
What is it else ? a madness most discreet,
A choking gall, and a preserving sweet.
[Romeo And Juliet—Act I, Sc. i]

గీ॥ వల పసఁగ వెచ్చనూర్పులఁ గలిగిన పొగ,
కాముకుల కన్నులందునఁ గ్రాలు నగ్గి,
నాయికాకాయకాశ్రులన్ బ్రబలు కడలి,
వెఱ్ఱియున్, జంపఁ బెంపఁగ విష మమృతము.

N. That man that hath a tongue, I say, is no man,
If with his tongue he cannot win a woman.
[Two Gentlemen of Verona—Act III, Sc. i]

ద్వి॥ మాటాడువాఁ డెల్ల మగవాఁడుకాఁడు
మాటలచేతఁ జామల గెల్వకున్న.

O. What seest thou in the ground ? hold up thy head :
Look in my eyeballs, there thy beauty lies
Then why not lips on lips, since eyes in eyes ?
[Venus and Adonis.]

గీ॥ ఎందు కటు క్రిందుఁ జూచెద వెత్తు సిరము
చూడు నా కంటిపాప లచ్చోటను నీదు
సొగసు నెలకొనుఁ-జూపులఁ జూపు లెనయ
నేల పెదవులు పెదవుల నెనయరాదు ?

P. Men are April when they woo, December when they wed;
maids are May when they are maids,
but the sky changes when they are Wives.
[As You Like It—Act IV, Sc. i]

వ॥ మగవాండ్రు తముఁ బెండ్లాదని కన్నియల
బతిమాలుకొను నప్పుడు చైత్రమాసమువంటివారు-
కాపి పెండ్లియైన పిదప శూన్యమాసమువలె నుందురు;
కన్నియలు తమ కన్యాత్వమందు వైశాఖముం బోలెదరు
కాని వా రిల్లాండ్రైన పిమ్మట నా కాలము మాఱును.

Q. But virtue, as it never will be moved
Though lewdness court it in a shape of heaven,
So lust, though to a radiant angel linked,
Will sate itself in a celestial bed
And prey on garbage.
[Hamlet—Act I, Sc. V]

గీ॥ అలమి పోకిరితనము స్వర్గాకృతిఁ గొని
కోరినఁ జలింపఁబడదు సుగుణ మొకప్డు

దివ్యమూర్తిని గలిపియున్ దృప్తిపరక
గుహ్యచాపల్య మెంగిలి కూళ్ల గుడుచు.

R. Base men being in love have then a nobility
in their natures more than is native to them.
[Othello—Act II, Sc. i]

వ॥ నీచులు వలపున నుంటచేఁ దమకు విక్రముగ
నున్నదానికంటెఁ బెచ్చుగ నొక గొప్పదనముం
దమ స్వభావములం దగిలియుందురు

S. She either gives a stomach and no food-
Such are the poor, in health; or else a feast,
And takes away the stomach, such are the rich
That have abundance, and enjoy it not.
[Henry IV-Part II : Act IV, Sc. iv]

గీ॥ ఆఁక లెంతో గొలిపి దైవ మన్న మిడదు
వెలయు నారోగ్యమునఁ గడుఁ బేదవాఁడు
కదిసి బువ్వ నొసంగి యంగదఁ జెఱిచెడుఁ
గుడువఁ జాలఁడు భాగ్యవంతుఁడు కలిగియు.

T. When beggars die there are no comets seen;
The heavens themselves blaze forth
the death of princes.
[Julius Caesar—Act II, Sc. ii]

కం. కనుపడవు తోఁకచుక్కలు
మిను చక్కన్ బిచ్చగాండ్రు మృతులైన యెడన్
పడివడి రాజుల చావున్
జనములకుఁ దనంత బయలు చాటుచునుండున్.

U. Suspicion always haunts the guilty mind :
The thief doth fear each bush an officer.
[Henry VI—Part III : Act V, Sc. vi]

ద్వి॥ దురితంబుగల మదిన్ దొడరు సందియము
బరి యెల్ల పొద రాజభటువిగ వెలయు॥

V. For what is wedlock forced but a hell,
An age of discord and continual strife ?
Whereas that the contrary bringeth bliss,
And is a pattern of celestial peace.
[Henry VI—Part I : Act V, Sc. V]

గీ॥ బలిమి నొనరింపఁబడిన పెండిలి నరకము
కలఁత బ్రతుకును, మఱియు విచ్చలు జగడము
వలపు: ఇష్టానుసారము జరిగిన నది
సంతసము, దివ్యశాంతిని సంతరించు.

W. 'T is beauty that doth off make women proud;
'T is virtue that doth make them most admired;
'T is government that makes them seem divine.
[Henry VI—Part III : Act I, Sc. iv]

గీ॥ స్త్రీలఁ దఱుమగ గర్వింపఁజేసెడు నది
సొగసు: వారల మిక్కిలి పొగడఁబడఁగ
సలుపునది సద్గుణంబు: వేల్పులుగ వారిఁ
దెలియఁబడఁజేయునది జితేంద్రియత యగును.

X. The lunatic, the lover and the poet,
Are of imagination all compact :
One sees more devils than vast hell can hold;
That is the mad man : the lover, all as frantic,
Sees Helen's beauty in a brow of Egypt;
The poet's eye, in a fine frenzy rolling
Doth glance from heaven to earth,
from earth to heaven;
And, as imagination bodies forth
The forms of things unknown, the poet's pen
Turns them to shapes, and gives to airy nothing
A local habitation and a name.
[Midsummer Night's Dream—Act V, Sc. i]

మ. వెరఁగున్ గాముకుఁడున్ గవీంద్రుఁడు మనోవిభ్రాంతిమూర్తుల్ గదా
వెరఁగెందున్ గనరాని దయ్యములఁ గన్పెట్టున్: గురూపిన్ దగు

ల్వాడి రంభన్ విరసించుఁ గాముకుఁ; డహో స్వర్గంబునందుండి యి
క్కడి కిందుండి కవీంద్రు దృష్టి దివికిన్ గాంచున్, యథేచ్ఛమ్ము నా
తఁడు చింతించు నవీనవస్తువుల కంతన్ వాని గంటమ్ము పే
ర్లిడి యాకారము లిక్కప ట్లొసఁగు నెం దేమైన లేకుండనీ ॥

Y. **Virtue itself turns vice, being misapplied,**
**And vice sometimes by action dignified.**
**[Romeo and Juliet—Act II, Sc. iii]**

గీ॥ గుణమె దోషంబుగా మాఱుఁ గొన్నిచోట్ల
కర మపప్రయుక్తం బగు కారణమున
విరచనా కౌశలంబున మఱియు నొక్క
కాలమందున దోషమే గణుతికెక్కు.

Z. **Your greatest want is, you want much of meat;**
**Why should you want ? Behold, the earth hath roots;**
**Within this mile break forth a hundred springs;**
**The oaks bear mast, the briers scarlet hips;**
**The bounteous housewife, Nature, on each bush**
**Lays her full mess before you. Want ! why want ?**
**[Timon of Athens—Act IV, Sc. iii]**

క॥ మీకున్న గొప్పకోరిక
యాఁకలికిన్ దగినయంత యాహారముగా
మీ కెందు కీ కొఱఁత-యా
లోకింపుఁడు కలవు భూమిలోపల దుంపల్.

ఉ॥ ఇంచుక దవ్వులోన సెలయేఱు లనేకము లుబ్బి పాఱెడున్
మంచి ఫలంబులం గలిగి మ్రాఁకులు పెక్కు రకంబు లొప్పుఁ-దా
నెంచిన తేనెఁదిండిఁ బొదరిండ్ల నమర్చెతుఁ బెట్టువోఁతలన్
మించిన యాలుగాఁ బ్రకృతి-మీకుఁ గొఱంత యిఁకెందు కుండెడున్;

## 101. కాళిదాసు సొగసులు :

[అచ్చ తెనిగింపులు]

మూలము :

౧. వేదాంతేషు యమాహు రేకపురుషం వ్యాప్య స్థితం రోదసీ
యస్మిన్నీశ్వర ఇత్యనన్యవిషయ శ్శబ్దో యథార్థాక్షరః
అంతర్యశ్చ ముముక్షుభి ర్నియమిత ప్రాణాదిభి ర్మృగ్యతే
స స్థాణుః స్థిరభక్తియోగ సులభో నిశ్శ్రేయసాయాస్తువః ॥

—విక్రమోర్వశీయము (నాందీశ్లోకము)

అనువాదము :

తరువోజ॥ పలికెద రెవ్వనిఁ బ్రాఁజదువుల కొనల
మిన్ను మన్ను నిండనగు నొక్కఁడిగఁ,
గలుగ కొందునకు నిక్కముగ నెవ్వాని
యెదఁ జెల్లుచుండెడు నేలిక బిరుదు,
నెడఁద నుసులు బిగియించి ముక్తికయి
కడఁగు వారల వెదుకంబడు నెవఁడు,
కలిగింతు బత్తిజోగమునకు సుళువు
గాఁ జిక్కునట్టి ముక్కంటి మేల్మికు.

౨. హృదయ మిషుభిః కామస్యాంత స్సశల్య మిదం తతః ।
కథముపలభే నిద్రాం స్వప్నే సమాగమకారిణీమ్ ।
నచ సువదనా మాలేఖ్యేఽపి ప్రియాం సమవాప్యతాం ।
మమ నయనయో రుద్బాష్పత్వం సఖే న భవిష్యతి.

—విక్రమోర్వశీయము

చ॥ మది ననవిల్తుతూపులను మాటికి గాయము లందుచుండఁగా
నిదురెటుపోవఁగాఁ గలను నెచ్చెలినిం గలనైనఁ బొందఁజా
లదు నను, బోని చిత్తరువు లోనయిన న్వరివ్రాసి చూతఁగ
ల్గదువన నీరు నాకనులలో నెటు నిండకమాను సంగడీ ॥

పాతుం నప్రథమం వ్యవస్యతి జలం యుష్మాస్వపీతేషు యా
నాదత్తే ప్రియమండనాయ భవతాం స్నేహేన యా పల్లవమ్
ఆద్యే వః కుసుమప్రసూతి సమయే యస్యా భవత్యుత్సవః
సేయం యాతి శకుంతలా పతిగృహం సర్వై రనుజ్ఞాయతామ్.

అభిజ్ఞాన శాకుంతలము

ఉ॥ ఎవ్వతె ముందు మిమ్ముఁ దనియింపక త్రాగదు నీరుఁ, దాల్చఁ బో
దెవ్వతె మీపయిం జెలిమి నింపయినం జివురాకుసొమ్ము, మీ
పువ్వు సమర్త యెవ్వతెకుఁ బొల్పగు పండువుచెల్వ నించు నా
జవ్వని యీ శకుంతల యెసంగు నొసంగుడి యాన నెల్లరున్.

౪. ఉగ్గలిఅ దబ్భకబలా మిఆ పరిచ్చత్త ణచ్చణా మోరా।
ఓసరి అపణ్డుపత్తా ముఅంతి అస్సూవిఅ లదాఓ॥

అభిజ్ఞాన శాకుంతలము

గీ॥ నోళ్ళ తెల్లుజార్చి లేళ్ళు, నాటల నాడ
కుండి నెమలిగములు, పండుటాకు
లెల్ల రాల్చుకొనుచు నెల్లెడఁ దీఁగెలున్
గంటినీరు గార్చు కరణినయ్యె.

౫. అథ మధువనితానాం నేత్ర నిర్వేశనీయం
మనసిజ తరుపుష్పం రాగబంధ ప్రవాలమ్।
అకృతకవిధి సర్వాంగీణ మాకల్పజాతం
విలసిత పదమాద్యం యౌవనం స ప్రపేదే॥

—రఘువంశము 18-52

గీ॥ అంతఁ జెలువల కన్నవ లానుకల్లు
చిగురు విల్తుఁడన్ ప్రాకుపూ తగులు తలిరు
తొడ వొడలికెల్లఁ దనకుఁదాఁ దోఁచు గరవ
పూయుళు తొలి ఘంకి జవ్వన మొందె వతఁడు.

౬. అనాఘ్రాతం పుష్పం కిసలయ మలూనం కరరుహై
రనావిద్ధం రత్నమ్మధు నవ మనాస్వాదిత రసమ్
అఖండం పుణ్యానాం ఫలమివ చ తద్రూప మనఘం
నజానే భోక్తారం కమిహ సముపస్థాస్యతి విధిః ॥

—అభిజ్ఞాన శాకుంతలము

ఉ॥ క్రోలని క్రొత్తతేనె, మొనఁ గ్రుచ్చని మానికె, గోరునాటులన్
దాలచనట్టి లేఁజివురు, తావిగొనంబడనట్టి పూవునుం
బోలిన దాని సోయగము ముందిటి నోముల మేటిపంటగా
బోలును దాని నేలుటకుఁ బుట్టినఁ యాతని దెంత పున్నెమో ॥

౭॥ గ్రీవాభఙ్గాభిరామం ముహురనుపతతి స్యందనే బద్ధ దృష్టిః
పశ్చార్ధేన ప్రవిష్టశ్శరపతనభియా భూయసా పూర్వకాయమ్
దర్భై రర్ధావలీఢైః శ్రమ వివృతముఖ భ్రంశిభిః కీర్ణ వర్త్మా
పశ్యోదగ్ర ప్లుతత్వా ద్వియతి బహుతరం స్తోకముర్వ్యాం ప్రయాతి ॥

—అభిజ్ఞాన శాకుంతలము

ఉ॥ వెంబడుతేరి వంకమెడవెట్టి పొరింబొరిఁజూచు, నమ్ము పై
నిం బడు నంచు వెన్దలకు నివ్వెర ముందటి మేను కుంచుఁ, బొం
తం బఱుపు న్మృగంబు తిను దర్భము దయ్యుచు నోరువిప్పి, యే
గుం బరికించుమా దిగువఁ గొద్దిగ మెండుగ మింటదాటులన్.

౮. మందః కవియశః ప్రార్థీ గమిష్యా మ్యుపహాస్యతామ్
ప్రాంశు లభ్యే ఫలే లోభా దుద్బాహురివ వామనః ॥

—రఘువంశము 1-3

కం॥ వెదగున్ గయిపెంపు న్నేఁ
బడయంగాఁ గోరి నవ్వఁబడియెద నాపన్
బొడవగు నతనికిఁ బొందం
బడు పండునకుఁ గయి చాచు మఱుగుజ్జువలెన్.

౯. అకార సదృశః ప్రజ్ఞః ప్రజ్ఞయా సదృశాగమః।
అగమై స్సదృశారంభ ఆరంభ సదృశోదయః ॥
రఘువంశము 1-15

గీ॥ పొగసునకుఁ దగునట్టి తెల్విఁగలవాఁడు
తెలివికిందగు చదువుల వెలయువాఁడు
చదువులకుఁ దగిన పనివి సల్పువాఁడు
పనికిఁదగినట్టి పెంపునఁ దనరువాఁడు.

౧౦. వర్ణ ప్రకర్షే సతి కర్ణికారం
ధునోతి నిర్గంధతయాస్మ చేతః
ప్రాయేణ సామగ్ర్య విధౌ గుణానాం
పరాఙ్ముఖీ విశ్వసృజః ప్రవృత్తిః ॥ — కుమార సంభవము.

గీ॥ నిండు వన్నియఁ గలిగియుఁ గొండగోఁగు
తావి లేకుక్కి చేత డెందము నొగిల్చె
తర్పుగ గొనము లన్నియుఁ గూర్చుపట్ల
పెడమొగం బిడు వేలుపుపెద్ద నడత.

౧౧. అపమేఘోదయం వర్షమదృష్టకుసుమం ఫలమ్।
అతర్కి తోపపన్నం వోదర్శనం ప్రతిభాతి మే ॥
— కుమార సంభవము 6-53.

గీ॥ కారుమబ్బు గ్రమ్మకయె కురిసెడువాన
పువ్వు కానరాక పొడము పండు
తలఁతు మీర లిట్లు దరిసెన మిచ్చుట
యారః నాకుఁ గోరనట్టి కోర్కె.

౧౨. ఇన్దీవరేణ నయనం, ముఖ మంబుజేన,
కుందేన దంత, మధరం నవపల్లవేన,
అంగాని చంపకదలై స్స విధాయ వేధాః
కాంతే! కథం ఘటితవా నుపలేన చేతః॥ —శృంగార తిలకము.

గీ॥ వల్లఁగలువఁ జూడ్కి, నగుమోముఁ దమ్మిచే,
మొల్లచేతఁ బల్లు, మో విగురువఁ,
గడమ మేను సంపెగలఁ జేసి యా బమ్మ
చెలువ! తాత నెట్లు సలిపె నెదఁద ।

౧౩. ఆదర్శనా త్ప్రవిష్టా సా మే సురలోకసుందరీ హృదయమ్ ।
బాణేన మకరకేతోః కృతమార్గ మవంధ్యపాతేన ॥
— విక్రమోర్వశీయ

గీ॥ పచ్చవిల్తువి తప్పిపోవక తగిలిన
తూపుచేఁ జేయఁబడినట్టి త్రోవఁగల్గ
నాదుడెందంబు లోపల న్పాదుకొనియెఁ
గన్న యంతనె యావేల్పుటన్ను మిన్న.

౧౪. యదాలోకే సూక్ష్మం వ్రజతి సహసా తద్విపులతాం
యదర్ధే విచ్ఛిన్నం భవతి కృతసంధాన మివ తత్
ప్రకృత్యా యద్వక్రం తదపి సమరేఖం నయనయో
ర్న మే దూరే కించి త్క్షణమపి న పార్శ్వే రథజవాత్.
— అభిజ్ఞాన శాకుంతలము.

కం॥ చిన్నది పెద్దదిగా, విడి
యున్నది కలసి నటు, వంక నురునది నరిగాఁ
జెన్నారు దవునఁ జెంగటఁ
గన్నులఁ బడ దెద్ది తేరు కదువడిఁ బోవన్.

౧౫. సరసిజ మనువిద్ధం శైవలేనాపి రమ్యం
మలినమపి హిమాంశో ర్లక్ష్మ లక్ష్మీం తనోతి
ఇయ మధిక మనోజ్ఞా వల్కలేనాపి తన్వీ
కిమివ హి మధురాణా మ్మండనం నాకృతీనామ్ ।
— అభిజ్ఞాన శాకుంతలము.

గీ॥ తమ్మి పొలుపారు నాచునఁ దగిలియైన
మెఱుఁగు విడు పలుపయ్యుఁ జందురుని మచ్చ

నార చీరైన నీమె చెన్నారు నంద
మైన రూపులకుఁ దొడవు కావిదెద్ది.

౧౬. గచ్ఛతి పుర శ్శరీరం ధావతి పశ్చా దసం స్తుతం చేతః
చీనాంశుకమివ కేతోః ప్రతివాతం నీయమానస్య ॥
అభిజ్ఞాన శాకుంతలము

కం॥ బొంది మును నడుచుచున్నది
డెంద మెఱుక లేక పాఱెడి న్వెనువెన్కన్
దొందరగ నెదురు గాలిన్
జెంది పదగనున్న పట్టుచీర విధమునన్ ।

౧౭. తవ కుసుమశరత్వం శీతరశ్మిత్వ మిందో
ర్ద్వయ మిద మయథార్థం దృశ్యతే మద్విధేషు
విసృజతి హిమగర్భై రగ్ని మిందు ర్మయూఖై
స్త్వమపి కుసుమబాణా న్వజ్రసారీ కరోషి ।
అభిజ్ఞాన శాకుంతలము

ఉ॥ పూవుల యమ్ములం గలుగు ప్రోడవు నీవఁట! చల్లనైనవాఁ
డా విరితమ్మిగొంగ యఁట! యచ్చెరువౌ ననుఁబోలునట్టివా
రీ వెదమాట నమ్మఁగలరే యలరేదొర చల్లు నిప్పులన్
నీవునుఁ బూల ములుకులను వింతువుగా మది దూసిపోవఁగన్.

౧౮. యాత్యేకతోఽ స్తశిఖరం పతిరోషధీనా
మావిష్కృతోఽరుణ పురస్సర ఏకతోఽర్కః
తేజోద్వయస్య యుగప ద్వ్యసనోదయాభ్యాం
లోకో నియమ్యత ఇవాత్మదశాంతరేషు॥
అభిజ్ఞాన శాకుంతలము

గీ॥ ఒక్కవైపు గ్రుంకుచుండెను జాబిలి
నెగడు నొక్కప్రక్క జగము కన్ను
మించుజంట కీడుమేలులచేఁ బజ
తెలుపఁబడునటు తన దెసలమాద్పు.

౧౯. రమ్యాణి వీక్ష్య మధురాంశ్చ నిశమ్య శబ్దాన్
పర్యుత్సుకో భవతి యత్సుఖితోఽపి జంతుః
తచ్చేతసా స్మరతి నూన మబోధపూర్వం
భావస్థిరాణి జననాంతర సౌహృదాని. —అభిజ్ఞాన శాకుంతలము

గీ॥ అందములఁజూచి తీయ సద్దాలకించి
వనరు సుకమున్న వజ దేవివలన నా క
తంబుచేఁ దొలిపుట్టులందలి యితములఁ
దెలియ కెద నాటినవి మదిం దలఁచుచుండు.

౨౦. స్త్రీణా మశిక్షిత పటుత్వ మమానుషీషు
సందృశ్యతే కిముత యాః ప్రతిబోధవత్యః
ప్రాగంతరిక్ష గమనాత్ స్వమపత్యజాత
మన్యైర్ద్విజైః పరభృతాః ఖలు పోషయన్తి॥
—అభిజ్ఞాన శాకుంతలము

కం॥ చెలులకు మప్పని నేరుపు
వలనగు మానిసులు కాని వానన్, నెఱజా
ణలఁ జెప్పనేల తమ పి
ల్లలఁ గోయిల లొండు పిట్టలం బెంపించున్.

౨౧. శరీరం క్షామాం స్యాదసతి దయితాలింగన సుఖే
భవేత్సాస్రం చక్షుః క్షణమపి న సా దృశ్యత ఇతి
తయా సారంగాక్ష్యా త్వమపి న కదాచి ద్విరహితం
ప్రసక్తే నిర్వాణే హృదయ పరితాపం వ్రజసి కిమ్॥
—మాళవికాగ్ని మిత్రము

గీ॥ చెలియ కౌఁగిలి దొరకక చిక్కె మేను
నెలతఁ గానక కనులు నీరునించుఁ
గాని సుంతయుఁ బాయవు గద కలికిని
డెందమా! నీవు వలవంత బొందనేల?

# ౨౮. ఉమర్ ఖయామ్ రుబాయత్*

## 102. కర్తవ్య వర్తమానము :

౧. పార్శీ మూలము : Bashiguft Shigūfa mai biyān ai sāqī
Dast az 'amali Zuhd bidār ai sāqī
Murgi gardūn dar rahsh par mīzand.

౨. ఆంగ్లము : Come, fill the cup, and in the fire of Spring
Your Winter-garment of Repentance fling :
The Bird of Time has but a little way
To flutter-and the Bird is on the Wing.

౩. సంస్కృతము శ్లో॥ పాత్రం సంపూర్యాయాహి కిం తపస్యసి యౌవనే।
వ శ్యోద్ధి నోన్మకో జీవపక్షీ దోధూయతే బలాత్ ॥

గీతి॥ నవ నవ వికసిత పుష్పానవ మధ్బుత మానయేమమయి పాత్రి।
సత్వర మేహి ధునీహి క్రతువ్రత కఠోర కర్మహే పాత్రి ॥

భుజంగి॥ డయిష్యన్ ధునోతి। స్వపక్షౌ పతత్రీ।

౪. తెనిగింపు : మూఁపు[1]॥ జరిగిన పవిత్రై వగవకు
మరుదుగ నీ కోరుకొన్న హాయి కుడువు మూ
పిరుపులఁ గెగిరిన నీ కది
దొరకదు మఱి మిగులఁ దవివితోఁద న్మనుమా ॥

చెండు[2]॥ సీవిరి న్దెమ్మ విచ్చెదు నవె ననలు
మూలకుఁ ద్రొక్కు నోము న్గొపు చెలియ।
వెదలిపో తెక్కలు విదిలిచె న్పులుగు ॥

* ఇందలి ఆంగ్లపద్యము ఫిట్జ్ గెరాల్డుగారిది. సంస్కృతాంధ్రములు దాసుగారివి.
1. 'మూఁపు' అనగా కందము. అది 'స్కంధ' శబ్దభవము.
2. 'చెండు' అనగా మంజరి.

# 103. జీవాత్మ :

౧. పార్సీ మూలము : Ai dil zi ghubāri jism agar pākshū yī
Tū rūhi mujarradī bar aflāk Shū yī
'Arshast nishemani tū sharmat bādā
Kāī wa muqīmi Khiltaī Khāk Shū yī

౨. ఆంగ్లము : Why, if the soul can fling the Dust aside,
And naked on the Air of Heaven ride.
Is't not a Shame-is't not a Shame for him
So long in this Clay suburb to abide !

౩. సంస్కృతము : శ్లో॥ స్వర్గః సిద్యే దాత్మనశ్చే। త్పౌరుషే ణైవ కర్మణా।
స్పృహణీయం నకస్యాపి। జీవనం దుఃఖ భాజనం ॥

గీతి॥ త్వం హే మానస వపుషః పఙ్కం ప్రక్షాలయేః సమర్థాచ్చేత్
సుర వర్త్మని యద్యపి సంబోభూయేథాస్తమాం స్వయం నగ్నః।
స్వర్గపురి భవేద్యది తవసదన మహో త్వం కిమిహ నజిహ్రీయాః।
ఆగచ్ఛేః కిం మృణ్మయలోకనివాసీ కథం భవేర్హన్త॥

౪. తెనిగింపు : మూఁపు॥ అంటిన దుగ్గి తుడుచుకొని
మింట న్విరిమేనఁ దుదకు మెలఁగఁ గలిగినన్,
దంటాలమారి మైతా
ల్వింటింట న్విగ్గుమాలి యెటు లిటు తిరుగున్,

చెండు॥ ఉల్లమా! నీవు నీ యొడలిపై మురికి
కడువడి గడుగుకో। కలిగెదవేని
మింటఁ దొడుగు లేక మెలఁగెదవేని
గొప్ప వేల్పు సరసఁ గూర్చుందువేని
సిగ్గులేదా నీ కిపే యిట వచ్చి
యీ పాడు కొంపలో నిఱికెదవిట్లు॥

## 104. విధి వ్రాత:

౧. పార్సీ మూలము : Zīn pesh nishānī būdanī hā būdast
Paiwastayi qalam zi nek ū bad nāsūdast
Dar rōzi azal harānchi bā īst badād
Gammi Khurdan Wa Kōshīdani mā bīhōdast.

౨. ఆంగ్లము : The Moving Finger Writes; and having Writ,
Moves on : nor all your Piety nor Wit
Shall lure it back to cancel half a Line.
Nor all your Tears Wash out a Word of it.

సంస్కృతము : శ్లో॥ విధాత్రా లిఖితం కోఽపి పరిమార్ష్టుం న శక్యతే
యేనకేనాప్యుపాయేన భక్త్యా వా తపసాథవా ॥

గీతి॥ దైవ మలేఖీదాదౌ లలాటఫలకేషు భావికర్మ ఫలమ్
గుణదోష సమాలేఖి న్యస్య పరివృత్యతేఽప్యవిశ్రాన్తా ।
ప్రథమ దిన ఏవ సృష్టే ర్నిరణైషీయిష్ట భావ్యవశ్య ఫలమ్
అస్మా త్పౌరుష మఖిలం చిన్తాస్మాకం వృథైవ లోభూత॥

౪. తెనిగింపు : మూ(పు॥ వేలుపు వ్రాయుచు నడుపు
వ్రేలి వా వ్రాలు దిద్దనేరవుగా నీ
కేలా యీ తడి పొడి మది
వాలకము లివెల్ల నేలపాలే తుదకున్॥

చెందు॥ వలయువ ట్లే తలవ్రాలుండెఁ దొల్లి ;
అరయదు మేలొగు లాగని పుడుక
వేల పన్నక ముందె నెలపెఁ దా విరుకు
నమ్మయ్యేదు మన దెవ్వర మెల్లఁ దుదకు॥

## 105. విధి వంచితుడు:

౧. పార్సీ మూలము : Bar rahguzaram hazār jā dām nahī
Gōī Ki ba gīrmat agarm gām nahī
Yak zarra zi hukmi tū jahān Khālīnīst.
Hukm tū Kunī va 'āsīmi nām nahī.

౨. ఆంగ్లము : Oh Thou, Who didst with pitfall and with gin
Beset the Road I was to wander in,
Thou wilt not with Predestined Evil round
Emmesh, and then impute my Fall to Sin!

౩. సంస్కృతము : శ్లో॥ మమ ప్రవృత్తే ర్వ్యామాత స్త్వయాచే త్క్రియతే విధే
పాశ స్త్వమే వాపరాధీ మమ దోషో న విద్యతే ॥

గీ॥ ప్రతి పద మపి మార్గేమే స్థాపయసిత్వం సహస్రశః పాశాన్
మాపి పతిషి ర్పిత స్త్వా పీత్యేవం మాం విజాగదిషి త్వమ్
నాస్తి చరాచరా మేత న్మనాగపి తవానధీన మాహోస్విత్
ఆజ్ఞాం త్వమేవ కురుషే తథాహి మమ దుష్టనామవిదధాసి॥

౪. తెనిగింపు : మూఁపు॥ నీవే కలుఁగులఁ ద్రవ్వితి
నీవే వల పన్నినాఁడ వేఁ జను త్రోవన్
నావేల్పా! తప్పని యై
నీవే దిద్ద కిటు నన్ను నెగ్గించెదవా?

చెందు॥ ఏ నేగు త్రోవలో నీవు వే చోట్ల
నక్కఱి నిక్కఱి యురి పన్నినావు,
అడుగిడెదేని యం దంకించి నన్ను
బట్టెద నంచుఁ దప్పక పల్కినావు,
వింగి నేలలలోన నీవు లోఁ గొనక
యున్న దావేదియు మత్త కాలేదు,
వంపు నీ వొనరింతు పై పెచ్చు నాకు
వెంబర వి తను పేరు పెట్టెదవు॥

# ౨౯. ఋక్సంగ్రహము

## 106. ఇంద్రసూక్తము :

—: ఋక్కు-చౌదరువు, వంతులు ౧౪, వది ౩, ఉసి ౨ :—

స రి పి సా రి ని సనీ రి పిసా పీ సారి స సని సా నిసారి
అహ న్వృత్రం వృత్రతరం వ్యంస మింద్రో వజ్రేణ మహతా వధేన।
సా రి సానిసరిసానీ సపీ సా రి సస ససనిసా రి పీసా
స్కంధాం సీవ కులిశేనా వివృక్ణాహిః శయత ఉప పృక్పృథివ్యాః॥

అనువాదము : వడివడిం బగవారిఁ బడఁగూల్చు వెరవు
వాఁడి కైదువు చేతఁ బట్టి యా వేల్పు
కడు వాన నడ్డిన కఱవు చేతులను
ద్రెంచిన నక్కూళ దెబ్బునఁ గూలెఁ
గొమ్మలతోఁ గూడ గొడ్డలి వలనఁ
దెగి యొఱగిన చెట్టు తెఱఁగున నేల॥

## 107. నదీసూక్తము :

—: ఋక్కు-ఒంటిదర్వు, వంతులు ౯, వది ౪, ఉసి ౨ :—

పసారి సాసానని సాని సాపీ సారి సనిస రిపీసా రిసాసా
ప్రపర్వతానా ముశతీ ఉపస్థా దశ్వే ఇవ విషితే హాసమానే।
పారిప నీసా పీ సరి సనీ సాస రి స పీ సాస రి సాససాసా॥

అనువాదము : గొప్ప పందెం బారు గుఱ్ఱము లట్లు
లేఁగల న్గదుప మల్లెడు మొదవు లటు
ఒండొరు సైపలే కొడ్డులు మించి
తగిలి పాఱెన్ గొండదరినుండి యేఱ్లు॥

# ౩౦. తల్లి వినికి

[లలితా సహస్రనామ వివృతి]

## 108. కలితలలిత :

నామము : "కామేశజ్ఞాత సౌభాగ్యమార్దవోరుద్వయాన్వితా"

అనువాదము : పగర ముక్కంటికే యగపడు మవ్వంపు
బెడగు తొడకవ క్రొత్తడి సిరాజి
కోర్కె లుడిగి తను గొల్చువారికిఁ దప్ప
మై యొప్పగించని మంచిపిల్ల
తగులాటమున్ మాని తా నొంటిగాఁ గాక
నుడికెడు బోదతో నుండు పడుచు
ఎప్పు డొందొరిమిక నెల్లరియెడఁ జూపు
జాలిగుండియ లో నెసంగు తల్లి

అప్పసము తన తప్పుల నొప్పుకొనుచు
నొరుల నెగ్గింప కొందిలి నోర్చుకొనుచు
అందఱికి మేల్ తలంచెడి యడియ నెంచి
పొందుగా నేలుకొను వేలుపుఁ దలకట్టు॥



# పరిశిష్టము

## వినాయక ప్రార్థన :

గీ॥ సహజ పాండిత్యమునఁ గావ్యరచనఁ జేసి
యెల్లర హితముఁ గోరెద నేకదంత!
నేను విన్నది యడుగను గాని నీదు
నండికొండయ్య సాయమె నాకుఁ జాలు.

## 2. జగన్మోహినితో శివుడు :

సీ॥ నీ జడన్ జూచినన్ జిలువఱేఁడు స్ఫురించె
రంగ దుత్తుంగ సారంగగమన!
నీ నెన్నుదురుఁ గన్న నెలవంక తలఁపయ్యె
రాజిత భీత సారంగనయన!
నీ నడ లరయ గంగావీచికలు దోఁచె
రమ్య విలోల సారంగచికుర!
నీ కౌనుఁ గాంచినన్ మిన్ను జ్ఞప్తికి వచ్చె
రమణీయ ఫాల సారంగ పాణి!
చెలువములఁ గొంత పోలిక కలదు మనకుఁ
గాని యిసుమంతయైన నా మానసంబు
మాడ్కి నీ మనసున్న మన్మథుని పీడ
నన్ను సోకుట లెట్టులో సన్నుతాంగి!

అంబరీష చరిత్రము

## 3. మద ద్విరదము :

లయగ్రాహి

చారుగతి నొద్దునకుఁ జేరుకొని వృతములఁ
ఘోరముగ లాగి జలపూరమున గంతున్
దోరమగు తొండమున నీరమును బీల్చుచు గ
భీర నినదంబు పయిమీఱ నెగఁజిమ్మున్
సారస రజంబున శరీర మొగిఁ బూయఁబర
భూరి కనకాచలము తీరున వెలుంగున్
ఘోరువ మునింగి పయి మీఱు తన చేత నొక
నీరజముఁ బట్టి పొలుపారఁగ నటించున్.

## 4. నక్ర విక్రమము :

సీ॥ భూరి భూత్కార సంభూత గంభీర గుం
భ ధ్వానమున శైలపంక్తి వడఁక
దారుణ వాల సంతాడనోద్ధూత తో
య కణంబు లంబర మంటికొనఁగ
వతుల హింతాల త్వగంచిత దేహ సం
గతి జలజంతు శోణితము వాఱ
ఖర ముఖర నఖర ప్రకర కంపనంబునఁ
గొలను సర్వమును బంకిలము గాగ

పొంచి మైపెంచి కుప్పించి పొంకరించి
యొక్క మకరీంద్రుఁ డిభరాజు నొడిసి పట్టి

గీ॥ బలయుతుని శూలజాడ్యంబు పట్టినట్టు
ఉత్తముని దుష్టకామిని యొడిపినట్లు
జ్ఞానవంతుని నిద్దుర పూనినట్లు
సమదగజమును మొసలి వాఁచి పట్టె.

## 5. భక్తరక్షణలోలుఁడు :

రగడ

ఇరుత నాతను బడిన నుడి విని పొలుపుచెడి పరుగిడు జనకువలెఁ
గడఁగి తత్తరపాటుతోఁ గనుకరల వెరవెరపాటుతోఁ దన
యొడలి చెమటల నీటుతో నెద నుబ్బు గుబ్బల పోటుతోఁ గదు
నదరు పెదవిని గాటుతో జీరాడు పై వలెవాటుతో మయి
గడను గుంకుమ తేటతో వెనుకడను కీల్జడవేటుతో ముడి
వదెదు భూషణకోటితోఁ గొనవంగు చిటికెనగోటితో మొల
నరలు కనకపు గాటితో వెన్ననెదు చక్కని బోటితో వెలు
వడియెఁ గేళిగృహంబు వెన్నుఁడు భక్తరక్షణలోలుఁడై.

— గజేంద్ర మోక్షణము

## 6. శివుని ముసలి వాలకము :

సీ॥ వలముగ వాచి పిక్కలు పెట్టి చీమూరు
నరుగుల నొరసి వ్రేలాడు పుచ్చె
బొద్దు కయికి నందఁబోనట్లు పొరవుగా
ముడుతలఁ దోఁగాడు పొదక పొట్ట
యెండిపోయిన లోఁతు గుండియ కిరుతట్టు
పొట్టయై కదలాడు వట్టి రెట్ట
ముడిగిపోయిన ముక్కు మొటి పెదవులు పాచి
వట్టి విస్తుం గ్రమ్ము మిట్టపండ్లు

పుసులు వ్రాతెతు మిడిగ్రుడ్లు బురకబొంది
యెలుక తానుగల్ వెత్తిన వ్వేల్గు బెల్గు
గూను నద్ది మొలన్ దగుల్కొన్న పోచ
గలుగు మత్త యవిటి పాఱుఁ డులికి పలికె.

సీ॥ ఈ వెత్తి పాఱుఁ, డీ యెంబన్న, ముసలి, యం
బేద, పిసాళి, యవిటి, చెవంటి,
జోగి, కైలాటకాఁ, డో, గెల్లిదుఁడు, బొల్లి,
యులిపిగొ, ట్బెల్లాపి, యూబదేబె,
పిసనారి, నోర్మొంగ, పీఱిఁడి, టాటోటు,
వచ్చుకాఁడు, పలుగు, నాలిముచ్చు,
గూని మొ, ద్దతగుఁడు, కొయ్యాద్రి, ప్పడియరి,
బరికాయ, మిడిగ్రుడ్లవాఁడు, గిడ్డ,
యేనె బేసికంటి నవి మీ రెన్నుకొనుఁడు
కాఁకతో నన్ను గెల్పె మీ కన్నపట్టి
మీకుఁ దగు నల్లుఁడన్ మఱి సాకు మావి
నలుపుఁడి పెండ్లి యెల్లుండి జాలమేల?

## 7. కన్నెగౌరు విన్నపము :

సీ॥ అలరు విల్తుని తీము రతచిన నీ కాఁడు
దానిపైఁ గోరిక తగులదేమొ!
గడుసు విత్తరి బూటకపు మాట నమ్మట
తగవు కాదని పాటి తప్పెదేమొ!
చదలేలు నా యేర లెదురయి విన్ దన
బిగి కౌఁగిటన్ గ్రుచ్చి విడువదేమొ!

నా మంచి తలిదండ్రులు లేమటి నీ వెద
వాలకమున కొప్పఁ జాలరేమొ ।

విన్ను గానక నలిమైన విల్వనోప
మించి పోపీకు వన్ బ్రతికించు వడిగ
నేల జాలము వన్నిఁక నేలుకొనుము
కదలి మిసిమి తాల్ప ! కను మంగమొల వేల్ప !

గౌరప్ప పెండ్లి

## 8. హిరణ్యాక్షుడు:

సీ॥ నీలి కొండన్ బోలు నెమ్మేనఁ దొగరు దు
వ్వటి సంజకెంజాయ పగది మెఱయ
న్వప్రతాపానలజ్వాల లనంగ నౌ
దల మీరి పల్లజడలు వెలుంగ
నఖిల జగజ్జయ ప్రాప్త కీర్త్యంకురా
కారత నెలపంకకోర లలర
వోలి ముప్పిరిగొన్న యుక్కుదూలమ్ము ల
వఁదగు చేతులఁ బెద్ద గద చెలంగ

ధరణి యడుగుల కదర వమరులు బెదర
'దిక్కులన్ గెల్చి వచ్చెద దీవన లిదు
మన్న!' యని నాకు మ్రొక్కి న్వర్గాక్షుఁ దేగె
వనుజుని న్మళ్ళి గన నోచనైతి నకట ।

— ప్రహ్లాద చరిత్రము

## 9. ఆత్మహితము:

గీ॥ నిరత మన్యోన్యమైత్రితోఁ బరగుచుంట
చెలఁగి మన తొంటి మర్యాద నిలుపుకొంట
జాతినీతులు తప్పక జరుగుచుంట
చాలు నాకాశపంచాంగ మేల మనకు.

గీ॥ నూవుగింజ బ్రాహ్మణుని సామెతగ మింట
మిద్దె లల్లుకొనుచు నొద్దనున్న
దాని తన్నుకొనుట తగునె, యాముష్మిక
స్వప్న మేల యిహము జారఁ గనక ॥

## 10. భీష్మ ప్రతిజ్ఞ:

సీ॥ రాలనీ చుక్కలు, కూలనీ కులగిరు,
లిలఁ గ్రుంకనీ, వార్ధు లింకిపోని,
ఆకస్మికముగ సూర్యాచంద్రముల్ గతుల్
దప్పనీ, జగమెల్ల తల్లడిలని,
పిడుగులు గురియనీ, పెటిలి బ్రహ్మాండముల్
పేలాల పోలికం బేలిపడని,
ప్రళయము పుట్టనీ, భైరవుండు త్రిశూల
ధారుఁడై ఫాలనేత్రము తెరువని,

గీ॥ యేది యెట్లైనఁ గాని యొక్కింతయైన
నా ప్రతిన తప్పిపోవదు నమ్మవలయు
అఖిలపావని నా తల్లి యయ్యెనేని
ధర్మ మెప్పుడు నాతండ్రి తప్పఁడేని.

## 11. భీష్మ సంగ్రామము:

సీ॥ విరిగెడు నరదము, లొరిగెడు గుఱ్ఱముల్,
తెగిపడు సిడములు, ద్రెళ్ళు కరులు,
బంతులవలెఁ ద్రుళ్ళు చటుల శిరంబులు,
మొత్తంబులై యాడు మొండెములను,
పొడియగు శస్త్రాస్త్రములు, మూలఁబడిన సా
రథులు, మూర్ఛిల్లిన రథికవరులు,
ఘవరాసులౌ మాంసఖండము, లేఱుల
సొబగునఁ బాఱెడు శోణితంబు

గీ॥ గలుగునట్టుల పాండవబలముఁ ద్రుంచు
భీష్మ విక్రమముం జూచి భీర మెదలి
యున్న యర్జునుఁ బరికించి వెన్నుఁ డపుడు
తలను బంకించి యిట్లనెఁ దాల్మిఁ దొరఁగి.

భీష్మ చరిత్రము

## 12. పసిపాప:

గీ॥ వెక్కి వెక్కి యేడ్పు, వెంటనే చిఱునవ్వు,
నడుమ నడుమ బుస్సలిడుట, పాల
గ్రుక్క మ్రింగినంత గుటగుటలాడెడి
వేడ్కఁ దెలిసి యనుభవించనైతి.

## 13. ప్రాయపు మాపు:

చ॥ వయసు వసంతవేఁవలె వచ్చుటకై కవిపెట్టి యుబ్బుచున్
దఱితలఁ గల్గువారల నెదం గొవియాడుచు నూటలూరుచుం
ట యరిగె వక్కటా! బదు గనంగ భయంబును సిగ్గు దోఁచుటల్
[illegible] దొరంగియు స్మృతివిలాసము జూపుట లిప్పు తప్పెఁగా.

## 14. తెలివి :

గీ॥ తెలివి గల్గియు లేనట్లు దిరుగువారు
తెలివి లేకుండి యున్నట్టు లులుకువారు
వెలుఁగుచున్నట్టి లోకంబు చెల్వుఁ జూచి
యెద్దియుం దోఁచకుండె నే నేమిసేతు ?

## 15. అస్తినాస్తి విచికిత్స :

సీ॥ ఉన్నదె జరుగుచున్న దటంచు వి
ర్లక్ష్యంబుఁ జూపెడు లక్ష్యవతులు
నున్నదానికి లేవి చిన్నెల నలరించి
నామంబు దిద్దెడు న్యాయమతులు
నున్న దెఱుంగక యున్నట్లు దెల్పంగఁ
జాలుట లెక్కించు సాంఖ్యరతులు
నున్నది మన మనుకున్నది సత్య వి
శేష మున్న దను విశేషగతులు

గీ॥ ఉన్నఁ జెల్లును లేకున్న నుత్తమంబు
సందియం బేల తలఁపుల శాంతిఁ బూనఁ
దనెడు యోగవ్రతులు గలియందు శాస్త్ర
వాదమాత్రులుగా నపవాదుఁ గొంద్రు॥

## 16. చంద్రోదయము :

చ॥ తరణియుఁ బశ్చిమాంబుధికిఁ దారె, విహంగము లుక్కిపట్లకుం
బిరబిరఁ బాఱెఁ, జీకటులు మీరె, సమీరుఁడు చల్లవారె, నం
బరమునఁ గుందసూనముల మాడ్కి రిక్కలు జాలువారె, బం
ధురగతి కైరవాప్తుఁ డుదితుండయి వెన్నెల వెండిగారఁగన్,

## 17. గౌతమి:

ఉ॥ అంతట బాలుఁ డీశ్వర పదాబ్జము లెంచుచు పోయి వేఁగి య
త్యంతముదంబున న్గనియె నాతత పర్వత గహ్వరాంతరా
క్రాంత మహాశ్మసంచయ విఘర్షణ భీషణ వప్రవాహ సం
క్రాంత వికాంతమీన మకరవ్రజభీకర గౌతమీనదిన్.

## 18. యమదూతలు :

ఉ॥ హుమ్మనువారు, భూరి పరిఘోన్నత బాహుల నప్పళించి రా
రమ్మనువారు, భీకర పరశ్వథము ల్పవరించి చెంగటన్
గ్రుమ్మరువారు, నిప్పులటు గ్రుడ్డులు ద్రిప్పెడువారు గాని దై
ర్యమ్మున వారిఁ బట్టుకొన రాఁ డొకఁడైన నదేమి చోద్యమో!

## 19. స్నిగ్ధ మనోరథము* :

సీ॥ నమగని గర్వించు నా యమ్మ లాలింత,
సంతుష్టి బొందిన జనకు ముద్దు,
పెన్నిధివలె నన్ను గన్నారఁ జూచిన
యగ్రజన్ముల పొంగు, నాఁడు తోడు,
జాలితోఁ జూచిన బట్టుదారులు, ముద
మందిన కోవిదు, లలరు కులము,
ముట్టుపా శ్వేపుచు మొదవు నాకెడు లేఁగ,
మేటి చదువుకొల్వు, మిద్దెటిల్లు,

[* ఇది అసలు దాసుగారి కోరికయే. వారి సర్వ సారస్వతము విట్లు స్వానుభవ మహిత మైనదే. అత్మీయతాశ్రుతి సుభగమైనదే.]

పొలములం దోటలం, జేతి పుస్తకమ్ము,
విన్నఁ బాడెదు పీణియ పీలకంత!
అనవరతమును నా కుంచి కవికరించి
కాలపాశంబు విడిపించి కావుమయ్య!

—మార్కండేయ చరిత్ర

## 20. దర్శనము:

కవిరి బాలాతప విభాంశుకము, ప్రబుద్ధ
సరసిజాక్షము, చంద్రికా దరహసితము,
నవ్యప్రారంభ శుభదర్శనంబు నైన
శారదదినంబు వలెనున్న నారసింహ.

## 21. నైజము

సీ॥ ఎండమావుల పీతినుండి యెట్టులఁ జల్వ
తెమ్మెర యేతెంచి తీర్పు దప్పి?
కుందే లెదిరి తన కొనవాడి కొమ్ములఁ
గ్రుచ్చి పులి న్నేలఁ గూల్పుటెట్లు?
పుట్టుగొడ్రాలి తొమ్మలు చేపునకు వచ్చి
పసిబిడ్డ యాఁకలిం బాపుటెట్లు?
మట్టివిత్తు న్నాట మఱి దానివలన నె
ప్పుడయిన మామిడి మొలచుటెట్లు?

గాడివిప్పునఁ దామర కలుగుటెట్టు?
లెండమావుండుటెట్లు లెద్దీనుటెట్లు?
ముసలివారికిఁ బిల్లలు పుట్టుటెట్టు?
బ్రాఁబుమాత్రైన పాలంబు మాఱుటెట్లు?

## 22. సౌందర్య రమారామములు :

సీ॥ మానికెయద్దము న్మఱపించు చంద్రవి
చెక్కిలిపైఁ జిఱునొక్కుసొగసు
ముదురుకెంపుల జతం బొదవు ముత్తెము లటు
పెదవులం బల్చాలు కదియు తీవి.........

సీ॥ సొగసైన పురుషుని మగువ చేరుచునుండఁ
బల్లింటు వంక పీర్వ్యాలవట్లు
కావిచో నెట్టు లెక్కలిక్క నా చెంతకు
వచ్చెదు నెవ్వని మెచ్చఁజొక.........

సీ॥ కలపి నా చూడ్కులఁ జెలిమిఁ దోడ్కొని యేగు
చేటవాలగు చూపు లిరుల పీవ
రవలకమ్మలు విగారపుఁ జెక్కు లొందొంట
మెఱుఁగులు రెట్టించి మేళగింపఁ
బల్కరించిన పోల్కఁ, బయ్యెద సరిదెడు
క్రైవడి గాజులు ఘల్లనంగఁ
జిక్కటి వవి యెగసక్కె మాడుచుఁ బిఱుం
దుల జడకుచ్చులు త్రుళ్ళియాడ

జిఱునగవు, నోరమోము, నువ్విగ్గు, వెనుకఁ
దిరిగి యడుగులు తడఁబడ నరుగ నెంత
పోఁడి, మా చేడె సొరవు నా ఋణముబంటి
యే మిరువుర మాలుమగల మింత విజము.

సీ॥ ఆ వధూవరుల కివ్యోన్య వార్తలు దెల్పఁ
చిమటారుగ వేగు చెలులచాలు
వలపుటాకులఁ దమ గళములఁ గట్టంగఁ
బడి టపా లందించు పావురాలు
ప్రతిహార కొక వింత రకమైన బొమ్మలం
బై వెల్లడించెదు వరగడాలు
నా దంపతులవలె నవ్వారి చెంగటఁ
బలికెడు నామవిచెలి గుటాలు

వంపుకొండు రొండొరుల కుపాయనాలు
మామగా నెద్దియో యొక యానవాలు
ధరణిజారాముల యెదల తగులుకోలు
వినవ నాల్కలు కావలె వేనవేలు.

సీ॥ కొప్పు విలువఁబడి విప్పిన స్నిలి గా
జాల మాలారము పోల్కఁ దెలఁగు నేల
నే వంకఁ గన్గొన్న నా వైపుననె నల్ల
కల్వలు దండలు గట్టుచుండు
చిన్నారి పొన్నారి చిఱునవ్వు నవ్విన
జలజల ముత్తెము లొలుకుచుండు
పలికిన గోయిలల్ చిలుకలు గోరలు
బ్రమసి బ్రోగుచు జేఁ టాఱుచుండు

శిశిర యాయింతి యద్దాని చెలువు చూచి
తీరవలెఁ గాని కొవియూర నేరి తరము?
యాపెతో నొక్కసారి మాటైన నాడ
కున్న నీ మగబ్రతుకవ్న యుత్తరిత్త.

## 23. మాయామానుష విగ్రహుఁడు :

సీ॥ ఎఱుక దొఱంగిన ట్లేల యుండెదవు స
ర్వజ్ఞుఁడ వయ్యుఁ బావనచరిత్ర!
యరఁకువఁ జూపె దేలా త్రిలోకైక వీ
రాగ్రణి వయ్యు సత్యప్రతిజ్ఞ!
అర్థి విధంబున నగపడె దేలా స
మస్తేశ్వరుఁడ వయ్యు నార్తపోష!
బతిమాలె దేల నీ భటుల జగన్నియా
మకుఁడ వీవయ్యు ధర్మస్వరూప!

వాలి నాతిగఁ జేసిన రామచంద్ర!
యెఱుఁగ శక్యమె నీ తత్వ మినకులేంద్ర!
పాదుసంచార! జానకీ స్వాంతచోర!
భక్తమందార భవదూర! పరమపురుష!

-యథార్థ రామాయణము

## పెండ్లి ప్రయాణము :

సీ॥ దారకు ముఱుకోల దాకు బంకెఱుగని
శైబ్యాది హయ చతుష్టయము నాల్గు
వేదంబు లన, వాని వేగంబునకు దేవ
భ్రమియింపఁ జూపఱు వందు వగుచు,
దేవునిఁ గాదను తెలిసిన గొల్లతో
గుల దీవనల నొక్క క్రోసు వించు,
జగదభి మోహన శ్యామల తనుకాంతి
చదలకు గరుడ పచ్చలను దాపఁ,

పెండ్లి వైభవమున శౌరి వెడలుటయ్యె
దూరమే దూరమై కోర్కె చేరువయ్యె

మదను కోలంకు న్వాడి పదును లయ్యె
మావికాయల పాల్గణ మావమయ్యె.

## 25. పెండ్లికూతురు :

సీ॥ దూర్వాంకురములతో నన్నజాజులు
మొగిలిరేకులు జారుసిగను జుట్టి
తళుక్కుచెక్కుగులాబి దంతపు నిగనిగ
రవలకమ్మల జోడు చెవులఁ బెట్టి
లేఁతప్రాయపు బిగి చేతిగాజులు రైక
యొడ్డాణము న్వెలియుడుపుఁ గట్టి
ముద్దు మొగంబున ముత్తైదు చిన్నెల
నంట పేరిట నోగిరంబుఁ బట్టి

వెన్నెలలు చీకటులు బర్వ కన్నదోయి
ముత్తెము ల్గెంపు లొల్కెడు ముద్దువాయి
నందమగు రుక్మిణీకన్య కలరు హాయి
చాటిచెప్పంగ వెయినోళ్ళు చాలవోయి.

—రుక్మిణీ కల్యాణము

## 26. నిత్యసత్యరతి:

శా॥ సప్తద్వీపము లేలు నప్పుడు, సమస్తప్రౌఢ సామంత రా
ద్గుప్తవ్యూహముఁ దోలు నప్పుడు, పురంద్రీరత్న మిల్లాలితో
గుప్తక్రీడలఁ దేలు నప్పు డిపుడుం గోరంతయు న్వాపి మ
త్తృప్తిం దోఁచదు నిత్య సత్యరతుఖిం ద్వేషించుగా సంపదల్.

## 27. వినష్టకష్టము:

సీ॥ కల వోవ కష్టము ల్దొలగిన యట్టుల
        నవ్వు దేలిన మాపి రాదినట్లు
పెను వగాధము దాటి వెల్లడి గనునట్లు
        చెదరిన సిరి మళ్ళి చేరినట్లు
సతత శంకితము విస్పష్టంబు నైనట్లు
        మూర్ఛఁ దేరినఁ దెల్వి మొనయునట్లు
అన విరుచు వర్గ మది యుట్టిపడ్డట్లు
        ముప్పను గారడి ముగియునట్లు

హాయిగా రాచదంపతు లర్భకుండు
బ్రతుకుఁ గని కౌశికమునీంద్రుఁ బ్రస్తుతించి
యెల్ల దేవతలకు మ్రొక్కి ఋషుల కెరగి
యెంతయుం గల్మి పుట్టిలో యిల్లు సేర.

—హరిశ్చంద్రోపాఖ్యానము

## 28. సత్యము:

వేదసరసునందు విహరించు రాయంచ
విబుధ వృక్షమునకు వెలయు చిలుక
మంచి చెలిమియోడ కుంచిన చుక్కాని
ప్రాణహితునిఁ గావు సూనృతంబు!

## 29. మిట్ట మధ్యాహ్నము:

వేసవిప్రొద్దు నట్టనడి మిన్నున నిల్చిన యెండ నిప్పుగాఁ
గాసెడు; మేని నీరు కరఁ జిమ్మఁగఁ దగ్గి యదుంగు చెంతకున్
దాసెడుఁ; జెట్ల తొఱ్ఱల సదంగి దగంబడి పిట్ట లెల్లరన్
గూసెడుఁ; గెందుకాము అదిగో గరియారము కేక వేసెడున్.

తమ్ము మాలిన ధర్మంబు తగదఁటంచుఁ
దలల వలరించు తమ యొదళులను గావఁ
బూని దాఁచిన పీడల ముఖుఁచు కొనియోఁ
భారతంబులు; నడుమింట శాసుఁ దొప్పె.

## 30. ముద్దు ముచ్చటలు:

వల్లవిగాలి విందుగంజాబిలి యామని పందు తోఁటలో
వల్లివ మల్లిపువ్వుపొద యచ్చటఁ జిన్కులఁ జిమ్ము జంత్ర మా
మొల్లపు చిల్కపాట యట మోహము దీఱుట వన్నెకానితో
మెల్లని సోయగంబు వద మీఱుట యబ్బునె యట్టిముచ్చటల్.

చూడవిదేమి యొక్కమొగిఁ జూపులు చీఁకటివెల్గులీన; యా
టాడ విదేమి పల్పెదవులందున ముత్యము కెంపులొల్కఁగాఁ;
దాడవిదేమి కన్గవల వాలిచి చిల్కలు నాలకింపఁ గే
ల్మోడుచు జంటపై వలుక బొందుటలేలనె ప్రాణనాయికా!

“తాలవఁ బొందఁ గోరి కమలంబదు దబ్బుఱ వంత ముత్తెపుం
జాలెగఁ జిమ్ముచున్ బెదవి బా టొనరించుచుఁ గోణచూపులన్
గేలుల నొద్దుకొంచు గిలిగింత కొకంతట నవ్వి పక్కనన్
దాలిమి దూల సోలు వెలతం దమితీఱఁగ ముద్దులాడెదన్.”

సారంగధర చరిత్రము



## అనుబంధము ౧

# దాసుగారి సూక్తులు

### అధికుడు-అల్పుడు

అలతివానికి బలువుని చెలిమి మొదల
దొడ్డగానున్నఁ దుదకది చెడ్డసేయు॥
గొప్పవారు పోరునప్పుడు తక్కువ
వారు చెంతనుండి బాగుపడరు॥ —నూజిగంటి

### అపకారము

ప్రాణగొడ్డం బెద్ది వచ్చిన న్స్వంతయు
జనముల కపకృతి నల్పరాదు.

— యథార్థ రామాయణము

మారొనర్పకు మే యపకారికైన. — జానకీ శపథము

### అప్రయోజకులు

మఱి కొఱమాలిన మానిసికన్న
వేవేల రెట్లుల వెలబొమ్మ మేలు. — వేల్పుమాట

### అల్పత్వము

అలఁతివాని కెక్కువగు ప్రాపు గల్గిన
దిమ్మవట్టి యొరులఁ దిట్టుచుండు. — నూజిగంటి

### అసంతృప్తి

కోరినట్టుల చేసుకొన వీలుకాదు
ఉండకతీర దేదో వెత్తి తుదకు. — వేల్పుమాట

### అసూయ

ఒరుల గొప్పఁ జూచి యోర్వలేకుండిన
వాఁడు తప్పకుండ కీడుపొందు. — అంబరీష చరిత్ర

